# ప్రబోధ చంద్రోదయము

నందిమల్లయ-ఘంట సింగయ

పరిష్కర్త:
కళాప్రపూర్ణ
నిడుదవోలు వేంకటరావు




ప్రచురణ:
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి
కళాభవన్ సైఫాబాదు - హైదరాబాదు-4

ప్రథమ ముద్రణ 1976
ప్రతులు 2000

వెల రూ. 6-00

Paper used for the printing of the book was made available by the Government of India at concessional rate.

ముద్రణ :
జయశ్రీ ప్రింటింగ్ అండ్ బుక్‌బైండింగ్‌వర్క్స్
విద్యానగర్, హైద్రాబాద్-44.

# తొలిపలుకు

తెలుగు సారస్వతములో జంటకవులుగా ప్రసిద్ధిచెందిన నంది మల్లయ, ఘంట సింగయ కవుల ప్రబోధచంద్రోదయ, వరాహపురాణములను కందుకూరి వీరేశలింగంపంతులుగారు ఈ శతాబ్ది తొలిపాదములో ప్రకటించినారు. ఆప్రతులు నేడు భాషావాఙ్మయ జిజ్ఞాసువులకు లభించుటలేదు. వీటి పునర్ముద్రణ యోగ్యతను గుర్తించి, అకాడమీ కార్యవర్గము పై రెండు గ్రంథములలో నొకటి యగు ప్రబోధచంద్రోదయముయొక్క వ్రాతప్రతిని సిద్ధముచేయు బాధ్యతను కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారికి అప్పగించినది.

ప్రబోధచంద్రోదయమును కృష్ణమిశ్రు డనుకవి అద్వైతవేదాంత నాటకముగా సంస్కృతమున రచించినాడు. ఇదియొక అంతరార్థముగల ఆధ్యాత్మిక రూపకము (Allegorical drama). మన జంట కవులు దీనిని తేటగా సూటిగా తెలుగునకు తెచ్చిరి.

తెనుగుసాహితీ జగత్తున నిడుదవోలు వేంకటరావుగారి పేరు విననివారుండరు. వారీ గ్రంథమునకు విపులవిషయ సంశోధితముగా చక్కని పీఠికను చేర్చిరి. వారికి అకాడమీపక్షాన అనేక ధన్యవాదములు.

రెండవ గ్రంథమైన వరాహపురాణమును అకాడమి త్వరలో ప్రకటించు చున్నది.

హైదరాబాదు
1-1-77

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# ప్రబోధ చంద్రోదయము

## విషయసూచిక

# కృతజ్ఞతలు

ప్రాచీనాంధ్ర సాహిత్యమున విశిష్టమగు నీప్రబోధచంద్రోదయమునకు సంపాదకత్వము ననుగ్రహించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికి, కార్య దర్శులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలను నిందు మూలమున తెలుపుకొనుచున్నాను.

ఈ గ్రంథపీఠికారచనయందు నాకుపకరించిన గ్రంథకర్తలకు, వ్యాస రచయితలకు నానమస్సులు. ఈగ్రంధపీఠికా, పరిష్కరణ విషయమున నాకు చేదోడు వాదోడుగానున్న నాపెద్దకుమారుడు చిరంజీవి శివసుందరేశ్వరరావునకు నా యాశీస్సులు.

22-9-1976
లక్ష్మీకాంతనిలయము
2-2-1137/5
క్రొత్తనల్లకుంట (సరస్వతీనగరము)
హైదరాబాదు-44

నిడుదవోలు వేంకటరావు

# ప్రబోధ చంద్రోదయము

## పీఠిక

### తాళపత్ర ప్రతులు

ఈ కావ్యమునకు తాళపత్రప్రతులు తంజావూరు సరస్వతీ మహలు నందుగాని - ఆంధ్రసాహిత్య పరిషద్భాండాగారముగాని లేవు - అవి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండారమునందే యుండెడివి. ప్రస్తుతము తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయములో నున్నవి. వాని వివరములు.

1. R- 50 (C) Fol. 171-a-214-b సమగ్రము కాని కృత్యవతరణిక యందు గృతిపతి వంశవర్ణన పద్యములు పెక్కు విడనాడబడెను. వ్రాత చక్కనై యున్నది. తప్పులు లేవు. శైథిల్యములేదు. గ్రంధపాతము లంతకంటె లేవు. లేఖన కాలము - విలంబి కార్తీక బహుళ విదియ.

2. D. 578 - పత్రములు 76.
సమగ్రము. వ్రాతమంచిది. పత్రమున నొకవైపు పేరు వ్రాయబడినది - తప్పులుగలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

3. R. 446. 53 పత్రములు.
సమగ్రము. వ్రాతయంతమంచిదిగాదు. తప్పులులేవు. శైథిల్యగ్రంథపాతములులేవు - లేఖకుడు బహుధాన్య మార్గశిర శుద్ధ విదియా ఆదివారము నాటికి పూర్తిచేసినాడు - ఇది క్రీ. శ. 29-11-1818తో సరిపోవును.

— ముద్రణ ప్రతి —

ఈ గ్రంథమును తొలుత (1900) ముద్రించినవారు వీరేశలింగముపంతులు గారు. వారు తమ దీనిని చింతామణీ ముద్రాక్షరశాల (మదరాసు)లో ముద్రించినారు. దీని ప్రథమముద్రణ ముఖపత్రము నిందుతో నిచ్చితివి - క్రీ. శ. 1904లో వీరేశలింగముగారే ఈచింతామణి ముద్రాక్షశాలలో ఈ కృతికర్తల వరాహ పురాణమును ముద్రించి యున్నారు

ప్రథమ ముద్రణప్రతి
ముఖపత్రము

శ్రీ

# ప్రబోధ చంద్రోదయము

ఈ పద్యకావ్యము
కృష్ణమిశ్ర విరచిత సంస్కృత నాటకాను సారముగా

**నంది - మల్లయ, ఘంట - సింగయ్య**
అను కవులచే
రచియింపఁబడినది

చెన్నపురి
**శ్రీచింతామణి ముద్రాక్షరశాలయందు**
ముద్రింపఁబడినది.

1900

వెల 6 అణాలు

# గ్రంథకర్తలు - జంటకవులు

## (నంది మల్లయ - ఘంట సింగయలు)

వీరిచరిత్ర నెఱుంగుటకు వీరికృతులు రెండుమాత్రమే మనకు లభ్యములగు చున్నవి.

1. వరాహపురాణము. 2. ప్రబోధ చంద్రోదయము వీరి పేరున వినబడు మఱి యొకగ్రంథము. కవులషష్ఠము (భాగవత షష్ఠస్కంధము) ఇందుకొన్ని పద్యములు మాత్రము లభ్యమగుచున్నవి. లభ్యములైన వానిరెండింటినుండి వీరిచరిత్రను గూర్చిన వివరములు:-

వరాహపురాణము-

సీ. అపుడు సభావేది కాగ్రస్థితులమైన
మమ్ము వాగీశ్వరీ మంత్రరాజ
సిద్ధి పారగులఁ గౌశిక భరద్వాజగో
త్రుల మహాదేవాంఘ్రి జలజభక్తి
పరతంత్రమతుల నాపస్తంబ సూత్రుల
గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల నతిశాంత చిత్తులఁ దనకు నా
శ్రితుల భాషాద్వయకృతి నిరూఢ

గీ. శేముషీభూషణుల నంది సింగనార్య
తనయుమల్లన కవికులోత్తముని ఘంట
నాదధీమణి కూర్మినందనుని మలయ
మారుతాంకితు సింగయమంత్రిఁజూచి. (1-31)

ప్రబోధ చంద్రోదయము.

సీ. కలరు కౌశికగోత్ర కలశాంబురాశి మం
దారంబు సంగీతనంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁ మల్లయమనీషి
అతని మేనల్లుఁ డంచిత భారద్వాజ గో
త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు మలయమార్య

గీ. తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్కు
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు పమరులు స
మర్థు లీకృతిరాజ నిర్మాణమునకు. (1-24)

పైరెండు కృతులలో నాశ్వాసాంతగద్య లొకే తీరున నున్నవి.

"ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధ సారస్వతాభినంది నంది సింగయామాత్యపుత్ర మల్లయమనీషితల్లజ మలయమారుతాభిధాన నాగయ ప్రధాన తనయ సింగయకవిపుంగవ ప్రణీతంబైన............ప్రథమాశ్వాసము"

పైగద్యయందేగాక, వరాహపురాణమున వీరిరువురు నెల్లప్పుడు నొకరి నొకరు విడువక శరీరప్రాణమువలె నుండువారని యిట్లు తెలుపబడినది.-

క. మీరిరువురు నెప్పుడును శ
రీర ప్రాణములక్రియఁ జరింతురు మిగులం
గూరిమిఁ గృతిఁ బ్రతిపద్యము
చారుఫణితి చెప్పఁగలరు చాటువుగాఁగన్. (1-32)

ఇందువలన వీరిరువురు [1] జంటకవులని స్పష్టము

-నివాసము-

వీరిరువురి నివాసము^ మైసూరు రాష్ట్రమున కోలారు మండలమున చిక బల్లారము తాలూకా నంది గ్రామమని యొక పరిశోధకులు తెలిపిరి [2]. ఇందువలన వీరు దాక్షిణాత్యకవు లగుచున్నారు. కాని-కర్నూలు మండలమున గల మహానంది క్షేత్రమును బట్టియు - వీరిలో నొకడైన ఘంటసింగయ గురువు-అఘోర శివాచార్యుల నివాసము కడప మండలమున పుష్పగిరి యగుట చేతను వీరు తెలుగు దేశపు కవులే యనుట నిశ్చితము

-వంశవివరణ-

నంది మల్లయ-

ఇతడు కౌశికగోత్రుడు. ఆపస్తబంసూత్రుడు. దక్షిణామూర్తి గురు శిష్యుడు. నంది సింగమంత్రికి పోచమ్మకు పుత్రుడు.

ఘంట సింగయ-

ఈతడు భారద్వాజగోత్రుడు ఆపస్తంబసూత్రుడు ఘంట నాగయకు అమ్మలాంబకు పుత్రుడు. అఘోర శివాచార్యుల శిష్యుడు.

నంది మల్లయకు ఘంట సింగయ మేనల్లుడని పైనచెప్పబడినది - వారి సంబంధము నీ క్రిందివిధముగా నుండునని యూహింపవచ్చును

నంది సింగమంత్రి. భా. పోచమ — ఘంట నాగయ భా. అమ్మలాంబ

నంది మల్లయ — అమ్మలాంబ — ఘంట సింగయ (మలయమారుతకవి.)

---

1. చూడుడు: తెలుగులో జంటకవులు అను శీర్షిక.
2. అష్టదిగ్గజకవిసమాజములో రాయల నాశ్రయించిన తొలికవి ఎవరు ? - శ్రీ కే. యస్. కోదండరామయ్య. పుటలు. 62-63-(1972)

నందిమల్లయచెల్లెలు-అమ్మలాంబ ఘంటసింగయ,తల్లియగుటచేత, నందిమల్లయకు ఘంటసింగయ మేనల్లుడు.

పారిజాతపహరణమును రచించిన నంది తిమ్మన తను మలయమారుత కవీంద్రునకు అనగా ఘంట సింగయ్యకు మేనల్లుడనని యిట్లు చెప్పుకొన్నాడు.

సీ కౌశికగోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేల పవిత్రకులుఁడు
నంది సింగామాత్యునకు దిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడ మలయమారుతకవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధ ఘన చతురంత యా
నమహాగ్రహార సన్మానయుతుఁడు

గీ తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోర గురువరు శిష్యుండు పారిజాత
హరణమను కావ్య మొనరించె నాంధ్ర భాష
నాదివాకర తారాసుధాకరముగ. (5-108)

పైపద్యమున నందితిమ్మన - ఘంటసింగయ్య మేనల్లుడని స్పష్టపడినది నందిమల్లయ్యకు ఘంటసింగయకు-మేనల్లుడుకాగా, ఆతనిమేనల్లుడు నందితిమ్మన యని మనకు విశదమైనది. అప్పుడు సంపూర్ణవంశ వృక్ష మిట్లుండును—

1 నంది సింగమంత్రి పోచమ — ఘంట నాగయ - అమ్మలాంబ

(నంది సింగమంత్రి పోచమ సంతానము:)
మల్లయ — అమ్మలాంబ

(ఘంట నాగయ - అమ్మలాంబ సంతానము:)
ఘంట సింగయ (మలయమారుతకవి)
చెల్లెలు తిమ్మాంబ (భర్త నంది సింగన 2)

(మల్లయ సంతానము:)
2 నందిసింగన - తిమ్మాంబ
నందితిమ్మన

## మలయమారుత బిరుదాభిధానులు

ఘంట సింగయమంత్రి మలయమారు తాఁకితుడు. ఈవిషయము తానే చెప్పుకొన్నాడు. ఇక్కవి పారిజాతపహరణ కర్తయగు నందితిమ్మనకు మేనమామ. తిమ్మన నీతనిని "విద్యావివేకచతురుఁడని" (5 108) స్తుతించినాడు ఈ బిరుద ధారులలో సర్వన్నయనుకవి యొకడు కలడు. ఆతనిషష్ఠస్కంధము నుండి యొక సీసపద్యము ప్రబంధ రత్నాకరమున పెదపాటిజగ్గన (1600 ప్రాంతము)చే నుద్ధరింపబడినది [1] ఇక మూడవవాడు మల్లన యనుకవి. ఇతని కూర్మపురాణము నుండి యొక కందపద్యము ఆనంద రంగరాట్ఛందమున (3-208) పేర్కొన బడినది. దీనినిబట్టి ఇట్టిచిత్రమైన బిరుదము కలవారు ముగ్గురు కలరని స్పష్టము.

మలయమారుతమునకు-గల మూడు గుణములలో సౌరభ్యము లేక పరిమళ మొకటి కలదు. కవిత్వమున పరిమళము గుబాళించునట్లు చేయగల కవికిట్టి బిరుదము లభించును. సంస్కృతమున పరిమళ కాళిదాసు గలడు. అట్లే ఘంట సింగనయు పరిమళ యుక్తమైన కవిత చెప్పుటచే నీతనికి

"మలయమారుతకవి"

అనుబిరుదు లభించినట్లు మనము గ్రహింపవచ్చును.

ఇట్టి కవితాసాహితీ విద్యావైదుష్యముగల వారుగాన - వీరికి తెలుగు సారస్వతమున - జంటకవులలోనేగాక, కవులలోను ఉన్నతస్థానము లభించినది.

## అఘోరశివాచార్యుడు

క నెఁకొన్నభక్తి సద్గురు
కులచూడారత్నమగు నఘోరశివాచా
ర్యుల దివ్యపాదపద్మం
బులకు నమస్కృతు లొనర్చి పూతాత్ములమై. (వరాహ-1-19)

---

1. ప్రబంధ రత్నావళి - కొత్త కూర్పు - 469 పద్యము. (1976).

అని వరాహపురాణమునను. "అఘోరశివుల భజించి యేకాగ్రచిత్తమునను" అని ప్రబోధచంద్రోదయమునను - ఈశివాచార్యుడు ప్రస్తుతింపబడినాడు పారిజాతపహరణకర్త నంది తిమ్మనకు నీతడే గురువు. రాజశేఖరచరిత్రకర్త మాదయగారి మల్లనకూడ అఘోరశివాచార్య గురుకరుణావిశేషలబ్ధసారస్వతుడే. అందువలన నీత డాకాలమున ప్రసిద్ధశివాచార్యుడని మనము గ్రహింపవచ్చును.[1]

## జంటకవుల విద్యావైదుష్యము

వీరు "వాగీశ్వరీ మంత్ర సిద్ధిపారగుల" మని చెప్పుకొన్నారు, వాగీశ్వరీ అనగా సరస్వతి - వీరు సరస్వతీమంత్రసిద్ధు లగుటయేగాక - శివప్రసాద లబ్ధసారస్వతు లగుటచేత వీరివిద్యావైదుష్యము ఆధ్యాత్మిక విశేషము గలదని మనము గ్రహింపవచ్చును.

"సంగీతనంది నంది సింగన" అని ప్రబోధచంద్రోదయప్రారంబునను ఆశ్వాసాంతగద్యలలో 'సారస్వతాభినంది నందిసింగన' అని చెప్పబడియుండుట చేతను నందిసింగన సంగీత సాహిత్యముల యందు రెండింటను ప్రవీణుడని తెలియుచున్నది. కావున సంగీత సాహిత్యములు వీరికి వంశాను గతము.

వీ రుభాయ భాషాకవితాదక్షులని యీక్రింది యుదాహృతులు తెలుపు చున్నవి

"ఉభయభాషల నేర్పరులు"

"భాషాద్వయకృతి నిరూఢశేముషీ భూషణులు"

## కాలనిర్ణయము

ప్రబోధచంద్రోదయము; వరహాపురాణము, కవులషష్ఠము అనువీరి మూడు కృతులలో మొదటది ప్రబోధచంద్రోదయము.

---

1. ఈతని గూర్చిన వివరములు. ఆంధ్రదేశ చారిత్రక భూగోళసర్వస్వము మొదటి సంపుటములో చూడనగును.

## ప్రబోధచంద్రోదయము

ఇది అనంతామాత్యుని గంగమంత్రికి కృతి - అతడు క్రీ.శ. 1460 ప్రాంతముననున్న వూసపాటి బసవభూపాలుని మంత్రియని యీ కావ్యమునవే గలదు-

...... తమ్మయామాత్య విభుకుమార
వీరబసవక్ష్మాచక్ర విభునిచేత
మన్ననలు గాంచి మించిన మహితుఁడితఁడు
మనుజమాత్రుండె గంగయా మాత్యవరుఁడు. (1-16)

కావున నీకృతి రచనాకాలము క్రీ శ. 1460 ప్రాంతము కావలెను. ఈకృతియందు.

"శ్రీకర నరసింగ నృపవశీకర నయవిద్యాకరణ" (2-1)

యనుపద్యములలో నరసింగనృపతి యొకడు పేర్కొనబడియున్నాడు.

ఈనరసింగనృపతి సాళువనరసింగరాయలే యైనచో నీతడు విజయనగర రాజ్యమును సంగమవంశీయుల వెనుక క్రీ శ. 1486నుండి క్రీ.శ. 1493వఱకు పాలించెను అప్పుడు ప్రబోధచంద్రోదయము - క్రీ.శ. 1493 మధ్యరచితము కావలెను

కీర్తిశేషులు శేషయ్యగారు మాత్రము పైకృతి కాలనిర్ణయమున భిన్నాభిప్రాయము కనబఱచినారు

"సాళువ నరసింగరాయని జీవగ్రాహముగా బట్టుకొనుటలో పురుషోత్తమ గజపతికి బసవనృపాలుడు విశేషసహాయముచేసి యుండును. ఆఘనకార్యము సాధించుటకు గంగయమంత్రి బుద్ధిచాతుర్యము ప్రధానకారణమైయుండును. ఈ భావమే "నరసింహ నృపవశీకరనయవిద్యాకరణ" అను వాక్యములో సూచింప బడినది. పురుషోత్తమగజపతి క్రీ.శ.1366 మొదలు - 1396వఱకు రాజ్యము చేసినాడు. సాళువ నరసింహరాయలను 1367 ప్రాంతమున గజపతి పట్టుకొని

యుండును—క్రీ.శ.1370 ప్రాంతమున ప్రబోధచంద్రోదయము నీకవులు రచించి యుందురు"[1]

ఇచట శేషయ్యగారు శతాబ్దము నిచ్చుటలో పొరబడినారు. పురుషోత్తమ గజపతి క్రీ.శ. 1466 మొదలు 1496 వఱకు పాలించినాడు. 1467 ప్రాంతమున గజపతి పట్టుకొని యుండును. క్రీ.శ. 1470 ప్రాంతమున ప్రబోధచంద్రోదయము నీకవులు రచించి యుందురు – అని యుండవలెను.

గజపతితో నరసింగరాయలు విడివడి సంధి చేసుకొనుటకు గంగమంత్రి సహాయము చేసిన విషయమును పురస్కరించుకొని నందిమల్లయ ఘంటసింగయ కవులుపై దీనిని చెప్పియుందురు ఈసంఘటన క్రీ.శ. 1468లో జరిగినది. ఇది యైన మఱికొన్ని యేండ్లకు ప్రబోధచంద్రోదయ రచన జరిగియుండవలెను అది సుమారు క్రీ శ. 1470 ప్రాంతము. ప్రబోధచంద్రోదయ రచనా కాలమిదియని చెప్పవచ్చును – తక్కిన కృతులు వరాహపురాణము, కవులషష్ఠము రెండును – ప్రబోధచంద్రోదయము తరువాతివి. కావున వీరి రచనలలో ప్రబోధచంద్రోదయము మొదటిది.

## వరాహపురాణము

వరాహపురాణము తుళువనరసరాజున కంకితమీయబడినది. ఈ తుళువ నరసరాజు సాళువవంశీయుల వెనుక విజయనగర రాజ్యమును – క్రీ. శ. 1493 మొదలు క్రీ. శ. 1505 వఱకు పాలించెను. కావున వరాహపురాణము క్రీ శ. 1490–1500 మధ్య రచితము కావలెను. కృతిపతి తుళువ నరసరాజు విజయనగర సామ్రాజ్యము పరిపాలించిన సాళ్వ – నరసింగరాయల దండనాయకుడు. ఈవిషయము వరాహపురాణము నందిట్లు చెప్పబడినది.

"నరసింహ నృపాల దండనాయకతిలకా" (11–1)

---

1. ఆంధ్రకవితరంగిణి – 6వ సంపుటము – నందిమల్లయ ఘంటసింగయ కవులు. పుట 145.

"తదనంతరంబ కృతిపతికిం బతిమైన సాళువనరసింగరాజ రాజమౌళి పావనాన్వయంబు మొదల వర్ణింతము" (1-20)

"అట్టి (సాళ్వ) నరసింగరాజరత్నంబుచేత మన్నన వడసి సైన్యనాయక పట్టభద్రత్వంబున (1-24)"

ఈ నరసరాజు మండువా, బెడద. మాహురాది దుర్గముల జయించెనని యీకృతి యందుగలేదు నందితిమ్మన పారిజాతపహరణమున నింకను మఱికొన్ని విజయములను సాధించెనని నరసరాజును వర్ణించినాడు. ఇవి యన్నియు సాళ్వ నరసింగరాయల కొఱకేయని విజయనగరచరిత్రకారు లేకగ్రీవముగా నంగీకరించి యున్నారు.

వరాహపురాణము క్రీ శ 1490 ప్రాంతమున రచింపబడి యుండవచ్చును.

"వరాహపురాణము క్రీ.శ.1490 సంవత్సరమునకు పూర్వముననుక్రీ.శ. 1485 సంవత్సరమునకు బిమ్మటను రచియింప బడియె" ననుట నిశ్చయము అని శేషయ్యగారు వ్రాసినారు.[1]

ద్వాదశాశ్వాస పరిమితమైన నీగ్రంథము కృష్ణరాయల వారితండ్రి తుళువ నరసనాయకున కంకిత మీయబడినది. కృతిస్వీకారము నాటికి నరసరాజు సాళ్వ నరసింగరాయల యొద్ద సైన్యనాయకుడు. దీనిని కృతిపతి కోరికపై వీరు రచించ లేదు. ఈజంట కవుల "కృతి ప్రారంభమును కర్ణాకర్ణికా వశంబున" నరసరాజు విని వీరిని పిలిపించి

"కావున మీరు దలంచిన
శ్రీవారాహంబు మంచికృతి మాపేరం
గావింపుఁ డనుచు" (1-14)

కప్పురము వీడ్యమునిచ్చి కృతి తనపేర వెలయించుకొన్నాడు. ఇట్లేకాశి కాఖండ రచనా ప్రారంభమును వీరభద్రారెడ్డి కర్ణాకర్ణికా వశంబున వినియేతత్

---

1. ఆంధ్రకవి తరంగిణి-పూర్వోక్తము పుట 133

కృతికర్త యైన శ్రీనాథుని బిలిపించి సముచితాసనమున కూర్చుండ నియమించి యచట్చనున్న వీరభద్రారెడ్డి యన్నయగు వేమారెడ్డి 'ఇపుడు చెప్పఁదొడంగిన యీ ప్రబంధ మంకితము సేయు వీరభద్రయ్య పేర" అని శ్రీనాథునికి కర్పూర తాంబూల సహితజంబూనదాంబరాభరణంబు లిచ్చి చెప్పించికొన్నాడు. ఈవిధముగా ప్రఖ్యాతులైనకవులు గ్రంథరచన కుపక్రమించుటయు, నద్దానిని రాజులు విని యంకితము పుచ్చుకొనుటయు జరుగుచుండును.

సాళ్వతుళువాన్వయముల సంధికాలమున బుట్టిన ఈ గ్రంథము చరిత్రకారుల కత్యంతము విలువైనది. బ్రౌను, సీతారామాచార్యులవారు వారినిఘంటువుల యందు నీ జంటకవుల గ్రంథములను గ్రహించినట్లు కానరాదు. వీరేశలింగం పంతులుగారి దయవలన నీ రెండు గ్రంథములు సూర్యాలోకమును బడసినవి. టేకుమళ్ళ అచ్చుతరావుగారీ గ్రంథముపై చక్కని విమర్శ వ్రాసిరి.[1] రాయలవారి కాలమున హరిభట్టు వరాహపురాణము నాంధ్రీకరించెను[2]. ఈ వరాహపురాణ ద్వయతులనాత్మక సమీక్ష రెండుగ్రంథములు లభ్యములైననాడుగాని చేయుటకు వీలుండదు.

వరాహపురాదిము చారిత్రకముగానేగాక సాంఘికముగా గూడవిలువైనది.

## కవులషష్ఠము

కవుల షష్ఠమనియు, శృంగారషష్ఠమనియు దీనిని లాక్షణికులు పేర్కొనిరి. ఆంధ్రభాగవతమున పోతన షష్ఠస్కంధము నాంధ్రీకరించలేదు. ఏర్చూరిసింగన హరిభట్టు, సర్వన, రాచమల్లుకవులు (వీరిదే కవులషష్ఠమను నష్టప్రాయమైన గ్రంథము) షష్ఠస్కంధము నాంధ్రీకరించిరి. కాని ఈ షష్ఠస్కంధములలో ఏర్చూరి సింగన కృతమైన గ్రంధమే ఆంధ్రభాగవతమునందు కుదురుకొన్నది. తాళపత్రములందును నట్లేకలదు. అయినను హరిభట్టు కృతషష్ఠస్కంధములోని

1. చూ. విజయనగర సామ్రాజ్యాంధ్రవాఙ్మయము. ప్రథమభాగము
2. హరిభట్టు వరాహపురాణమును డాక్టరు దేవరకొండ చిన్నికృష్ణశర్మగారు (రాజధాని కళాశాల-మద్రాసు) పరిష్కరించి, అచ్చొత్తించిరి.

పద్యములుకొన్ని సింగనకృతిలో చేరకపోలేదు. అదెట్లు జరిగినదో చెప్పుట కష్టము షష్ఠస్కంధకవులు ఇంచుమించు సమకాలీనులు. కవులషష్ఠమని బహు వచనరూపము చెప్పబడుటచే నీగ్రంథము నందిమల్లయ, ఘంటసింగయ్యలదే యని చెప్పవచ్చును

ఈగ్రంథము లభ్యముకాలేదు కాని యిందలి మొదటిపద్యము ఆడిదము సూరన తన కవిసంశయవిచ్ఛేదము అను లక్షణగ్రంథమున నుదాహరించినాడు.

శ్రీరామామణి సీతనాథుని యురస్సీమన్ నిజచ్ఛాయఁగ
న్నారం గన్గొని యాత్మ నన్యవని తేర్ష్యం బూనఁ దత్కంధరన్
హారం బున్పుచు నింకఁజూడు మన దానౌటం ద్రపం జెందఁ జె
ల్వారున్ రాముఁడు బ్రోచుఁగాత చికతిమ్మాధీశు తిమ్మాధిపున్" (1-99)

గణపవరపువేంకటకవి, కవులషష్ఠము-అని ఆంధ్రప్రయోగరత్నాకరమున తిమ్మయతనూజుడు తిమ్మరాజని చికశబ్దము లేకుండనే వాడియున్నాడు.

చండాంశు ప్రభవీక్ష తిమ్మయతనూజా తిమ్మ! విద్వస్తపా
షండంబైన త్రిలింగ భాగవత షష్ఠస్కంధ భాగంబు నీ
కుం డక్కెన్ జతురాననత్వగుణ యుక్తుల్ మీఱ వాణీ మనో
ఖాండారోద్ధతి చూఱకార బిరుదప్రఖ్యాతిసార్థంబుగాన్

ఇందువలన చికతిమ్మరాజునకు తిమ్మరాజను పేరున్నట్లు స్పష్టము.

ముద్దరాజు రామన కవిజనసంజీవనిలో ( 1-34 ) పైపద్యములోని రెండు మూడు పాదము లుదాహరింపబడినవి.

కవులషష్ఠము కృతిపొందిన తిమ్మరాజు క్రీ.శ 1521 సంవత్సరమున నున్నట్లుగా నీక్రింది కన్నడశాసనము తెలుపుచున్నది.

తిమ్మరాజు శాసనము

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంగళు ౧౪౪౩ నైయ విక్రమ సంవత్సరద మాఘశు ౭ లూ శ్రీమతు రామచంద్ర వీరభాండారతె

ఉత్తమగండ గండరగండ; గండభేరుండ సరస్వతీమనోభండార చూఱకాఱ బిరుదాంకిత రాదయేఱువసింహాసనాధీశ్వర శ్రీమత్కాశ్యపగోత్రద శ్రీమన్మహా మండలేశ్వర చికతిమ్మయదేవ మహాఅరసుగళ కొమారరు తిమ్మరాజగళు తొట్టు ధర్మశాసనద క్రమవెంతంతెందెరె శ్రీరామచంద్రదేవర అమృతపడిగె శ్రీవీర కృష్ణరాయ మహారాయరు సమర్పిస్త సొండూరు సీమె వొళిగణ తాళూరగ్రామ దలు ఇత్యాది 1

దీనివలన తిమ్మరాజు క్రీ.శ. 1521-1522లో యేఱువసీమకు నాయకుడుగా నున్నట్లు స్పష్టము. ఇది కృష్ణదేవరాయల కాలము.[1]

పై వివరములనుబట్టి వీరిగ్రంథరచనాక్రమ మీరీతిగా నిర్ణయింపవచ్చును:

| | |
|---|---|
| 1. ప్రబోధచంద్రోదయము | క్రీ.శ. 1470-80 ప్రాంతము |
| 2. వరాహపురాణము | క్రీ.శ. 1480-90 ప్రాంతము |
| 3. కవులషష్ఠము | క్రీ.శ. 1500-1510 ప్రాంతము |

ఇందువలన నందిమల్లయ ఘంటసింగయ కవులు క్రీ.శ. 1450 క్రీ.శ. 1520 మధ్యప్రాంతమున జీవించియుండిరని మనము నిశ్చయింపవచ్చును.

## ఇతరేతరగ్రంథములు

వీరిరువురు వేర్వేఱుగా గ్రంథరచన చేసినట్లు ప్రబంధరత్నావళియను సంకలన గ్రంథమువలన తెలియుచున్నది. అందు నందిమల్లయ మదనసేనము అనుకావ్యమునుండి నాలుగు పద్యము లుదాహరింపబడినవి.

నందిమల్లయతండ్రి సింగన "సారస్వతాభినంది' కదా--ఆతడు వామన పురాణమును, బలరామవిజయమును రచించెను. ఆగ్రంథములలోని పద్యములు ఆనందరంగరాట్ఛందమున నుదాహరింపబడినవి.

---

1. శృంగారషష్ఠము. డా. నేలటూరి వెంకటరమణయ్య. కిన్నెర. జూలై 1953 పుటలు 531-533

నందిసింగన - వామనపురాణము

క. కాంతాలలామ నిన్నే
కాంతంబునఁ బల్కరింతుఁ గల్గిన కార్యం
బెంతయు ముద మలర విను
మంతట నీమదికిఁ దెలివిదై యుండు జుమీ! (3-175)

గీ సరస చిత్రాన్నములును రసాయనములు
భక్ష్యములు నూఱుఁబిండ్లును చాలుజున్ను (3-172)

ఇందు రెండు పాదములే యుదాహరింపబడినవి.

నంది సింగన - బలరామవిజయము

క్షత్రియ ధర్మంబున మాం
ధాత్రుఁడు రాజ్యంబు నీతిఁ దగఁ బాలించెన్
శాత్రవ రహితంబుగ నిజ
గోత్రము వెలయంగఁ బ్రజలు గొనియాడంగన్. (3-71)

ఇక కవుల షష్ఠమునుండి మదన సేనమునుండి లభ్యమైన పద్యములను ననుబంధములో నిచ్చియున్నాను.

---

తెలుగున వామన పురాణరచయితలలో— నందిసింగన మొదటివాడు తరువాత

1. లింగమగుంట రామకవి క్రీ శ. 1550
2. ఎలకూచి బాలసరస్వతి క్రీ.శ. 1600 (అలభ్యము)
3. పోన్నతోట ఓబళకవి క్రీ.శ. 1650 (లభ్యము)

వామనపురాణము నాంధ్రీకరించిరి.

# కృతిపతి అనంతామాత్యుని గంగయమంత్రి

తెలుగున కావ్యప్రబంధము లందన్నిట సాధారణముగా కృత్యాదిలో ఇష్ట దేవతాస్తుతి, సుకవిస్తుతి, కుకవినింద, అవెనుక కృతిపతి కవిని పిలిపించి గ్రంథము వ్రాయుమనుట కవియు కృతిపతి వంశమును వర్ణించి, అట్టివంశమున జన్మించిన యతనికి తనకృతి నంకిత మొసగుచున్నానని షష్ఠ్యంతములు చెప్పుట పరిపాటియై యున్నది. కాని తెలుగు ప్రబోధచంద్రోదయమున నాందీ ప్రస్తావనలతో కూడిన నాటకారంభమువలె నుండియు షష్ఠ్యంతము లుండెడు ప్రబంధమువలె అవతారిక ముగియుచున్నది. ఇదియొక క్రొత్తపద్ధతి.

నాంది[1]

1. శంకరస్తుతి
2. గౌరీస్తుతి
3. విఘ్నేశ్వరస్తుతి
4. లక్ష్మీనారాయణస్తుతి
5. సరస్వతీబ్రహ్మస్తుతి.

ప్రస్తావన

కృతిపతి గంగమంత్రి సభానాయకుడు. ఆతడు బ్రహ్మసంతతివాడు. బ్రహ్మపౌత్రుడైన కశ్యపుని గోత్రమువాడు. అందుచే వంశవర్ణనతో నిది ప్రారంభ మగుచున్నది.

గంగమంత్రి శివపూజానంతరము గోష్ఠిలో నచ్చటివారు "నీవంటి ఆధ్యాత్మిక ప్రవృత్తిగలవారికి తగిన వేదాంతగ్రంథ మొకటి గలదు. అది సంస్కృత మునను్న ప్రబోధచంద్రోదయము అను నాటకము. అది తెలుగుభాషలో నీ కంకితమైన కస్తూరి పరిమళము బంగారమునకు, బంగారముకాంతి కస్తూరికి నచ్చినట్లగును" అని విన్నవించి ప్రబోధచంద్రోదయ ప్రశస్తినిగూర్చి తెలిపిరి. (20-21) దానిని తెలుగుచేయుటకు నందిమల్లయ ఘంటసింగయకవులు సమర్థ

---

మూలమునందలి నాందీ శ్లోకములకు తెలుగు. వానిని విమర్శ భాగమున చూడ నగును.

లనియు సభవారిచేతనే చెప్పించుట జరిగినది. ఇట్లు కవిపేరుచెప్పుట నాటక ప్రస్తావనపద్ధతి.

## కృతిపతి వంశవివరములు

గంగమంత్రి పూసపాటి మాధవవర్మ వంశీయుడైన బసవభూపాలుని యొద్ద మంత్రిగానుండెడివాడు.

సీ. మాధవవర్మ భూమండలేశ్వరు వంశ
జలధికి నేరాజు చందమామ
యేరా జుదయశైల మెలమిని భేదించెఁ
గపటాహిత మదాంధకార మడఁగ
గజపతి సురధాణి గడిదుర్గముల కెల్ల
నే రాజు వజ్రంపుబోరుతలుపు
మహిమచే నేరాజు మఱపించె నల భగీ
రథ పృథు మాంధాతృ రఘురమణుల

గీ. నట్టి గుణశాలి తమ్మరాయనికుమార
వీరబసవక్షమాచక్ర విభునిచేత
మన్ననలు గాంచి మించిన మహితుఁ డితఁడు
మనుజ మాత్రుండె గంగయామాత్యవరుఁడు.

గంగమంత్రియేగాక ఆతనికి ప్రభువైన యీ బసవరాజును కవిపోషకుడు. ఈతడు నెల్లూరిమండలమున ఉదయగిరి రాజ్యమున కధిపతియై ఉదయగిరిలో నుండువాడు. దూబగుంట నారాయణకవి తన పంచతంత్రమను కృతిని నీ బసవరాజునకే అంకితము గావించెను. గంగమంత్రి బసవరాజు మంత్రిగావున నాతడు ఉదయగిరి వాస్తవ్యుడై యుండెనని మనము గ్రహింపవచ్చును.

### వంశవిశిష్టత

ఈ గంగమంత్రి ఆర్వేలనియోగిశాఖీయుడు. కాశ్యపగోత్రుడు. ఈగ్రంథమున నాతడు "పెసరవాయాన్వవాయ" అని సంబోధింపబడుటచేత నీతని

ఇంటిపేరు పెసరవాయవారని చెప్పవచ్చును. ఈ గ్రంథమున నిచ్చిన యాతని వంశవృక్షము




శ్రీనాథుని బావమరదియగు దగ్గుపల్లి దుగ్గన కృతమైన నాచికేతోపాఖ్యానము గంగమంత్రి కృతినందినట్లుగా నీగ్రంథమున నిట్లుగలదు.

ప్రఖ్యాత నాచికేతూ
పాఖ్యాన మహాప్రబంధపరిమళితసుధీ
వ్యాఖ్యానశ్రవణోదిత
సౌఖ్యాసంఘటిత చిత్రశంకరసఖ్యా॥ (4-72)

---

1 దేవమ్మ ) ఈరెండుపేర్లును గంగమంత్రి కృతినందిన నాసికేతూపాఖ్యానము
2 దుగ్గమ్మ ) నుండి గ్రహింప బడినవి.

ఇందును వంశవృక్ష మీయబడినది. రెండు గ్రంథములయందును వంశ వృక్షములు నొకటియేగావున ప్రత్యేకముగా నుదాహరింపలేదు.

గ్రామనామము

తెలుగులో చాలమంది ఇంటిపేర్లవలె పెసరవాయ గ్రామనామమే. కాని యీ గ్రామ మెచ్చటనున్నదో ఎవ్వరు నిర్ణయించి తెలుపలేదు. ఈ పెసరవాయ యెచ్చటిదోయని కీ శే, చాగంటిశేషయ్యగారు వ్రాసిరి. ఈ గ్రామము "కాకతి ప్రతాపరుద్రునికాలమున క్రీ శ 1299 అలంపురం బ్రహ్మేశ్వరాలయమందలి యొక శాసనములో పేర్కొనబడినది (తెలంగాణాశాసనములు రెండవసంపుటము కాకతీయ శాసనములు) అలంపురం మహబూబునగర మండలమున నున్నది. పెసరవాయ అజిల్లాలోనే యుండియుండవచ్చును[1].

పెసరవాయగంగమంత్రి అత్తవారును పెసరువాయాన్వయులే

గంగన ఆత్తవారును పెసరువాయాన్వయులే యని తెల్పుటకు దుర్గాభైరవరాజు వంశములోని లక్కసానమ్మభర్త ఆదిరాజు క్రీ శ. 1469 లో తిరుపతిలో ఒక శాసనము వేయించెమ. (నెం. 52 తి.తి.దే. సాళువనరసింహునికాలపు శాసనములు) అందు లక్క సానమ్మ పెసరువాయాన్వయమునకు సంబంధించినదని తెలుపబడియున్నది.

దుగ్గన నాచికేతూపాఖ్యానమున గంగమంత్రి చెందలూరి గంగమంత్రిగా పేర్కొనబడినాడు "చెందలూరిగ్రామము ఒంగోలు తాలూకాలో కడవకుదురు రైల్వేస్టేషనుకు 13 మైళ్లదూరమున నున్నది"[2]. గంగమంత్రి యిచ్చట చాల కాలము నివసించియుండవచ్చును. నాసికేతూపాఖ్యానకాలమున చెందలూరిలో నివసించి యుండవచ్చును. కావున తత్కర్త యట్లువ్రాయుట తటస్థించినది. అదిగాక దుగ్గన అనంతామాత్యుని గంగయవంశము వర్ణించినను కొన్ని వివర

---

1. 2. అనంతామాత్యునిగంగయ – నిడుదవోలు శివసుందరేశ్వరరావు ఆంధ్రదేశ చరిత్ర

భూగోళసర్వస్వము మొదటిసంపుటము – పుట 209–212

ములు విడిచినాడు. అప్పటి కాతనికి తెలిసిన గంగయవంశ వివరములు మాత్రమే వ్రాసియుండును. ప్రబోధచంద్రోదయకర్తలు మరికొన్ని యంశములు హెచ్చుగా తెలిసికొని గ్రంథస్థము చేసిరి.

## మంత్రిత్వము గంగనప్రతిభ

గంగమంత్రి పూసపాటి మాధవవర్మ సంతతివాడైన బసవభూపాలుని మంత్రి. ఈతడు గజపతిరాజులకు సామంతుడు. గజపతిరాజు కపిలేంద్ర గజపతి. క్రీ.శ. 1460 ప్రాంతమున కపిలేంద్రగజపతి ఉదయగిరి దుర్గమును స్వాధీనము చేసికొని బసవరాజు తండ్రియైన తమ్మభూపాలుని అధిపతిగ నియమించెను. తమ్మభూపాలుని తరువాత కుమారుడు బసవరాజు క్రీ.శ. 1471 లో ఉదయగిరి రాజ్యమున కధీశు డయ్యెను[1]. అప్పుడు కపిలేంద్రగజపతి కుమారుడు పురుషోత్తమ గజపతి రాజుగానుండెను.

గంగమంత్రి నీతియుగంధరుడుగా పేర్కొనబడినాడు

క. "నీతియుగంధర సుకవి
వ్రాతప్రస్తుతయశోధురంధర (2-80)

ఇచట నీతి యనగా రాజనీతి. యుగంధరుడు ప్రాచీనమంత్రులలో ప్రసిద్ధుడు. గంగమంత్రి రాజనీతి విశారదత్వమును వెల్లడించునొక సన్నివేశమీ గ్రంథముననే కలదు.

"శ్రీకర వీక్షణదాన
శ్రీకర నరసింహనృపవశీకర నయవి
ద్యాకరణ" (2-1)

---

1. ఈ వివరములకు పూర్వోక్త గ్రంథవ్యాసము చూడుడు. అనంతామాత్యుని గంగయ. పుటలు 210-211

అని గంగమంత్రి నరసింహ నృపవశీకరనయవిద్యాకరణుగా వర్ణింపబడి నాడు. నరసింహనృపవశీకర అనగా నరసింహ భూపతిని వశపఱచుకొన గలిగిన నైపుణ్యము గలవాడు అని అర్థము. ఆచారిత్రక సందర్భమిది:

క్రీ.శ. 1470 లో కపిలేశ్వరగజపతి అస్తమించగానే విజయనగరరాజైన సాళువనరసింహరాయలు నెల్లూరి మండలములోని ఉదయగిరి దుర్గము నాక్రమించెను.

కపిలేశ్వరగజపతి కుమారుడైన పురుషోత్తమగజపతి సాళ్వనరసింహుని స్వాధీనమైన ఉదయగిరిపై దండెత్తగా సాళ్వనరసింహరాయ లాతని ప్రతిఘటించెను. కాని మహాబలవంతుడగు పురుషోత్తమగజపతి ధాటికి తట్టుకొనలేక అతనికి జీవగ్రాహముగా పట్టుబడెను. ఈ విషయము పురుషోత్తమగజపతి రచితమైన సరస్వతీ విలాసమున నాతని ఆనంతవరతామ్ర శాసనమున చెప్పబడినది. బసవభూపాలుడు గజపతుల సామంతుడేగాన పురుషోత్తమగజపతి అతని సహాయము నుకోరి యుండును. గంగమంత్రి తనరాజనీతి చాకచక్యముచేత నరసింహరాయలు జీవగ్రాహముగా పట్టుబడుటకు విశేషముగా సహాయ్యము చేసియుండెను. దీనిని పురస్కరించుకొనియే

“నరసింహనృప వశీకరనయవిద్యాకరణ” అని గంగమంత్రిని సంబోధించినాడు.

పురుషోత్తమగజవతి జీవగ్రాహముగా పట్టుకొనినయతడు సాళ్వనరసింహరాయలేయని చరిత్రకారులు వాఙ్మయ చరిత్రకారులు అంగీకరించినను కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మాత్ర మంగీకరింపలేదు.[1]

## గంగమంత్రి – శివయోగి

గంగమంత్రి లౌకికముగా మంత్రియై రాచకార్యములలో నిమగ్నుడైనను ఆతడు సాంసారికముగా జీవితము గడపినను తక్కినవారివలెగాక తామరాకుపై

---

1. ఆంధ్రదేశచారిత్రక భూగోళసర్వస్వము ప్రథమ సంపుటము పుట 211

నీటి చందమున అంటీఅంటకయుండునట్లు యోగివలె జీవితము సాగించెనని యీగ్రంథమున నిట్లు వర్ణితమైనది.

సరిలేనినీతి చాతురిచేత రాజ్యతం
త్రంబును నడిపిన నడుపుగాని
యనిశంబు పుష్పచందన వనితాది సౌ
ఖ్యంబుల నందిన నందుగాని
సంగీత సాహిత్య సరస విద్యావినో
దంబులఁ దగిలిన దగులుగాని
స్వామిహితాసక్తి సదనవనాస దసుశా
సనలీల జరపిన జరపుగాని

నీళ్లలోపలి సరసిజినీదళంబు
సరణి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియములేదు ప్రత్యక్ష శంభుమూర్తి
యీయనంతయ గంగమంత్రీశ్వరుండు. (1-18)

శివయోగానుభవము

గంగమంత్రి శివయోగానుభవమిట్లు వర్ణితమైనది.

జలకము మూర్ధ్ని చంద్రసుధ షట్కమలంబులు బూజధూప ము
జ్జ్వలతర బోధశాసననివాళి సుషుమ్న వెలుంగు సౌఖ్యముల్
తలఁపున నీగిబోనము సదా తననాదము ఘంటగాఁగ ని
ష్కలుషత నీయనంతవిభుగంగన గొల్చు నిజాత్మలింగతన్. (1-17)

ఆత్మలింగమనగా గురుదత్తమైన లింగముగాక తాను స్వయముగా సంపాదించిన లింగము శివయోగరహస్యశేవధి (1-38)

శివారాధనతత్పరత

దగ్గుపల్లిదుగ్గన నాసికేతూపాఖ్యానమున గంగమంత్రి శైవాచారతత్పరత యిట్లు వర్ణితమైనది.

శివచింతామయ మంతరంగము శివశ్రీపాద పద్మార్చనా
ప్రవణంబులే కరపంకజంబులు, శివాపాది ప్రసిద్ధాగమా
శ్రవణోదీర్ణము కర్ణయుగ్మము శివప్రాసాద పంచాక్షరీ
వ్యవహారజ్ఞరసజ్ఞ యిమ్మహిన నంతామాత్యు గంగయ్యకున్. (అవతారిక)

## శివపూజానియతి

గంగమంత్రి యఖండ శివపూజాధురంధరుడు. ఈ విషయ మాగ్రంథ మం దవతారికయందు, ఆశ్వాసాంత పద్యములందు స్పష్టముగా పేర్కొనబడినది.

"తత్సమయ సంపూజా లసచ్చుంభుమూర్ధనవీనేందుకళా సుధాసురభిగంధంబైన హస్తాంబుజంబున" (1-26)

"గౌరీనాయక పూజనాకలిత హృత్కర్పూర నీరాజనా" (1-85)

"శివభక్తి స్ఫుటప్రసవషట్చరణా" (1-86)

"భవానీశంకరారాధనా సాహిత్యస్థిరచిత్త (2-79)

"సంఘటిత చిత్తశంకరసఖ్యా (4-71)



# సంస్కృత ప్రబోధచంద్రోదయము

సంస్కృతనాటక సాహిత్యమున ప్రబోధచంద్రోదయమున కొక ప్రత్యేక స్థానము గలదు. శృంగారవీర రసములలో నేదైనయొకటి నాటకమున విధిగా నుండవలయునన్న యాలంకారిక మతమునకు (ఏకఏవభవేదంగీ శృంగారోవీర ఏవవా) విలక్షణముగా శాంతరసప్రధానమగు నీనాటకమును కృష్ణమిశ్రుడనుకవి రచియించెను. కృష్ణమిశ్రుడు కవీశ్వరుడేకాక యతీశ్వరుడు. ఈతడద్వైత విద్యా పారంగతుడై, చేదిదేశపురాజైన కీర్తివర్మపట్టాభిషేక సమయమున నీనాటకము ప్రదర్శింపజేసెను. కీర్తివర్మకాలము క్రీ శ 1100 ప్రాంతమగుటచే కృష్ణమిశ్రుడాకాలమునాటివాడు.

## నాటకరచనోత్పత్తి కారణములు

దీనికి రెండు కథలు గలవు:

1. కృష్ణమిశ్రుని కనేక శిష్యులు గలరు. వారిలో నొకశిష్యుడు వేదాంతాది విషయక గ్రంథముల చదువ నొల్లక, శృంగారరసవిషయికములైన గ్రంథములే చదువుచుండెడివాడు. అతనికి వేదాంతసార ముపదేశించి, శృంగారవిముఖునిగా చేయుటకు గురువగు కృష్ణమిశ్రుడు ప్రబోధచంద్రోదయము నాటకముగా రచించెను.

2 రాజైన కీర్తివర్మకు కృష్ణమిశ్రు డెన్ని విధముల నద్వైత మతము బోధించినను అతని మదికెక్కలేదు. అప్పుడు కామక్రోధాదులగు దుర్గుణములను మతి, వివేకాదులకు సద్గుణములను, పాత్ర లనువుగాజేసి యుద్ధమును జ్ఞానాజ్ఞానములకు కల్పించి నాటకముగా రచించి దానిని ప్రదర్శింపజేసి కీర్తివర్మ కద్వైతమునం దభిరుచి గల్గించెను.

ఈరెండు కథలును వాస్తవములై యుండవచ్చును. విషయప్రబోధమునకుగాని విషయప్రచారమునకు గాని నాటకము పరమసాధనమని గ్రహించి కృష్ణమిశ్రు డీ వేదాంతనాటకము రచించెను.

అద్వైతపరముగా నీనాటకము వెలసిన వెనుక వేదాంతదేశికులు (1270-1372) విశిష్టాద్వైతపరముగా సంకల్పసూర్యోదయము అను నాటకమును ఆ వెనుక మల్లనారాధ్యుడను నాతడు శివాద్వైతపరముగా "శివలింగ సూర్యోదయము" అను నాటకములు రచించిరి. కాని ప్రబోధచంద్రోదయమునకు వచ్చిన కీర్తి వీనికి రాలేదు కేవలము అనుకరణములుగా నిలిచిపోయినవి.

ఈ నాటకమునకు క్రీ.శ. 1520లో కొండవీటి దుర్గాధ్యక్షుడు. కృష్ణరాయల మహామంత్రి సాళ్వతిమ్మరసు మేనల్లుడునగు నాదిండ్లగోపమంత్రి 'చంద్రిక" అను పేర నొక వ్యాఖ్యానము రచించినాడు. ఆవ్యాఖ్యానము తోడనే ఈ నాటకము ముద్రితమైనది (1924). ఇటీవల పోడూరి సుబ్రహ్మణ్యసుధి ప్రౌఢప్రకాశ యను పేర నీనాటకమును వ్యాఖ్యానించెను. తంజావూరి ఘనశ్యాముడు కూడ నొకవ్యాఖ్య రచించెను. (D12560 మ. ప్రా.లి.పుస్తకశాల).

## నాటక విశిష్టత

ఈ నాటక విశిష్టతను జంటకవు లిట్లవతారికలో పేర్కొన్నారు.

సీ. వివరింపనిది సర్వవేదాంతసారంబు
తలఁపగా నిది గట్టి తెలివిత్రోవ
ఇది భోగమోక్షసంపదలకు మూలంబు
మోస లేదిది ఘనంబులకు ఘనము
జ్ఞాన కర్మరహస్య సాధనంబును నిది
యిది నవరసముల నీనుసురభి
షడ్దర్శనంబులు సరవి నిందున్నవి
సందేహములు దీఱ విందుగాని

గీ యిమ్మహారసపాకము నెఱిఁగినట్టి
జనుఁడెఱుంగడు మఱి తల్లిచన్నుపాలు
దీనిసరి చెప్పమఱిలేవు త్రిభువనముల
దొరక దీకృతి నీవంటి దొరకుగాని. (1-21)

పై పద్యమునుబట్టి ఇది "సర్వవేదాంతసారము" అని తెలియుచున్నది. విద్ అనగా జ్ఞానము. వేదము అనగా జ్ఞాన ప్రసాదించునది. అది కర్మజ్ఞానమును దెలుపును. వేదాంతమనగా వేదములకు చివర నుండునది. వేదాంతము కేవలము జ్ఞానమును దానిని యనంతత్వమును దెలిపి బ్రహ్మను నిరూపించును. బ్రహ్మ ఆనందస్వరూపము. ఆ బ్రహ్మానందము సిద్ధించు కొఱకు మార్గము జ్ఞానమార్గము. ఇదియే అద్వైత తత్వము. ప్రబోధచంద్రోదయ మీ అద్వైత తత్వమును విశదీకరించును గాన నిది సర్వవేదాంతసారమని చెప్పబడినది.

ఇందద్వైతమతమేగాక ద్వైతము పాశుపతము, కాపాలికము మొదలగు ఆస్తికమతములెగాక, బౌద్ధము, జైనము అను నాస్తికమతములు ప్రసక్తములై, ఖండితములైనవి. అనగా సరియైన మతములు కావని సిద్ధాంతీకరింపబడియున్నవి. న్యాయవైశేషిక పూర్వోత్తర మీమీంసాది షడ్దర్శనముల ప్రస్తావన యిందున్నది. అద్వైతవేదాంతమునకు మూలమైన ప్రస్థానత్రయము (బ్రహ్మసూత్రములు ద్వాదశోపనిషత్తులు భగవద్గీత) ప్రసక్తి యిందుగలదు భిన్నభిన్నమతములవలన గలుగు సందేహముల నిది నివర్తించును. గ్రంథవిషయమునుబట్టి యిది శాంత రసప్రధానమయ్యును నిందు తక్కినరసములు సందర్భానుసారముగా గలవు. ఐహికజీవితము నడపుటకిది యొపదేశకమేగాక, దీనిని పఠించినవానికి తిరిగి జన్మకలుగదు.[1]

పైవివరణమును పరిశీలించినయెడల ప్రబోధచంద్రోదయము ఆధ్యాత్మిక విషయప్రపూర్ణమై, అద్వైతవేదాంత తత్త్వ జ్ఞానోపదేశక గ్రంథ ని స్పష్టమగుచున్నది. అందువలననిది ఐహికమునువదలి ఆముష్మికదృష్టితో జీవయాత్ర గడపుము ముముక్షువులకు ఆధ్యాత్మిక వస్తువిచారణయందు కాలముగడపువైరాగ్య శీలురకు నభిరుచి సభినివేశము గలిగించు గ్రంథములలో ప్రధానమైనదని విశ్చితమగుచున్నది.

---

1. ఈసందర్భమున అద్వైతవేదాంత ప్రతిపాదకమైన భాగవతమును తెనిగించుచు బమ్మెరపోతన చెప్పిన వాక్యము గమనింపదగినది.
"మజ్జననంబున్ సఫలంబు చేసెద పునర్జన్మంబు లేకుండఁగన్" (1-21)

## నాటకము

ఇంతటి మహాగంభీరమైన ఆధ్యాత్మికేతివృత్తము కేవలము నైహికమగు లౌకికానందము గలిగించు నాటకముగా కృతికర్త రచించుటలోగల యాంతర్యార్థమును గ్రహింపవలయును

కృతికర్తయగు కృష్ణమిశ్రు డీయద్వైతవేదాంతప్రతిపాదక గ్రంథమును ఒక కావ్యరీతిని రచింపక నాటకముగానే వ్రాయుటకు గలకారణమును కీర్తిశేషులు మేడేపల్లి వేంకటర . ణాచార్యులు గారిట్లు సమర్థించినారు [1]

నాటకమందు ప్రతిపాదింపబడు సర్థమంతయు నభినయప్రధానమైనది గదా! ప్రబోధచంద్రోదయమందు ప్రతిపాదింపబడు వేదాంతార్థమునకు గల్గెడు ప్రాకట్యాతిశయము పరోక్షోపదేశ పర్యవసాయులగు భాష్యాది గ్రంథముల యందు గలుగనేరదు. ఇంతియేకాక బ్రహ్మజ్ఞాన సాధనములగు శ్రవణమనన నిధిధ్యాసన వస్తువిచారాదులు వేఱువేఱుగా నొక్కొక్కటియే చిరకాలాభ్యాస వశ్యములుగా గానవచ్చుచున్నవి. అట్టిసాధనములకు బ్రత్యక్షప్రయోగ ప్రదర్శనాత్మకమగు నభినయమువలనగాని విశద తమజ్ఞానము సంభవింపనేరదు. ఎట్లన యాజ్ఞికుడు కల్పసూత్రాదులను బాగుగఁ జదివినవాడైనను యాగశాలలయందాచరింపఁబడుచుండెడు శ్రౌతకర్మల ప్రయోగము దాఁబ్రత్యక్షముగా నీక్షించినగాని ప్రయోగకౌశలము నొందజాలడు. మఱియు యోగి గురుముఖముగా యోగశాస్త్రము జదివినను, గురువుచే బ్రత్యక్షముగా గనపఱచబడు స్వస్తికాద్యాసన బంధముల గన్నులార జూచినగాని యోగప్రావీణ్యము బడయజాలడు. అట్లనే ముముక్షువుగూడ వేదాంతశాస్త్రమును కూలంకషముగా జదివినవాడైనను బ్రహ్మనిష్ఠులచే నభినీయమానంబగు వస్తువిచారాదికము బలుమారు ప్రత్యక్షీకరించినగాని బ్రహ్మజ్ఞానసంపాదనసాధన పటిష్ఠుడు గానేరడు.

---

1. ప్రబోధచంద్రోదయ విమర్శనము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక తృతీయ సంపుటము. 6వ సంచిక 1914. పుటలు 409-424.

ఇదిగాక దీనియందు మఱియొక విశేషము గలదు. తైత్తరీయోపనిషత్తు (ఆనందవల్లి)

"తేయే శతం మానుషా ఆనందాః
సఏకో మనుష్య గంధర్వాణా మానందం"•

అనుశ్రుత్యుక్త రీతిగ నుత్తరోత్తర శతగుణితనిరతిశయానంద రూపు డగు పరబ్రహ్మయొక్క నిది ద్యాసనమందు నెట్టి యానంద భూయస్త్వముగలదో యట్టి యానందమంతయును మునుమున్నుపాసకుని బుద్ధి నారోహింపదు. కావున తొలుదొలుత నేదో సజాతీయమైన యొకయానందము నవలంబించి క్రమక్రమ ముగా దాని నుత్తరోత్తరాతిశయ సంపన్నమగు దానిగా ననుసంధించిన యెడల కొంసక భ్యాస పాటవము కుదిరి పూర్ణబ్రహ్మనందను బుద్ధ్యారూఢమగును.

నాటకమునం దభిజ్ఞ్య మానమగు సజాతీయానంద మెట్టిదనః

"లోకేప్రమదాదిభిః కారణాదిభిః స్థాయ్యను మాన్నే భ్యాస పాటవతాం కావ్యేనాట్యేచ తైరేవ కారణ త్యాదిపది హారేణ విభావనాది వ్యాపార వత్త్వాద లౌకిక విభావాది శబ్ద వ్యవహార్యైర్మమై వెతే। శత్రోలేవైతె। తటస్థ్యవేతె। నమమై వైతె। నశత్రోరేవైతె। నతటస్థస్యై। వ్యైతఇతి సంబంధి విశేషస్వీకార పరిహార నియమానవసాయా త్సాసాధరణ్యేన ప్రతీతైరరభివ్యక్త స్సామ్మాజికానాంవాస నాత్మతయాస్థితస్థాయీ రత్యాదికోనియత ప్రమాతృగతత్వేన స్థితోపి సాధార ణోపాయ బలాత్కృతాత్కాల విగళిత ప్రతినియతప్రమాతృ గతత్వేన స్థితోపి సాధారణోపాయ బలాత్తత్కాల విగళిత నియతప్రమాతృతా వశోన్మిషితవేద్యాం తర సంపర్కశూన్యాపరిమిత భావేనప్రమాత్రా సకలహృదయ సంవాదభాజా సాధారణ్యేనస్వాకార ఇవాభిన్నోపి గోచరీకృతశ్చర్వ్య మాణతైకప్రాణో విభావాది జీవితాతభిఃపానకరసన్యాయేన చర్వ్యణః పురఇవ, పరిస్ఫురన్ హృదయమివ ప్రవిశనే సర్వాంగీణమివాలింగనన్యత్సర్వ్వ మివతిరోదధత్ బ్రహ్మనందస్వాద మివాను భావయన్న లౌకిక చమత్కారకారీ శృంగారాది కోసరసః" కావ్యప్రకాశిక 4.ఉ అని మమ్మటాద్యాలంకారికులచే నిర్వచింపబడిన రసమే

"రసోవై సః రసగ్ హ్యేవాయంలబ్ధ్వానందీ భవతి" అను శ్రుతివలన బ్రహ్మరస స్వరూపుడని నిరూపింపబడుటచే ధ్యానావలంబనీ భూతరసాభి వ్యంజకము గావున నీనాటకమావశ్యకము"

పైయుదాహృత భాదమున ఆచార్యులవారెంత లోకోత్తరముగా ప్రబోధ చంద్రోదయ నాటకావశ్యకతను నిరూపించిరో తెలియగలదు. ఇందలి ప్రధానాంశములు రెండు.

1. అభినయము;

అభినయప్రధానమైన నాటకము గ్రంథాదులమూలమున గలుగు పరోక్ష జ్ఞానము కన్న ప్రత్యక్షజ్ఞానము గలిగించును. ఈ జ్ఞానమువలన ఆయా కళల యందు, కౌశలమేర్పడును. వేదాంతపరిభాషలో ఈ జ్ఞానము సజాతీయము బ్రహ్మసూత్ర భగవద్గీతోపషదుక్తమైన జ్ఞానము విజాతీయము ఈ నాటకమున పరోక్షమైన ఆ విజాయతీయ జ్ఞానము ప్రత్యక్షము గావింపబడినది.

2. రసము

నాటకప్రదర్శనమున సామాజికులయందు రస ముత్పన్నమగును. కాని అది లౌకికమైన ఆనందమును మాత్రమే సమకూర్చును. అది భౌతికమైన పాత్రలచే ప్రదర్శితమగును గాన నది సజాతీయానందము.

రసము బ్రహ్మస్వరూపము. అందువలన ఆధ్యాత్మికమైన పాత్రముల మూలమున ప్రదర్శితమైన నాటకము విజాతీయమైన బ్రహ్మానందము గలిగించును. జీవుడు బ్రహ్మముతో నైక్యసిద్ధిపొందును. ఇదియే రససిద్ధి అద్వైత వేదాంతసిద్ధి.

## సంస్కృత ప్రబోధచంద్రోదయ నాటకమునకు మూలము

సంస్కృత ప్రబోధచంద్రోదయ నాటకమునకు మూలము పురంజనోపాఖ్యానము. ఇది భాగవతము చతురస్కంధమున 25, 26, 27, 28 అధ్యాయములలో నున్నది.

## పురంజనోపాఖ్యానము కథాసంగ్రహము

"స్వకర్మానుసారముగా ననేక శరీరములు ధరించువాడు గావున పురంజనుడనగా జీవుడు. పురము శరీరము ఇతని సఖుడగు నవిజ్ఞాతుడను వాడీశ్వరుడు స్త్రీతామసబుద్ధి దానివెంటవచ్చు పదునొకండు భృత్యులు ఏకాదశేంద్రియములు. (కర్మేంద్రియములైదు జ్ఞానేంద్రియములైదు మనస్సొకటి) ఐదుతలలు గల సర్పము పంచప్రాణవృత్తి పురమునకు నవద్వారములనగా శరీరముయొక్క నవరంధ్రములు మృగయావిహారమే విషయోపభోగము వార్ధకము కాలకన్య దాని సైనికులు – ఆధివ్యాధులు.

ఈ శరీరమందున్న జీవుడు తామసబుద్ధికిలోనై, సంసారమందు దగిలి దారపుత్రాది సంగమము స్థిరమనిఎంచి కుటుంబపోషణకై నానావిధ తాపముల నొందుచు సుఖప్రదములను భ్రాంతిచే దుర్విషయములను సేవించుచు నరిషడ్వర్గములకు జిక్కిలేశమైనను సుంసకృతము చేయనొల్లక పాపరతియై స్త్రీలచే క్రీడామృగమువలె నాడింపబడుచుండును.

అత డప్రమత్తుడై కాలము బుచ్చుచుండ తుదకనేక వ్యాధులు శరీరమంతట నిండి పీడింపగా నాబాధ సహింపజాలక మృతినొందును. నిర్యాణకాలమందు దానెద్ది స్మరించుచు కళేబరము విడుచునో యదియై పుట్టును. ఆజన్మమందీశ్వర కటాక్షమునకు బాత్రుడై సదాచార సమాశ్రయణమువలన సంసారము హేయమనియు భగవచ్చరణారవింద ముపాస్య మనియు దెలిసికొని సంస్కృతి బంధ విముక్తుడగును."

ఇది యీగ్రంథమునకు మూలమైన పురంజనోపాఖ్యానము తాత్పర్య సంగ్రహము;[1]

---

1. ప్రబోధచంద్రోదయ విమర్శనము పూర్వోక్తము. ఆంధ్రభాగవతమున నీ పురంజనోపాఖ్యానము చతుర్థస్కందమున 742 పద్యము మొదలుకొని 851 వరకును 109గద్య పద్యములలో గలదు.

అద్వైతమత సిద్ధాంతమును ప్రతిపాదించు పురంజనోపాఖ్యానము మూలముగా గైకొని, కృష్ణమిశ్రుడు అద్వైతవేదాంత సిద్ధాంతము ప్రతిపాదకమైన ప్రబోధచంద్రోదయము రచించినాడు. ప్రబోధము — జ్ఞానమనెడి; చంద్ర- చంద్రునియొక్క-ఉదయము - ప్రబోధచంద్రోదయము.

## నాటకసంవిధానము

ఈ నాటక సంవిధానమునుగూర్చి యొకకథ గలదు. కృష్ణమిశ్రుడు రాజైన కీర్తివర్మకు అద్వైత మత తత్త్వమెంత బోధించినను మనసునకు పట్టలేదు. అంతట నాతడు కామ క్రోధ లోభాది గుణములను పాత్రలుగాచేసి అవి అరిషడ్వర్గములుగాన రాజులకు శత్రువులతో యుద్ధముచేయుట ప్రియముగాన అరిషడ్వర్గములైన కామాదులకు, మతి, వివేకము, క్షమ, వైరాగ్యము, శాంతి, మనము అనువానిని పాత్రలను గావించి, వారిరువురకు యుద్ధమును గల్పించి తుదకు ప్రబోధము జ్ఞానము జయించెనని నాటకము సమాప్తి చేసినాడు

ఇచట కామాదులు: వివేకాదులు అను రెండు పక్షములున్నవి. గావున నీరెండు పక్షములను దాయాదులనుగా నిందు పాత్రీకరించినాడు. మహాభారతమున కౌరవ పాండవులకు యుద్ధము దాయ భాగము మూలముననే జరిగినది గావున అందు అధర్మప్రవర్తకులైన కౌరవులను ధర్మప్రవర్తకులైన పాండవులు జయించినట్లుగా నీ నాటకమున కామాదులను వివేకాదులు జయించినట్లు చెప్పబడినది.

శ్లో. ఏకామిష ప్రభవమేవ సహోదరాణాం
ముజ్జృంభతే జగతి వైరమితి ప్రసిద్ధమ్
పృథ్వీనిమిత్తమ భవత్కురు పాండవానాం
తీవ్రస్తయాహి భువనక్షయ కృద్విరోధపిః (1-28)

మ. అవలేపంబున నన్నదమ్ములగు మోహాదుల్ వివేకాదులున్
భువనైకాధిపతిత్వ కాంక్షఁదమలోఁబోరాడి రేకామిషో
ద్భవలాభంబునఁ బోరకుందరు గదా దాయాదులైయున్నకౌ
రవులుం బాండవులున్ ధరిత్రికయి హోరాహోరిఁ బోరాడరే (1-43)

క్షామాదులకు వివేకాదులకుగల దాయాదిత్వమిట్లు నాటకమున నిరూపిత మైనది.




పై వంశ వివరణము వలన - కామ క్రోధాదులు వివేకాదులు దాయాదులైనారు. ఇర్వురు సపత్నులయందు సమానమైన రాజ్యకాంక్ష యుదయించిన కతకమున కౌరవ పాండవులకు రాజ్యవిషయమై యుద్ధము జరిగినట్లుగా నీనాటకమున ఇరుపక్షములవారికి తగువులు గలుగుచుండెను. ఆనాడు దుర్యోధనుని వలె, ప్రవృత్తిసతులలో మోహుడు రాజ్యము నాక్రమింపగా, పాండవులలో ధర్మరాజు వంటి వివేకుడు కొంతకాలము పైదొలగి, ఆ వెనుక విద్యా ప్రబోధ చంద్రులవలన మోహుని జయించి సామ్రాజ్యము నాక్రమించి ఆనందుడై వెలసెను.

వివేకునకు మతి ఉపనిత్తరుణి యను నిరువురు భార్యలు. వారివలన సుతు లుదయించిరి. ఆ వివరణ



ఈ ప్రబోధచంద్రుడే మోహుని జయించుగావున నీనాటకమున కాతని పేరనే ప్రబోధచంద్రోదయముగా వెలసినది.

సమానత్వము - విలక్షణత్వము

| | |
|---|---|
| 1. ఆనాడు కౌరవులకు సంబంధించిన యుద్ధము ప్రత్యక్షము | నాటకమున ప్రతిపాదించిన యుద్ధము పరోక్షము |
| 2. ఇందు స్థూలశరీరపాత్రలు | సూక్ష్మశరీరపాత్రలు |
| 3. నేత్రగోచరులు | మానసిక గోచరులు |
| 4. బహిరంగము | ఆంతరంగికము |
| 5. ఐహిక సామ్రాజ్యము-భౌతిక సుఖము పర్యవసానము | మానసిక సామ్రాజ్యము బ్రహ్మానందము పర్యవసానము |

ఇట్లు భౌతికేతివృత్తముగల నాటకము ఆధ్యాత్మికేతివృత్త నాటకమైనది.

## నాటకాలంకారశాస్త్రసమన్వయము

ప్రబోధచంద్రోదయము దశవిధ రూపకములలో "నాటకము" అను విభాగమునకు చెందినది. అలంకార శాస్త్రానుసారముగా నీ నాటకము నిట్లు సమన్వయింప వచ్చును.

నాయకుడు- వివెకుడు (ఆధ్యాత్మిక భావ వివేకము)
నాయకి- ఉపనిషద్దేవి (విద్యాప్రబోధము)
స్థాయిభావము- నిర్వేదము
ఉద్దీపనభావము- క్షేత్రప్రసక్తి
సాత్వికభావము- హర్షపులకాదులు
వ్యభిచారీభావము- మతి ధృతి హర్షాదులు
రసము- శాంతము
గుణము- ప్రాసాదమాధుర్యము

ఈ సమన్వయము సంస్కృతనాటకమునకేగాక తెలుగు అనువాదమునకు సరిపోవును.

అంకములు-విషయ విభజనము

ప్రథమాంకము- వివేక మహామోహ పక్షవిచారము
ద్వితీయాంకము- మహామోహ విలాసము
తృతీయాంకము- పాషండ విడంబనము
చతుర్థాంకము వివేకోద్యోగము
పంచమాంకము- వైరాగ్య ప్రాదుర్భావము
షష్ఠాంకము- జీవన్ముక్తి

## ఇందు ప్రతిపాదింపబడిన మతములు

### - అద్వైతము -

సత్యమైన పదార్థము బ్రహ్మయొక్కటియే మిగిలిన దంతయు మిథ్య. మాయ బ్రహ్మకల్పితము. బ్రహ్మము మాయతోకలిసి యొక పరమపురుషుడగును. అగ్నినుండి నిప్పురవలు బయలుదేరినట్లు బ్రహ్మనుండి వివిధ చేతనాచేతనరూపములైన సమస్తము పుట్టినవి. వస్త్రమునందలి నూలు వస్త్రమునకు ముఖ్యకారణమై దానియందుండెడు రీతిని బాహ్యమైన ఆ బ్రహ్మము సమస్తమునకు ముఖ్యకారణమై అంతయు నిండియున్నది; ప్రతి జీవుని హృదయమునందు ప్రకాశించుచున్నది.

పరమపురుషునియందు మాయ సత్త్వగుణమునే కలిగియుండి. అవిద్య అనబనుచున్నది. జీవుడు అవిద్యతో కలిసి యుండువరకు సత్యపదార్థమునకును తాను చూచుచున్నట్టి యితరమైన పదార్థములకును తాను భిన్నమని భావించును. అవిద్య జ్ఞానముచే నశించును. అవిద్య నశించినచో జీవమునకు బ్రహ్మైక్యము కలుగును. ఇదియే మోక్షము.

అవిద్యచేత భ్రమనొందుటయే సంసారము. తత్త్వమస్యాది వాక్య జన్య జ్ఞానంబున నవిద్య నశించును. ఇదియే మోక్షము.

ప్రబోధ చంద్రోదయ నాటకమున బ్రహ్మము ఈశ్వరునిగను - అవిద్యలేక అజ్ఞానము ప్రబోధ చంద్రోదయము - జ్ఞానోదయముగను-నిరూపితమై, జీవేశ్వరైక్యము ప్రతిపాదితమైనందున నిది అద్వైతవేదాంత ప్రతిపాదిక నాటకమైనది.

ఆ బ్రహ్మయే సత్యమను ఆస్తికత్వము నిర్ధారించినది. ఇతరములైన నాస్తిక మతము లిందు ఖండితములైనవి. వాని వివరములు.

## - చార్వాక మతము -

దీనికి లోకాయతమతమనియు బృహస్పతి లేక వాచస్పతి మతమనియు పేర్లు గలవు. ఈ మతమున భూమి, జలము. అగ్ని. వాయువు అని నాలుగే తత్త్వములు. ఈ మతానుయాయులు ప్రత్యక్ష ప్రమాణము తప్పతక్కిన వానిని యొప్పుకొనరు. అందువలననే పంచభూతములలో ప్రధానమైన ఆకాశము వీరి మతమునలేదు. భూతముల సంబంధమున-ప్రాణము, శరీరము కలుగుచున్నది. ఇదియే స్వాభావికము. దేహమే సత్యము. ఆత్మ, దేవుడు, మోక్షము అనునవిలేవు. ఇహలోకానుభవమే జీవిత పరమార్థము. స్త్రీసంభోగము - సుఖము. ఆదివ్యాధులు దుఃఖము మరణానంతరమున దేహము నాల్గు భూతములలోను అంతర్భూతమగు చున్నదిగాన మరణమే ముక్తి. ఈ మతమున చతుర్విధ పురుషార్థములలో లౌకిక మగు అర్థకామములే పురుషార్థములుగాన, అలౌకిక పురుషార్థమగు మోక్షమును చార్వాకు లంగీకరింపరు. నిరీశ్వరమైనందువలన నీమతము నాస్తికమైనది.

## - అర్హతమతము లేక జైనమతము -

ఈ మతమున జగత్తు కార్యరూపముగా నసత్యము, భిన్నము, అనిత్యము కారణరూపముగా సత్యము అభిన్నము నిత్యము. ఆత్మ దేహానురూపపరిణామము గలది. ఈ మతస్థులు ప్రాణి హింసనుమాని దిగంబరులై విషయవైరాగ్యము నవలంబించి దేహమునందు మలము బూసికొని పాణిపాత్రభోజనులై కేశఖండ నము చేసుకొని మౌనవ్రతులై యుండవలెను. మలధారణాదికమువలనను. ఆత్మ జ్ఞానము వలనను ఊర్ధ్వగతి బొందుట మోక్షము. ఈ మతము నిరీశ్వరమత మగుటవలన నాస్తిక మతము.

జైనమతములోని సన్యాసులను "క్షపణకులు" అని యందురు. నాటక మున క్షపణక ప్రస్తావన యున్నది. (3-26)

"నిర్గ్రంథోఽర్హః క్షపణకః శ్రమణోజిన ఇత్యపి" అని వైజయంతి ప్రతిదిన కేశలుంచనత్వము దిగంబరత్వము-వారి ముఖ్యలక్షణములు. దశకుమారచరిత్ర అపహారవర్మ కథలో క్షపణకులు వత్తురు. జైనులలో రెండు తెగలు.

1 దిగంబరులు, 2. శ్వేతాంబరులు

ప్రబోధచంద్రోదయమున దిగంబరులగు క్షపణకులు మాత్రమే పేర్కొన బడినారు.

## బౌద్ధమతము

దీనికి సౌగత మతమని మరియొకపేరు. దీని స్థాపకుడు సుగతుడు, సిద్ధార్థుడు అను నామాంతరములుగల బుద్ధుడు. వీరి సిద్ధాంతమున నాలుగు భావనలు

1. సర్వము క్షణికము క్షణికవిజ్ఞానమాత్మ
2. సర్వము దుఃఖము
3. సర్వము స్వలక్షణము
4. సర్వము శూన్యము

ఈ బౌద్ధులలో నాలుగు తెగలవారున్నారు. వారు

1. సౌత్రాంతికులు - బాహ్యానుమేయత్వవాదులు
2. వైభాషికులు - బాహ్యార్థప్రత్యక్షవాదులు
3. యోగాచారులు - బాహ్యశూన్యత్వవాదులు
4. మాధ్యమికులు - సర్వశూన్యవాదులు

జైనమతమువలె బౌద్ధమతము నాస్తికమే అయినను కొంత భేదమున్నది. భారతీయులు బుద్ధుని విష్ణువు దశావతారములలో నొకయవతారముగా పరిగణించినారు. అయినను, నాస్తికమగుటవలన మనదేశమున ప్రచారములో లేదు. చైనాదేశమున నేటికి ప్రచారమునందున్నది.

నాటకమున యొక బుద్ధముని ప్రసక్తికలదు. శివ అశ్వాసము

## ఆస్తికమతములు

## పాశుపతమతము

ఇది శైవాగమ సిద్ధము. ఆగమములచే ననుగ్రహితుడైనవాడు శివుడు. ఈతడే జగములకు నిమిత్తకారణము పరమాణువులు ఉపాదానకారణము. శైవాగమమందు జెప్పబడిన కంఠిక, రుచకము, కుండలము, శిఖామణి, భస్మము, యజ్ఞోపవీతము అను నారుముద్రలను ధరించుటయు, సురాకుంభ స్థాపనము శ్మశాన భస్మస్నానము, ప్రణతపూర్వకధ్యానము మొదలగు కర్మలచే నణు స్వరూపము నశించి జీవునకుగల మలత్రయము నివారించును. అదికారణమే శివ సాయుజ్యము. అదియే మోక్షము.

పాశుపతులు నాటకమున తృతీయాశ్వాసమున పేర్కొనబడిరి.

## ద్వైతము

ఈ మతమున ఈశ్వరునికి జీవునికి పరస్పరభేదము – మోక్షానందము తారతమ్యము జీవుడు పరతంత్రుడై ఈశ్వరానుగ్రహము వలన ఈశ్వరసామీప్యాదుల స్థితులను బొందును.

ఇందీశ్వరు డనగా విష్ణువు. భగవత్కృపవలన ఆత్మకు మోక్షము గలుగుచున్నది. ఆయన సర్వోత్కృష్టత గుఱితెలిగినవారికి భగవత్కృప గలుగును. భగవత్ధ్యానముద్వారా ఆత్మ లాయన కృపను బొందును. భగవత్ జ్ఞానము పొందుట కన్ని ఆత్మలకు సాధ్యముకాదు. మంచి ఆత్మలు జ్ఞానముపొంది భగవత్కృపను సంపాదించుకొనును, సర్వశక్తిగల భగవంతుడైన విష్ణుని సేవించుట వలన ఆత్మలు భగవత్జ్ఞానము పొందును.

ఈ మతమువారు ద్వితీయాశ్వాసమున పేర్కొనబడిరి.

## – మీమాంస మతము –

ఇది రెండు విధములు.

1 పూర్వమీమాంస – జైమిని ప్రతిపాదకము. కర్మప్రాధాన్యము. ఇందు భాట్ట ప్రభాకరములను రెండు తెగలు గలవు.

2. ఉత్తరమీమాంస - వ్యాసప్రతిపాదకము - జ్ఞానప్రాధాన్యము.
పూర్వమీమాంస - సిద్ధాంతములు.

1) ప్రపంచము సత్యము. మిధ్యకాదు. 2) దాని కాద్యంతములు లేవు 3) వేదము లాద్యంతములు లేనివి. 4) అవి నీతిమత బోధకములు. 5) ఆత్మ ఆద్యంతము లేనిది. 6) తమతమ కర్మానుసారముగా ఆత్మలకు పునర్జన్మకలదు. 7) యజ్ఞములు వేద విహితమైన కర్మలు చేయుటవలన ఆత్మలకు స్వర్గము లభించును. 8) యజ్ఞములు స్వర్గసుఖమునేగాక ప్రాపంచిక సుఖమును నిచ్చును. 9) ద్విజులను మాత్రమే యజ్ఞాది కర్మలు చేయుటకు అధికారముగలదు.

- భాట్టమతము -

ఇది పూర్వమీమాంస సంబంధమైనది. ఆత్మ జడరూపమున చేతనరూపమున నున్నది. అది మెఱుపుతీగవలె ప్రకాశన రూపముగను, అప్రకాశ రూపముగను నున్నది. చేతనముయొక్క ఆభాస సహిత అజ్ఞానానందమయకోశము ఆత్మ అభాసమును దాటి కర్మజ్ఞానముగలుగుటయే మోక్షము.

- ప్రాభాకర మతము -

ఇందు ఆనందమయకోశమే ఆత్మ విజ్ఞానమయ కోశమందుండుబుద్ధి ఆత్మయొక్క జ్ఞానగుణము. ఆనందమయ కోశమునందుండు చేతనము గుప్తమై యున్నది. వివేకము లేనివానికది ప్రతీతములేదు. సుషుప్తియందు ఆత్మకు జ్ఞానము లేదు. గావున ఆత్మ జడ మనబడెను. ఆత్మస్వరూపమైననిత్యజ్ఞానము జీవునియందులేదు. అనిత్యజ్ఞానమున్నది. ఆనందమయకోశము ఆత్మగాదు, బుద్ధి దాని గుణముగా నున్నది. భాట్టమతము ద్వితీయాశ్వాసమున మీమాంసతృతీయాశ్వాసమున ప్రసక్తము లైనవి.

జైమిని కర్మమీమాంస మతమును వ్యాపకముచేసినవాడు కుమారిలభట్టు అతని ప్రశంస-పంచమాశ్వాసమున గలదు.

## - ఉత్తరమీమాంస -

వేదవ్యాస ప్రతిపాదకము. ఇది జ్ఞానమార్గమునకు సంబంధించినది. ఆత్మసత్యము. జగత్తుమిధ్యయను నద్వైత సిద్ధాంతమును తొలుత సిద్ధాంతీకరించిరి. వాసోద్దిష్టమైన ఉత్తరమీమాంసయే. ఇదియే "వ్యాససరస్వతి" అని ద్వితీయా శ్వాసమున పేర్కొనబడినది.

## - నైయాయిక వైశేషికమతము -

ఈశ్వరుడు నిమిత్తకారణము. అట్టి ఈశ్వరు డున్నాడనుటకు జగము సావయము గావున ఘటాదులవలెనే పుట్టినది. ఘటాదిజననము దానిప్రయోజనము లెరింగిన వానిచేతనే చేయబడును. కాబట్టి జగము నిర్మించు నేర్పు గల వాడును, కర్మపరవశులైన జీవులకంటె విలక్షణుండగు నొకసర్వజ్ఞుండుండ వలయునతడు సాధకము ఆతడే ఈశ్వరుడు. ఈశ్వర ప్రీత్యర్థకముగా వేదోక్త కర్మంబుల నాచరింపుచు తత్ప్రసాద లబ్దంబైన అష్టాంగయోగమున దుఃఖ నివృత్తియైన మోక్షంబు బడయును.

ఈ మతప్రసక్తి తృతీయాశ్వాసమున గలదు.

## - కాపాలికమతము -

ఇది శైవమతములోన నాంతరభేదము. ఈ మతానుయాయులకు, శివుని ననుసరించి కపాలబిక్షాటనము, శ్మశానవాసిత్వము, దిగంబరత్వము గలదు శైవ మున సన్యాసములేదు గాన నీమతస్థులు భార్యలతో నుందురు. ఈ మతాను యాయుని సోమసిద్ధాంతి యనియందురు.

కపాల బిక్షాటనము ప్రధానసిద్ధాంతముగాన వీరలకు కాపాలికులు అని పేరువచ్చినది.

ఇందు తృతీయాశ్వాసమున కాపాలిక ప్రసక్తియేగాక కాపాలిని ప్రసక్తి వచ్చును. మతములో సాంఖ్యమతముగూర్చి యీ నాటకములో చెప్పబడలేదు.

## క్షేత్రములు

క్షేత్రములు మతసంబంధమైనవి. అందువలన నీ నాటకమున రెండు క్షేత్రములు వర్ణితములైనవి.

### వారణాసీ క్షేత్రము

ఇది భారతదేశమున అద్వైతులకేగాక స్మార్తులందరికి సేవ్యమానమైన దివ్యక్షేత్రము. ఈ కాశీక్షేత్రమహిమను శ్రీనాథుడు కాశీఖండమున నీకవులకు ముందే చాటినాడు. ముఖ్యముగా యతీశ్వరులకిది స్థానము. నాటకకర్త కృష్ణ మిశ్రుడు యతీశ్వరుడు గావున వారణాసీ క్షేత్రమును నాటకమున ప్రస్తావించినాడు

### పురుషోత్తమక్షేత్రము

ఇదివైష్ణవక్షేత్రము. ఉత్కళదేశము (ఒరిస్సా) లో నున్నది. ప్రబోధ చంద్రోదయమున దీనిప్రసక్తి గలుగుటకు ఇందు విష్ణుభక్తి యోగినిగా ప్రవేశపెట్ట బడుటయే హేతువు.

ఈ కవులకుముందు, ఎఱ్ఱనయు, శ్రీనాధుడును నీపురుషోత్తమక్షేత్రము (నేడు పూరీజగన్నాథక్షేత్రము) ను తమకృతులలో నృసింహపురాణ భీమఖండ ములలో ప్రశంసించిరి.

## కథాసంగ్రహము

జ్యోతిర్మయంపు కోటలును, అమృతంపుబరిఖలును నైర్మల్యంపు మేడ లును గల చిదానందనగరియందు ఈశ్వరుడను రాజు రాజ్యపాలనము చేయు చుండెను. అతనికి మాయయనెడి పట్టమహిషి వలన మనస్సు అనెడి తనయుడు గలిగెను. ఆ రాజకుమారునకు ప్రవృత్తి యనియు, నివృత్తి యనియు నిద్దరు భార్యలు గలరు. ప్రవృత్తిదేవి వలన మహామోహుడు మున్నగు సుతులును, నివృత్తిదేవివలన వివేకుడను పుత్రులును జనించిరి.

ఈ ఇరువురు సపత్నుల పుత్రులయందును సమానమగు రాజ్యకాంక్ష యుద్భవించిన కతన కౌరవ పాండవులకు రాజ్యవిషయమున పోరుకల్గినట్లు ఈ

యుభయ పక్షములవారికి భువనైకాధిపత్యము కొఱకు నిరంతరము తగవు గలుగుచుండెను. జ్యేష్ఠవర్గమగు మహామోహాదులయందు జనకునకు పక్షపాత ముండుటచేత వివేకాదులు సమరమున నిలువలేక చెల్లాచెదరై పారిపోవలసి వచ్చెను.

మహామోహుడు రాజ్యము స్వీకరించి సాపత్న్యులగు వివేకాదులను నిర్మూలముచేయ నుద్దేశించి వారెక్కడెక్కడ దాగియుందురో వెతకించుటకు చారులను పంపెను. వారు విశ్వమునగల పురములన్నిటిని వెదకి యచ్చటచ్చట వివేకాదులు పొడనూపుట ఎరిగినవారై తమయేలికసంగతి విన్నవించిరి. మహామోహుడుగ్రుడై పేరోలగమున తనతమ్ముల విలోకించి వివేకాదుల నెట్లు ఖండింప వలయునో తగు నుపాయము తెల్పుడని సోదరామాత్యవర్గముల కాజ్ఞాపించెను. అంత కాముడు తన అద్భుతప్రాభవమును ప్రకటించుచు వాసంతికా, నవమల్లికా వికసితవల్లిమ తల్లులవలె నుల్లసిల్లెడు పల్లవాధరలు తనబలాసికములో నుండగా వివేకాదు లెట్లాహవమున నిలువనోపుదురని యుత్కటగర్వమున ప్రగల్భించెను. రతి కొంత ప్రతివచనము కొనిసాగించియు లాభము లేదని యూరకుండెను.

మహామోహుడు సభాంతరమున రహస్యాలోచనము చేయుచుండినపుడు దుర్గుణుడను వేగులవాడువచ్చి వివేకమహారాజు ఉపనిషద్దేవిని పునః పరిగ్రహించు టకును ఆ యిరువురి సంయోగమువలన విద్యా ప్రబోధచంద్రు లుదయించుటకు ప్రయత్నములు జరుగుచున్నవనియు నవి నిర్విఘ్నముగా నెఱవేరుటకు శమద మాదులు సకల పుణ్యతీర్థములకుబోయి దేవతాప్రార్థనలు చేయ సఁకట్టియున్నా రనియు. పిడుగువంటి వార్త వినిపించెను. మహామోహుడును భయవిహ్వలుడై తన ముఖ్య సచివుడగు దంభునిజూచి "మిత్రమా పుణ్యతీర్థములో ప్రశస్తమైన కాశీనగరంబునకుబోయి వివేకుని ప్రయత్నములకు భంగము కావింపవలయునని చెప్పిపంపెను.

మహామోహు డొనరించిన యాలోచనలును దంబాదులకు నియోగించిన యాజ్ఞావిశేషములను రహస్యముగా గనిపెట్టి సదాచారు డనెడు చారుడు తత్ వృత్తాంతము పూసగుచ్చినట్లు వివేకమహారాజునకు నివేదించెను. ఆ మహీపతి చింతాకులుడై తన యగ్రమహిషియగు మతిని రావించి యా యుదంతము

సర్వము నామెకు దెలిపెను. విద్యాప్రబోధ చంద్రు డెట్టుద్భవింతురని యామె ప్రశ్నింప తనతో కలహించి,చని, తన వియోగమువలన కృశించుచున్న యుపని షద్భామినికి తనతో పునస్సమాగమము గలుగునేని విద్యా ప్రబోధ చంద్రు లుదయింతురని చెప్పిన నా సాధ్వీలలామ యందుల కీయకొనెను.

మహామోహునిచే నాజ్ఞాపితుడై దంభుడు వారాణాసీ పురమునకేగి యచ్చట నివాసమేర్పఱచుకొని రాజకార్య నిర్వహణమున నప్రమత్తుడై యుండెను. ఒకానొక దినమున వానియింటి కొక పురుషుడు యాదృచ్ఛికముగా వచ్చి యాతిథ్యమును గ్రహింపనొల్లక దురహంకృతి కనబఱచగా వారి కిరువురకు జరిగిన సంభాషణ క్రమమున నా నూతన పురుష దహంకారుడని తెలియవచ్చినది. అప్పుడు దంభు డహంకారునకు మ్రొక్కి తాను లోభుని కుమారుడనియు, నంమచే అహంకారునకు మనుమడనియు బంధుత్వము తెలుపుకొనెను పిమ్మట నిరువురును తమ తమ యాచరణీయ విషయములను చర్చించి మహామోహుని యాజ్ఞాను సారముగా నుభయులును కాశీక్షేత్రమునకు వచ్చిన ట్లెఱిగి కొనిరి.

ఇట్లుండ మహామోహ మహారాజాసమయమున కాశీపురమున సపరివార ముగా ప్రవేశించెను. దంభాది బంధువర్గమును క్షపణక బౌద్ధకాపాలికాది పరివార నికరమును నా మహారాజును చుట్టుకొని సంతోష సంభ్రమ కొలాహలంబున చెల రేగిరి. మహామోహరాజు తన బంధు మిత్రాదులకు తన నాస్తికమత ప్రకారము సర్వమును బోధించి శరీరము వేఱనియు, ఆత్మ వేఱనియు చెప్పు వేదవాక్యము లబద్ధములనియు పంచభూత పరిపాకప్రా ప్తచైతన్యమగు నీదేహమే ఆత్మయనెడు సిద్ధాంతము సత్యమనియు వాక్రుచ్చి, వేదచోదితకర్మాచరణులను నిర్మూలము గావింపవలసినదని గాంభీర్యమున జెప్పుచుండ, తనమతాచార్యవర్యుడైన చార్వా కుడు శిష్యసమేతుడై విచ్చేసి మహారాజును దీవించి సమస్తము దేవర పంపున సాధింపబడెనని నివేదింప మహామోహాది సమస్తరాజన్యలోకము కడుంగడు సంతసించె. విష్ణుభక్తియను కల్లరిపిల్ల మాత్రమింకను లొంగకుండ సిలుగులు పెట్టుచున్నదని కొంతసంకోచముగా చెప్పెను. అంత చార్వాకుని మాటలు విని మహామోహుడు నిట్టూర్పు నిగిడించి యామూర్ఖురాలు పట్టిపట్టువిడువదుగాని కామ క్రోధాదుల ముందఱ నామె త్రుళ్లగింతలు సాగవని యూరడిల్లె, అయినను

శత్రువర్గములోని దైన చిన్ననిసువునైనను నుపేక్షింపకూడదని తన సేవకవర్గ మున కాజ్ఞాపించెను.

ఆలోన నొక ప్రతీహారివచ్చి పురుషోత్తమ దేవాలయమున నున్న మదమాదులు దేవరవారికొక విజ్ఞానపత్రిక పంపిరనిచెప్ప మహామోహ మహారాజా పత్రిక గైకొని శ్రద్ధయు, ఆమె కొమార్తెయగు శాంతియు గలసి వివేచమహారాజునకు ఉపనిషద్భామినికి పొత్తు కలుగునట్లు దౌత్యము నడపుచున్నారనియు ధర్మము వైరాగ్యము మున్నగు పెద్దలీ కార్యసంఘటనము నిమిత్తము సహకారులుగా నున్నారనియు వ్రాసినసంగతులను చదువుకొనెను. పిమ్మట కామ, క్రోధ లోభులను పిలిచి ధర్మములు కట్టిపెట్టుమని కామునికిని శాంతిని బంధింపుమని క్రోధ లోభులకు నానతులిచ్చి శ్రద్ధను వశము చేసికొనుటకు నాస్తికత తప్ప వేఱొకరు సమర్థులుగారని యూహించి మిధ్యాదృష్టి పేరబరగు నాస్తికతను తోడి తెమ్మని విభ్రమావతినియను దాసిని పంపెను ఆమె శీఘ్రమేపోయి మిధ్యాదృష్టిని తోడ్కొని వచ్చెను. అంత మహామోహుడు తనకత్యంత ప్రియతమయైన మిథ్యాదృష్టిని జూచి పరమానంద భరితుడై ఆమె యాలింగన సుఖమున కొంత దనుకు శృంగారలీలల దేరిన యామెతో నామె రప్పించిన కార్యము దెలిపి శ్రద్ధను మాయోపాయములచే బద్ధురాలిం జేయ పంపెను.

అట్లు మహామోహుని యాజ్ఞానువర్తియై మిద్యాదృష్టి శ్రద్ధాలలన యొద్దకు బోయి తన కపటోపాయములచేత నామెను వేదమార్గమునుండి తప్పించి, పాషండ మతవశంవదను చేసి మరుగుపెట్టెను. శాంతికన్య తనతల్లిని కానలేక విభ్రాంతినొంది తిరుగులాడుచు, విలపించుచు, పాషండసదనమునైన నున్నదేమో యని వెదకికొన నుద్దేశించి, తననెచ్చెలియగు కరుణతోగూడ పోవుచుండెను. ఆ సమయమున నొకవికృతాకారుడగు పురుషు డాధారినే వచ్చుచుండుటచూచి, దాక్షసుడో, పిశాచమో అని సంశయించి, భయభ్రాంతులై కొంతసేపటికి తెప్పి రిల్లి యానూతన పురుషుడొక దిగంబరసన్యాసియని తెలిసికొనిరి. అప్పుడు శాంతి తనతల్లి యామనుష్యునియొద్ద నుండునేమోయని కనుగొనుట కచటనే నిలువ బడెను. ఇంతలో నా దిగంబరుడు "అర్హంత" "అర్హంత" అని తన శ్రావక వర్గమును పిలిచి స్వమతోపదేశమును చేయుచు శ్రద్ధను రావించి వారికి

సేవ చేయుమని వినియోగించెడు. ఆ వచ్చిన స్త్రీని శాంతిచూచి తన తల్లియని భ్రమించెను. కాని మరికొంత సేపటి కామె తనతల్లి కాదని, "తామసి" అనునది యని నిశ్చయించుకొనెను.

తరువాత బౌద్ధమందిరములనైన తనతల్లి యుండునేమో యని వెదకుటకు తిరుగుచుండగా నంతలో బౌద్ధభిక్షు డొకడు చేత పుస్తకములను పట్టుకొని యెదురు పడెను. ఆతని యొద్దను తామసియే యున్నది గాని తన తల్లి శ్రద్ధ లేదని యామె గ్రహించెను.

ఇట్లుండ దిగంబరుడైన క్షపణకుడు బౌద్ధభిక్షువుతో మత విషయమున వాదములాడ మొదలిడ తుదకు వాని దూషింపసాగెను. వీరిద్దరు కలహమాడు చుండగా సోమసిద్ధాంతు డొకడు చేతకత్తిని పట్టుకొని యచ్చటికి వచ్చెను. వీరు ముప్వురు మతాభినివేశమువలన తమతమ మతములను గూర్చి చర్చింపసాగిరి. కొంత వడికి కాపాలికుడు రోషకషాయితాక్షుడై, క్షపణకుని బొడుచుటకు చేయి సాచెను అంత బౌద్ధుడును క్షపణకుడును బెగడుపడి ఆసోమసిద్ధాంతిని క్షమాపణ వేడిరి. అంత సోమసిద్ధాంతి తాను గ్రోలుచున్న మదిరామదమును కొంత వారికిచ్చి వారిని తన మతమున చేర్చుకొనెను. వారు ముప్వురును నట్లు సఖ్యపడి "అద్దిరా! మన చక్రవర్తి మహామోహుని యాజ్ఞను మరచిమన మిచ్చోట కాలవిలంబనము చేయుచున్నాము శ్రద్ధాదేవిని బట్టితెమ్మని మనకేని యానతి గదా! ఆమె విష్ణుభక్తి చెంతను దాగియున్నది. కాబట్టి ఆమెను వెంటనే కొని తేవలయును అని కాపాలికుడు తన భైరవీ శక్తి నాకర్షించి పంపెను. ఇంతలో శాంతియు కరుణయు శ్రద్ధ యొద్దకేగిరి. వీరిట్లుండగా శాద్రర సావిష్ట యగు భైరవీ శక్తి భీకరాకారముతో గగనమునకెగసి పావురమును డేగ పట్టుకొను నట్లు శ్రద్ధాలలను బట్టికొని యెగిరి వచ్చుచుండగా విష్ణుభక్తి యడ్డుపడి భైరవిని పారద్రోలి శ్రద్ధను విడిపించెను.

(4)

విష్ణుభక్తి మహాదేవి శ్రద్ధను విడిపించి యామెతో నిట్లు నుడివెను. శ్రద్ధా! నీవువేవేగమే పోయి వివేక మహారాజుతో నిట్లు చెప్పవలెను. "మోహాది వర్గ

ముల నిర్జించుటకు సైన్యముల నన్నింటిని చేరగూర్చుకొని యాయత్తపడి యుండవలెను. విష్ణుభక్తి మహాదేవి కావలసిన సాయమొనరించుటకు సిద్ధముగా నున్నది." ఆమాటలువిని శ్రద్ధాదేవి యవిలంబితముగా వివేక మహారాజు కడ కేగి విష్ణుభక్తిదేవి నుడివిన పలుకులు యథారీతిగా విన్నవించెను. అంత వివేక నృపాలు డెగిరి బలము లన్నిటిలో ప్రోడయగు కాముని జయింప సమర్థు డెవ్వడని యోచించి వస్తువిచారునకు వర్తమానము పంపెను, అంత నాతడువచ్చి తాను కాముని నాయాసముగా జయింపగలనని ప్రతిజ్ఞ చేసెను. క్రోధుని భంజించుటకు క్షమను, లోభుని నిరోధించుటకు సంతుష్టిని నియోగించి తదితర బలానీకంబుల నెల్లగలయంజూచి యందరను త్వరితముగా కాశికానగరమునకు సమరోత్సాహమున ప్రయాణుడగుడని యాజ్ఞాపించి జయభేరిని ప్రయోగింప శాసించెను.

వివేకమహారాజు మహానీక సమేతుడై కాశీనగరంబు జొచ్చి ఆదికేశవుని దర్శించి, స్తుతించి ధర్మయుద్ధమునకు సిద్ధముగా నుండెను.

మహా మోహాది వీరులును సంగ్రామమునకు తమతమ సేనలను కూర్చుకొని పేర్చి కాశీనగరముననే విడిసి యుండిరి. ఇట్లుభయ సైన్యంబులును జయ ధ్వానములతో దిక్కులు పిక్కటిల్ల నార్చుచు సమర కోలాహలమున సంభ్రమింపు చుండిరి. రుధిరధారాసిక్తమగు యుద్ధభూమిని చూడనొల్లక విష్ణుభక్తి మహాదేవి "శ్రద్ధా! యుద్ధానంతరమున జయాపజయంబుల పర్యవసానము సత్యముగానాకు జెప్పుమని యాజ్ఞాపించి శాంతితో గూడ సాలగ్రామ శిఖరమున నున్న చక్రతీర్థ మునకు బోయెను.

యుద్ధము ప్రారంభమైనది. వివేకాది యోధులయెదురు మహామోహాది వీరులో నిలువలేక పరాజితులై పికాపికలై చెదరి పారిపోయిరి.

మహామోహు డెక్కడ యణగెనో ఎరుక పడలేదు. వివేక మహారాజు జయజయధ్వానములతో కాశీపురము ప్రవేశించెను. ఈ వృత్తాంతమంతయు శ్రద్ధాదేవి సత్వరముగానేగి విష్ణుభక్తి మహాదేవికి నివేదించెను.

మహామోహాదుల పరిభవము విని తండ్రియగు మనస్సు పలువిధముల శోకించి పలవరించుచున్న సమయమున విష్ణుభక్తి మహాదేవి వ్యాససరస్వతిని బంపి

మనస్సునకు వైరాగ్యను కలుగునట్లుగా నుపదేశము చేయుమని నియమించెను వ్యాససరస్వతియు నట్లే మనస్సునకు ననేక విధముల బోధించి భావముల నిత్యము లనియు, పాంచభౌతికమగు శరీరములు నశ్వరములనియు బ్రహ్మమేసత్యమనియు, ఇత్యాగి వేదాంత విషయములను చక్కగా తెలియజెప్పి విచార ముడుగుమని. యుపదేశించెను కానియామె యెంతజెప్పినను మనస్సునకు దుఃఖముపశమింపలేదు వేదాంతసరస్వతి మాత్రము విసుగుజెందక సకలలోక రక్షణదక్షుడగు నిందిరా ధవునిగాని ఇందుధరునిగాని పొందగలనాయని తలంచి యుండుమనియు, మోహ పాశబంధములు తమంతటతామే సడలిపోవుననియు చెప్పినమనస్సు ఊరడిల్లి కృతార్థుడ నైతినని వ్యాససరస్వతీదేవి పాదముల కెరగిన యామె మనస్సును జూచి వత్సా! నీహృదయం బుపదేశక్షమంబయ్యెనుగాని మఱియొక రహస్యము జెప్పెదనని, "జడున కసార సంసార విభ్రాంతి గలుగునుగాని వివేకవంతునకు గలుగదు. వివేకున కిదియంతయు విరక్తి కారణంబే" యని వేదాంత పరమ రహ స్యమును దెలిపెను. ఇంతలో వైరాగ్యుడురాగా భారతీదేవి మనస్సుతో "వత్సా! నీతనయుడు వైరాగ్యుడు వచ్చినాడు వానినిసంభావింపుము" అనికోరెను అప్పుడు మనస్సు వైరాగ్యుని కౌగలించుకొనెను. అంత సరస్వతీదేవి మనస్సుతో నిట్లనెను.

ప్రథమ భార్యయగు ప్రవృత్తిదేవి పుత్రశోకము వలన మరణించినది. కావున విచారింపక రెండవ పత్నియగు నివృత్తిదేవిని రావించి కూడియుండ వల సిన దానియు తత్సంజనితులగు వివేకాదులను యౌవరాజ స్థాపితులుజేసి సామ్రా జ్యము వహింపుమనియు నుపదేశించి దీవించి, శ్రద్ధను జీవమహారాజు నొద్దకు బోయి చేయవలసిన కార్యముల ననుసంధింపు మనియె శాంతిని వివేకమహారాజు కడకేగి యూడిగంబులు సలుపుమనియు చెప్పి మిగిలిన కార్యములను సంఘ టించుటకు దాను వెడలిపోయెను.

వివేకమహారాజు శాంతితో తన ప్రేయసియగు నుపనిషద్దేవినితోడి తెమ్మని చెప్పిపంపెను. ఆమెయట్లు పోవుచుండగా దారిలో తల్లియగు శ్రద్ధనుగాచి యానంద భరితురాలై ఆమెయెచ్చటికి ససంభ్రమముగా బోవుచున్నదని ప్రశ్నించెను. ఆమె జీవేశ్వరుడు నిష్కంటకముగా సామ్రాజ్య మేలుమండగా విచారమునకు హేతు వేమి యాని మారుపల్కె మహామోహుడట్లు యుద్ధమున నిర్జితుండై నీను జీవపుర

షుని వశీకరించుటకు మధుమతియను మోహుని త్రినిబంప యామె తన యింద్ర జాలవిద్య చూపి నానావిధములగు నింద్రియ సుఖభోగములను గల్పించి యాతని పరిభ్రమింపజేసి తనవలలో వేసికొన్నది. అని శ్రద్ధతిరిగి చెప్పగానే శాంతివిషణ్ణ చిత్తయై, ఇంతశ్రమ పడినను తుదకు ఫలము గలుగలేదని దుఃఖించి, ఈ పరిణామమునకు ప్రతీకార విధానమెద్దియేని కలదోయని యడిగెను.

అంత శ్రద్ధాదేవి శోకించుచున్న తనపుత్రికను సమాశ్వాసించి తనయాః ఊరడిల్లు మూరడిల్లుము తర్క మునీశ్వరుడు జీవేశ్వరుని వద్దకుపోయి "ఈశ్వరా ఇట్లేలు సంసార విభ్రాంతి జ్వాలల జిక్కుకొన్నావు" అనియడుగగా జీవేశ్వరు డదిరిపడి "తర్కాః మేలుమేలు నేనెంత మూఢుడనైతిని నన్ను మేలుకొలుపితివి. మేలుచేసితివి" అనిమెచ్చుకొనుచు మధుమతిని చాల ధిక్కరించెను. కావున మనకు నిశ్శంకముగ నానందదాయకములగు వైభవోత్సవములే కలుగుచున్నవి అని శ్రద్ధచెప్పి తాను వివేకుని జీవేశ్వరుని కడకు దెచ్చుటకు పోవుచున్నానని తెలిపెను అంతశాంతి తానుగూడ నుపనిషద్దేవిని వివేకుని కడకుతోడి తెచ్చుటకు బోవు చున్నానని తల్లితో నుగ్గడించి తనదారిని బోయెను అంత జీవేశ్వరుడు విష్ణుభక్తి దేవిమహిమకు గడు సంతసించి తాను కష్టముల నన్నింటిని నతిక్రమించి నిత్య నిర్మల సుఖములను బొందగలుగుట యాదేవి కృపాకటాక్షముననే యనివాక్రుచ్చి సంతోషించు సమయమున వివేకమహారాజు శ్రద్ధాంగనా సమేతుడై జీవేశ్వరుని సన్నిధి కేతెంచెను.

(6)

వివేకమహారాజు జీవేశ్వరునికి మ్రొక్కి దీవనెలు పొంది ప్రస్తుతించు సమయమున ఉపనిషద్దేవి శాంతిలలను దోడ్కొని వివేకమహారాజు సమక్షమునకుచనెను అంత జీవేశ్వరు డుపనిషత్తరుణిని సంభావింప, ఆమె వివేకున కభివందనము లాచరించి యుపాంత స్థలమున నధిష్ఠించెను జీవేశ్వరు డుపవిషదాంగనతో భామా! నీవు భర్తవలన నెడబాటు నొంది పెక్కుకడగండ్లుండి కాలము గడపుచుంటివని మేమెఱుగుదము ఎచ్చటెచ్చటనే విధమునైన బాధల బొందితివో మాకు నెఱుగ జెప్పుమనిన యామెయిట్లనియే "కృష్ణాజినాజ్య సమిధాసుధాది గృహీత హస్తయై యజ్ఞ విద్యాదేవి నన్నునొల్లక నాతో బురుడించి వేదుచోటికి నన్నరుగుమని వెళ్ల

గొట్టెను. అంతట కర్మమీమాంసాతరుణి యొద్దకునే బోవ నామెయు యజ్ఞవిద్యా దేవివలెనే నన్నోర్వలేక పొమ్మని దారి జూపెను. తరువాత తర్కవిద్యలవద్దనే జేరగ వారు నానావిధకర్కశ భాషణములను నన్ను రెచ్చగొట్టి చెలరేగి నన్ను బంధించుట కనుసంధించుచుండ నేభయభ్రాంతనై పాఱుచున్న నన్నుజూచి విష్ణు భటులు వెఱవకు వెఱవకుమని నాకభయమిచ్చి యాకఠిన హృదయలగు నాతర్క విద్యలను మోదిచెదర గొట్టిరి. అంత నాపుత్రికయగు శ్రీగీత మచ్చికమున వచ్చి కౌగలించి నన్నాదరడించెను. ఇటనన్యసామాన్య విషయావస్థలనుబొంది తిరిగి ఏలినవారి ప్రాపున జేరగలితిని" అని పలికి జీవేశ్వరునితో "నీవు పరమాత్మవు నీకును పరమేశ్వరునకు భేదములేదు" అని చెప్పిన జీవేశ్వరు డామాటల యాథార్థ్యమును గ్రహింపనేరక వివేకుని వంక చూచెను. ఆమహానుభావుడు యుపనిషద్దేవి మాటలను వివరముగా వినిపింప జీవేశ్వరుడు గ్రహించి సంతసించుచున్న సమయమున నిధి ధ్యాసమును శాతోదరి వారిని సమీపించి యుపనిషద్దేవికి సంజ్ఞ చేసి యిట్లుచెప్పె.

"విష్ణుభక్తి మహాదేవివలన ఈ సందేశమును మీకు గొనివచ్చితిని. వివేక మహారాజు సన్నిధానమున నీవుందిన మాత్రమున సంకల్పజననివై విద్యా ప్రబోధచంద్రుల నీ గర్భమున దాల్చితివి. నీవు నీ తనూజయగు విద్యాకన్యను మనసునందు ప్రవేశపెట్టి ప్రబోధచంద్రుని పురుషునియందునిల్పి నీవు వివేకుని దోడ్కొని యామెకడకు జేరుమని యామె యాజ్ఞాపించినది" అని యిట్లు చెప్పి నిధిధ్యాసము జీవేశ్వరుని యందంతర్ధాన మయ్యెను.

తరువాత విద్యుల్లతా ప్రభాసియగు విద్యాకన్యయు నిర్మల సహజ ప్రకాశమానుడగు ప్రబోధచంద్రుడును నావిర్భవించిరి. జీవేశ్వరు డపారమగు సంతోషమును బొంది వారిని గౌరవించి యతిశయించు చున్న సమయంబున విష్ణుభక్తి మహాదేవి చనుదెంచెను. జీవేశ్వరు డామెకు వినమితోత్తమాంగుడై ప్రణమిల్లి దీవనలు పొందియామె యానతిచొప్పున వివేకుని మంత్రిగా జేసికొని శ్రద్ధమతి, శాంతి మున్నగు నారీమణుల వనితల కాస్పదుండై నిరుపమాన వైభవమున సదానంద సామ్రాజ్యము నేలుచుండెను.

# పాత్రలు

## పురుషులు

| | |
|---|---|
| వివేకుడు | ప్రధాననాయకుడు |
| వస్తువిచారుడు | వివేకుని కింకరుడు |
| సంతోషుడు | వివేకునిసహచరుడు |
| పురుషుడు | ఉపనిషత్పతి |
| ప్రబోధచంద్రుడు | వివేకుని పుత్రుడు |
| మహామోహుడు | వివేకుని ముఖ్యశత్రువు |
| చార్వాకుడు | మహామోహుని మిత్రుడు |
| కాముడు )<br>క్రోధుడు )<br>లోభుడు )<br>దంభుడు )<br>అహంకారుడు ) | మహామోహుని అమాత్యాదులు |
| మనస్సు | సంకల్పాత్మకము |
| వైరాగ్యము )<br>నిధిద్యాసనము )<br>సంకల్పుడు ) | మనస్సువలన జన్మించినవారు |
| దిగంబరుడు | జైనుడు |
| భిక్షువు )<br>క్షపణకుడు ) | బౌద్ధులు |
| కాపాలికుడు | కాపాలికమత ప్రవర్తకులు |
| జాల్ముడు | కామునిదూత |
| వటువు )<br>శిష్యుడు )<br>పురుషుడు )<br>దౌవారికుడు ) | ఇతర పరివారము |

## స్త్రీలు

| | |
|---|---|
| మతి | వివేకునిపత్ని |
| ఉపనిషద్దేవి | వివేకునిపత్ని |
| శాంతి | వివేకునితోడ బుట్టినది |
| కరుణ | శాంతిసఖురాలు |
| శ్రద్ధ | వివేకుని మంత్రిణి |
| మైత్రి | శ్రద్ధసఖురాలు |
| విష్ణుభక్తి | ఉపనిషత్సఖి |
| సరస్వతి | విష్ణుభక్తిసఖురాలు |
| గీతాదేవి | విష్ణుభక్తిసఖురాలు |
| క్షమ | వివేకునిదాసి |
| రతి | కామునిపత్ని |
| కాపాలిని | కాపాలికునిభార్య |
| మిధ్యాదృష్టి | మహామోహునిపత్ని |
| విభ్రమావతి | మిధ్యాదృష్టి సఖురాలు |
| హింస | క్రోధునిపత్ని |
| తృష్ణ | లోభునిపత్ని |

దౌవారికుడు, ప్రతీహారి మున్నగువారు కలరు.

### నాటకమున స్త్రీ పురుషపాత్రల సమన్వయము

సృష్టి యంతయు స్త్రీ ప్రజయోగాత్మకము. అందువలన నిందు సుగుణ దుర్గుణములు కామమోహాదులకు వివేకాదులకు దాంపత్యము కల్పింపబడినది.

| పురుషపాత్రలు | స్త్రీ పాత్రలు |
|---|---|
| ఈశ్వరుడు | మాయ |
| ప్రవృత్తి కాముడు | రతి |
| మోహుడు | మిధ్యాదృష్టి |

| | |
|---|---|
| క్రోధుడు | హింస |
| లోభుడు | తృష్ణ |
| నివృత్తి వివేకుడు | మతి |
| | ఉపనిషత్తరుణి |

పైవానిలో మనకు సాహిత్యమున ప్రత్యక్షమగునది రతి మన్మధులు లేక కాముడు మాత్రమే తక్కిన వారీనాటకమునందు మాత్రమే గానవత్తురు.

ఇతర పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| ప్రవృత్తి | |
| చార్వాకుడు మహామోహుని మిత్రుడు | విభ్రమావతి మిథ్యాదృష్టి చెలికత్తె |
| దంభుడు మోహునిమంత్రి | |
| దుర్గుణుడు మోహునిచారుడు | |
| నివృత్తి | |
| సంతోషుడు వివేకుని మిత్రుడు | శాంతి వివేకునిసోదరి |
| వస్తువిచారుడు వివేకుని సేవకుడు | శ్రద్ధ శాంతితల్లి |
| సదాచారుడు వివేకుని చారుడు | కరుణ శాంతికిసఖి |
| | మైత్రి శ్రద్ధకుసఖి |
| | విష్ణుభక్తి ఉపనిషత్సఖి |
| | సరస్వతి విష్ణుభక్తికి సఖి |
| | క్షమ వివేకునిదాసి |

అద్వైత వేదాంతమునకు మూలమైన మూడును నిచ్చట స్త్రీ పాత్రలైరి.

| | |
|---|---|
| బ్రహ్మసూత్రములు | వ్యాసస రస్వతి |
| ద్వాదశోపనిషత్తులు | ఉపనిషత్సఖి పైన చెప్పబడినవి |
| భగవద్గీత | భగవద్గీతావనిత |

ఇచట ఉపనిషత్తు గీతా శబ్దములు రెండును సంస్కృతమున స్త్రీ లింగములే గనుక విశేష్యవిశేషణములు లింగసమన్వయము కుదిరినది.

## మతమునకు సంబంధిన పాత్రలు

అద్వైతమతము ఇతరములైన బౌద్ధజైనాది మతముల ఖండించినది. ఆమతములిందు పుంస్త్రీ రూపములు దాల్చినవి.

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| బుద్ధముని | నాస్తికవిలాసిని |
| జైనుడు | |
| క్షపణకుడు | |
| దిగంబరుడు | |
| భిక్షువు | |
| సోమసిద్ధాంతి | |
| పాశుపతుడు | |
| కాపాలికుడు | కాపాలిని |
| కామ క్రోధ లోభ జంభా హంకారములు | తామసి |
| మోహునిమంత్రులు | |
| యమనియమాసనధ్యాన ధారణ | |
| ఈశిత్వ వశిత్వ ప్రాకామ్యములను నెనమండుగురు దర్శనములు | మధుమతి |
| చార్వాకుడని తర్కముని | |
| పూర్వమీమాంస | మీమాంసాతరుణి యజ్ఞవిద్యాదేవి |

ఇట్లీనాటకమున 32 పురుషపాత్రలు 30 స్త్రీ పాత్రలు గలవు.

## అనువాద విధానము

సంస్కృతమున ప్రబోధచంద్రోదయము ఆరంకముల దృశ్యకావ్యము దానిని తెలుగున నీకవులు 5 ఆశ్వాసముల శ్రవ్యకావ్యముగా సంతరించినారు. వారు మూలకృతిలోని కథాప్రణాళికనుగాని, పద్యగద్య క్రమముగాని భావస్థితిని గాని

సాధారణముగానే మార్పు లేకుండగనే స్వీకరించిరి. దృశ్యకావ్యము శ్రవ్యకావ్యముగా చేయుటచే ప్రారంభముననే మార్పు చేయవలసి వచ్చినది.

మూలమున నాంద్యంతమున నటీసూత్రధారుల ప్రస్తావనయైన వెనుక తెర యెత్తిన వెంటనే కాముడు రతియు ప్రవేశించి నాటక కథావిషయము సంభాషణ మూలమున దెలుపుదురు.

తెలుగున నిది ప్రబంధము గావున ప్రబంధ పద్ధతిని పురవర్ణనతో ప్రారంభమైనది.

చిదానందనగరి యను పురముగలదు. ఆపురమునకు ఈశ్వరుడురాజు మాయ యాతనిభార్య. ఆతనికి మనసనెడు కుమారుడు గలడు. ఆతనికి కిరువురు భార్యలు వారివలన పుత్రులు గలిగిరి. ఆపుత్రులు దాయాదులుగాన రాజ్యముకొఱకు తగవు లారంభమైనవి. పెద్దభార్యకొడుకు రాజ్యమాక్రమించు రెండవభార్య కొడుకులను తరుమగొట్టుటకొక యాలోచన సభకావించెను. అని కథాక్రమము తెలిపిన తరువాత ఆ ఆలోచనసభలో రతికాముల సంభాషణ ప్రవేశపెట్టబడినది.

నాటకములో పాత్రలే కథాక్రమమును వివరింతురు. ఇది కావ్యముగాన కవియే కథాక్రమము దెలుపును. ఇదియే రెండింటికిగల భేదము దృశ్యకావ్యము శ్రవ్యకావ్యముగా చేయుటచేత అనువాదమున ప్రారంభము ననేగాక కథాప్రణాళికలో కొన్ని మార్పులు ప్రవేశపెట్ట వలసి వచ్చినది.

1) మూలమున కాశీనగరమున మహామోహమహారాజు ప్రవేశించినప్పుడు కొంత పరివార మున్నదని మాత్రముగలదు. గాని కాముడు క్రోధుడు మొదలగువారు మోహుని దగ్గఱ నున్నట్లులేదు ప్రతిహారిని పంపి వారిని పిలువ నంపెను.

ప్రబంధమున నట్లుగాక మహామోహుని తోడనే వారందఱు ప్రవేశించినట్లు గలదు.

2) మూలమున నుపనిషద్దేవి శాంతి సహితయై ప్రథమమున జీవేశ్వరుని కడకు బోయినట్లుగనున్నది. తెలుగున జీవేశ్వర మహారాజే మొదట ప్రవేశించి నట్లుగా నున్నది.

3) మూలము నాటకముగాన నందు వర్ణనలులేవు. తెలుగున నిది ప్రబంధము గావునను, ప్రబంధమునకు వర్ణనలు నియతమగుట చేతను నీకవులు వర్ణనలను ప్రవేశపెట్ట వలసి వచ్చినది. కావ్య ప్రారంభమున పురవర్ణన యుండవలెను గాన చిదానందనగరిని కల్పించి మహామోహునకు వివేకున్నకు యుద్ధము మొదలగుటకు పూర్వము సాయంకాలవర్ణన కల్పితమైనది. ఇది మూలమునలేదు.

మూలములో సంభాషణలు వచనముగా నుండగా నిది శ్రవ్యకావ్యము గావున పద్యములతో నున్నది[1].

4) మూలమున నారు అంకములుగలవు. కాని తెలుగున అయిదాశ్వాసములు గలవు.

| | |
|---|---|
| ప్రథమాంకము | ప్రథమాశ్వాసము |
| ద్వితీయాంకము | ద్వితీయాశ్వాసము |
| చతుర్థాంకము | ) |
| పంచమాంకము | )చతుర్థాశ్వాసము |
| షష్ఠాంకము | )పంచమాశ్వాసము |

మూలమునగల 4,5,6 అంకములు తెలుగున 4,5 ఆశ్వాసములలో సంగ్రహింపబడినది. అనగా కథాక్రమము సక్రమముగానున్నది. మూలమువలె ఆరు

---

1. పద్యకావ్యములలో నొక్క సముఖము వేంకట కృష్ణప్పనాయని రాధికా సాంత్వనమున నాటకమునందువలె పద్యములలోనే సంభాషణగలదు.

అంకములకు ఆజాశ్వాసములు చేసిన యెడల, ఆశ్వాసములు చాల చిన్నవియగును. అందువలన కవులిట్లు చేసినారని మనము భావించవలెను.

మూలమున చతుర్థాంకము మైత్రి" అను పాత్రలో ప్రారంభము. కాని తెలుగున – ఆ పాత్ర తృతీయాశ్వాసముననే ప్రవేశపెట్టబడినది. వివేకమహారాజు స్వగతము. ఆవెనుక వస్తువిచారుడు వచ్చుటగలదు. పంచమాంకమునగల కథ యంతయు. చతుర్థాశ్వాసముననే చెప్పబడినది. ఇందుమూలమున సంస్కృత మూలమునగల ఆఱు అంకములు తెలుగున అయి దాశ్వాసములైనవి.

గ్రంధకర్తలు శైవులు. శివుడు పంచముఖుడు గాబట్టి మూలమున ౬ అంకములున్నను, తెలుగున ౫ ఆశ్వాసములుగా వ్రాసిరని మనము సమర్థించు కొనవరెను.

ఈసంస్కృత నాటకము యథా మూలముగాని అనువదింపబడినది. కాని సంస్కృతమునగల శ్లోకములు, తెలుగున సీసపద్యములు వ్రాయునపుడు మూల భావములు మూడు పాదములలో నిమిడిన నాల్గవపాదమున ఎత్తుగీతి యందు స్వంత కల్పన కథాసందర్భమున చేసిరి.

(i) మూలమునలేని భావములు చేర్చుట –

(i) శ్లో. అహల్యాయై జారః సురపతిరభూరాత్మ తనయాం
ప్రజానాథోయాసీ దభజతగు రోరిందురబలామ్
ఇతిప్రాయః కోవాన పథమనదే కార్యతమయా
శ్రమోమద్బాణానాం కఇవ భువనోన్మాదవిధిషు. (1-14)

సీ. తనకన్నకూఁతును దానపెండ్లాడఁడే
వారిజగర్భుండు వావిదప్పి
బలభేది గౌతము భార్యనహల్యఁగా
మించి చేయడె నల్లమేఁకతప్పు
కడలేనిరట్టడి కొడిగట్టుకొనియైనఁ
గమలాదిగురుతల్పగతుఁడు కాఁడె

తపనసూనుఁడు తారఁ దా నాక్రమింపఁడె
యన్న ప్రాణములకు నల్కుఁదలఁచి

గీ. మఱియు నిట్లు జగంబుల మరులు కొలిపి
ఎట్టి నియతాత్మకులనైన గుట్టుచెఱిచి
కానిత్రోవల నడిపించు కడిమి నాదు
వాలుతూపులగమి కవలీలగాదె. (1-50)

మూలశ్లోకములో, బ్రహ్మ-కూతురు సరస్వతి, అహల్య - ఇంద్రుడు, చంద్రుడు తార అను మూడు దృష్టాంతములు మాత్రమే యున్నవి. సీసపద్యములో నీయనువాదము సాగినదిగాన, నాలుగవపాదమున సమతత్వము కొఱకు కింకొక దృష్టాంతము కావలసియున్నది. దానిపై నాల్గవపాదమున వాలి తారను లేవదీసు కొని పోవుట రామాయణమునుండి గ్రహింపబడినది.

శ్లో. శ్రీదేవీ జనకాత్మజా దశముఖస్యాసీత్ గృహేరక్షసో
సీతాచైవర సాతలం భగవతీవేదత్రయీదానవైః
గంధర్వాశ్చ మదాల సాంచతనయాం పాతాళకేతుశ్ఛలాత్
దైత్యేంద్రోప జహార హ స్తవిషమావామావిధేర్వృత్తయః (3-4)

సీ. చాపచుట్టఁగఁజుట్టి చంకఁబెట్టుక పోఁడె
ధరణి హిరణ్యాక్ష దానవుండు
వేదత్రయీకాంత వెస ముచ్చిలింపఁడె
చూఱపట్టిన యట్లు సోమకుండు
సాక్షాన్మహాలక్ష్మి జనకభూపాలనం
దనఁ జెఱపట్టఁడే దశముఖుండు
కొసరక యమ్మదాలసఁ గొనిపోఁడె పా
తాళకేతుఁ డనునక్తంచరుండు

గీ. కాన నింతేసివారముగా యనంగ
రాదుపో యెట్టి పుణ్యవర్తనునకైన

సహజవక్రంబుగాన సజ్జనులమేలు
చూడఁజాలక విధితప్పఁ జూచెనేని (3-11)

పై పద్యమున మొదటి పాదము "చాపచుట్టగఁజుట్టి చంకఁ బెట్టుకపోడె ధరణి హిరణ్యాక్ష దానవుండు" అనునది అమూలకము. నీ పద్యము నాలుగు పాదములు పూర్తికావలెను. మూలమున మూడు దృష్టాంతములు మాత్రమే యున్నవి. అందుకొరకు నాల్గవది చేర్చినారు. ఈ కథ వరాహపురాణములోనిది

వ. మహామోహాః భోఅసత్సంగ ఆదిశ్యంతాంకామ క్రోధ లోభ మదమాన మాత్సర్యాదయః యథా యోగినీ విష్ణుభక్తి భవావద్భిరే నావహిత్తైర్విహంతవ్యేతి (2-26)

యోగిని యగు విష్ణుభక్తిని సంహరించుటకు ప్రయత్నములు సల్పుమని మహామోహుడు కామ క్రోధాదుల కసత్సంగునిద్వారా వర్తమాన మంపినట్లు మూలములో నున్నది.

తెలుగున కామక్రోధాదు లెదుట నున్నట్లును వారితోనే మహామోహుడీ వార్త చెప్పినట్లున్నది.

మ. పడతీ!దల్లిని దండ్రిఁ జంపుట తృణప్రాయంబు తోఁ బుట్టలన్
మడియం జూచుట లెక్కగాదనిన జన్మజ్ఞాతి కీటంబులన్
గెడపం బూనుట నాకు దొడ్డె గుడి మ్రింగే వానికిన్ దల్పుల
ప్పడము ల్గావునఁ బిల్ల పిల్ల తరమున్ భక్షింతు దాయాదులన్. (2-67)

ఇందు మూలములో లేని లోకోక్తి యొకటి చేర్చ బడినది.

శ్లో. నిత్యంస్మరన్ జలదనీలము దారహార
కేయూరకుండల కిరీటి ధరంహరింవా
గ్రీష్మేసుశీతమివ వాప్రాద మస్తశోకం
బ్రహ్మప్రవిశ్యభవ నిర్వృతి మాత్మనీనాం (4-23)

లయగ్రాహి నందకధరున్ ఘనపురందరమణి ప్రతిము నిందిరమనోహరు
ముకుందు హరిఁగానీ
చందన మరాళ బిసకుంద ధవళాంగు గిరిమందిరు నుమారమణు
నిందుధరుఁ గానీ
పొందుగ సదా మనసునం దలఁచి యైనఁ జిర మందమగుఁ దత్ప
రమునిందలఁచియైనం
డెందముల పాపములు వడిం దలఁగు ఘర్మమునఁ గుంది మడుగుం
దదయడిందుపడు లీలన్ (5-33)

మూలములో "హరి" కృష్ణుని స్తుతి మాత్రమే యున్నది. కృష్ణమిశ్రుడు వైష్ణవ మతస్థుడుగాన శ్రీకృష్ణుని మాత్రమే పేర్కొన్నాడు. తెలుగున నంది మల్లయ ఘంటసింగయలు శైవులగుటచే హరికృష్ణునితో సమానముగా హరుని శివుని గూడ పేర్కొన్నారు.

విష్ణు ప్రశంస మాతృకానుసారము
శివప్రశంస స్వంతకల్పనము

ఇచట నింకొక విశేషమున్నది. అనువాదకులు పెద్దవృత్తమగు లయ గ్రాహిని గ్రహించినారు. ఆ వృత్తము పూర్తియగుటకు క్రొత్తకల్పన యవ సరము. అందుచే శివుని గూడ జేర్చినారు.

హరిహరు లొక్కరేయని హరివంశ ప్రతిపాదన గావున నీ కల్పన యెంతయు నౌచితీ సంపాదనమైయున్నది.

## మూలశ్లోకభావ విస్తరణ

శ్లో. సమ్మోహయంతి మదయంతి విడంబయంతి
నిర్భర్త్సయంతి రమయంతి విషాదయంతి
ఏ తాః ప్రవిశ్య సదయం హృదయం నరాణాం
కింనామ వామనయనా న సమాచరంతి (1-22)

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నలు చేసి
వెడమాటలను బ్రేమ గడలు కొలిపి
తరితీపునటనలఁ దమకంబుఁ బుట్టించి
వట్టి ప్రియంబుల గుట్టు దెలిపి
కలికితనంబున కోకలు గావించి
తోడి నీడలు వోలె గూడి మాడి
యలుకల నలయించి కలయిక వలపించి
బాసల నడియాస పాదుకొల్పి

గీ. మనసు కరగించి భ్రమయించి మస్తరించి
మిగులఁ జొక్కించి యెంతయు దగులు పఱచి
పాసి యెడఁ బాసి తమబంటు చేసికొనరె
వామలోచన లెంతటి వారినైన. (1-75)

ఇది సంస్కృత మూలమునకు చక్కని వ్యాఖ్యానానువాదము.

శ్లో. క్షేత్రగ్రామవనాది పత్తన పురద్వీప క్షమామండల
ప్రత్యాశాయతసూత్ర బద్ధమన సాంలబ్దాధికం ధ్యాయతాం
తృష్ణేదేవి యదిప్రసీదసి తనోష్యంగాని తుంగానిచే
త్తదో్భఃపిప్రాణ భృతాంకుతః శమకథా బ్రహ్మాండ లక్షైరపి (2-82)

సీ. పుడమిలో మాన్యంపుమడి కొంతగలవాఁడు
గ్రామమెల్లను నేలఁగా దలంచు
గ్రామ మేలెడువాఁడు కాంక్షించు గిరివన
స్థలజలదుర్గ వద్రాజ్యమేల
రాజ్య మేలెడు వాడు రాజ్యవైభవమున
హెచ్చితా నొకద్వీపమేలఁ గోరు
ద్వీప మేలెడువాఁడు తేజస్వియై మహీ
వలయ మెల్లను నేల వాంఛసేయు

గీ. నిట్లుకడరేని యాసాస లీనుచుండ
జనులు బ్రహ్మాండకోటులఁ దనివినొంద
రనిన శాంతికిఁ గాలూదనైనఁ గలఁదె
యెడము మదిఁ దృష్ణ నీవింత వెడలితేని (2-64)

శ్లో. నరాస్థిమాలాకృత భూరి భూషణః
శ్మశాన వాసీనృకపాల భోజనః
పశ్యామి యోగాంజన శుద్ధ దర్శనో
జగన్మిథోభిన్న మభిన్న మీశ్వరాత్ (2-12)

సీ పుట్టింప రక్షింపఁ బొలియింపఁ గర్తయౌ
భైరవేశ్వరుడు మాపాలివేల్పు
ప్రమద నటద్భూత భయదశ్మశానశృం
గాటకంబులు మాకు నాటపట్లు
నక్షత్ర పటలీవలక్షంబు లైనన
రాస్థిఖండములు మాహారతతులు
నీహారకరబింబ నిభమానవశిరఃక
పాలము ల్మాభుక్తి భాజనములు

గీ గాఁ జరింతుము తమలో జగంబులెల్ల
వేరువేరైన శివునితో వేరుగా వ
టంచుఁ జూతుము సిద్ధయోగాంజనపు
దీపితంబైన సుజ్ఞానదివ్యదృష్టి. (3-32)

ఇచ్చటను చిన్నవృత్తమునకు నీ పద్యము చేకొనబడినది, భైరవేశ్వరుడు మాపాలివేల్పు అనునది యనువాదమున చేర్చబడినది, ఇచటను మూలమున మూడు విశేషణములు మాత్రమే కలవు. శ్మశానవాసము, కపాలభోజనము అస్థిహారము. నాల్గవ పాదపూరణమునకై భైరవేశ్వరుడు చేర్చబడినాడు. ఇది యుచితమే.

కాపాలికులు శైవులలో నొకశాఖ. కావున శైవులైన యనువాదకులు భైరవేశ్వరుని జేర్చిరి. కాలభైరవుడు కాపాలికులు కొల్చెడి వేల్పు.

భావసంగ్రహణము

"మధ్యాహ్నార్క మరీచి కాస్వివపయః పూరోయద జ్ఞానతః
ఖంవాయుర్జ్వలనోజలం క్షితిరితి త్రైలోక్యమున్మీలతి
యత్తత్వ్యం విదుషాని మీలతిపునఃస్రద్భోగి భోగోపమం
సాంద్రానంద ముపాస్మహే తదమలంస్వాత్మావ బోధంమహః (1-1)

అంతర్నాడీనియమిత మరుల్లంఘిత ప్రాణరంధ్ర
స్వాంతేశాంతి ప్రణయినిసము న్మీలదానందసాంద్రమ్
ప్రత్యగ్జ్యోతిర్జయతి యమినః స్పష్టలాలాటనేత్ర
వ్యాజవ్యక్తీతమవ జగద్వ్యాపిచంద్రార్థమోళేః (1-2)

ఈ రెండు నాందీశ్లోకములను నీకవు లొక్క పద్యమున తెలుగు చేసినారు.

సీ. ఎఱుఁగనివారికి నేదేవుఁడు ప్రపంచ
మేమరీచికలు నీరైన కరణి
నెఱిఁగినవారికి నేదేవుఁడు జగంబు
గాఁడు పగ్గము పాముగాని కరణి
నే దేవుఁడు వెలుంగు నాది శక్తియుఁ దాను
నెలయును నిండువెన్నెలయుఁబోలె
బ్రహ్మనాడ్యాగత ప్రత్యక్పరంజ్యోతి
నామించు నే దేవునడిమినేత్ర

గీ. మట్టి సర్వేశుతోడిఁ తాదాత్మ్యమహిమ
గలిగి పరిపూర్ణభావ విఖ్యాతుఁడైన
దక్షిణామూర్తి దేశికోత్తము నఘోర
శివుల భజియించి యేకాగ్రచిత్తమునను. (1-32)

మూలమున నాందీ శ్లోకములలో మొదటిది అద్వైత బ్రహ్మమును, రెండవది శివుని తెలుపును. చంద్రార్ధమౌళి యని కవియే స్పష్ట పఱచినాడు. తెలుగున నీరెండు శ్లోకములును శివునిపరముగా నన్వయింపబడినవి.

రెండవశ్లోకములో మూలమున "శాంతిప్రణయుని" అని అద్వైతపర ముగా యుండగా తెలుగున ఆదిశక్తి అని శివశక్తి పరముగా నున్నది.

తెలుగున కవులిద్దరు నీశ్వరారాధకు లగుటవలన అనగా శివారాధకులైన శైవులగుటచేత అద్వైతపరముగా నున్నదానిని శివపరముగా మార్చినారు.

## గురుస్తుతి

పైరెండు శ్లోకముల పద్యానువాదము తమ గురువగు దక్షిణామూర్త్య ఘోరశివాచార్యుల పరముగా చెప్పబడినది. గురువు సాక్షాత్తు శివస్వరూపుడు.

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుసాక్షాన్మహేశ్వరః"
గురుశ్చమాతాపితరౌ తస్మైశ్రీ గురువేనమః" అనిసూక్తి.

అద్వైతబ్రహ్మమును, శివునితో, తమగురువుతో సమన్వయము చేసి స్తుతించుటవలన ఇచట దైవపరమగు శివస్తుతిగాక దైవస్వరూప మానవుడైన తమ గురుస్తుతి యైనది.

## యధామూలానువాదములు

1) "వేశ్యావేశ్మసు సీధుగంధలల నావక్త్రాసవామోదితై
ర్నీత్వా నిర్భరమన్మథోత్సవరసైరున్నిద్ర చంద్రాక్షపాః
సర్వజ్ఞాఇతి దీక్షితా ఇతిచిరాత్ప్రాప్తాగ్ని హోత్రాయితి
బ్రహ్మజ్ఞాఇతి తాపసాయితి దివాధూర్తై జగద్వంచతి 2అం. 1శ్లో

మ. రతులన్ సీధురసంప్రుక్తోవులగు వారస్త్రీల కెమ్మోవులన్
మతి నుప్పొంగుచుఁగ్రోలి వెన్నెలల నానందించిరేపాడి దీ
క్షితులై, తాపసులై సదాజపితలై క్షీరోదకాహారులై
యతులై దంభత మోసపుచ్చుదురు మర్త్యశ్రేణి ధూర్తోత్తముల్ (2-3)

2) "నీవారాంకితసైకతాని సరితం కూలానివైఖానసో
రాక్రాంతాని సమిచ్ఛషాలచమసవ్యాప్తాగృహాయజ్ఞనామ్
ప్రత్యేకంచనిరూపితాః ప్రతిపదంచత్వార ఏమాశ్రమాః
శ్రద్ధాయాఃక్వచి దప్యహూ ఖలుమయావా ర్తాపినాకర్ణితా 3అం3శ్లో

మ. చెలియా! యింతకుమున్ను మౌనివిసరక్షిప్తోచ్ఛషష్ఠాంశసం
కులనానాతటినీ విశాలపులినక్షోణీ సమీపంబు లు
జ్జ్వలస్రుగ్దర్భ సమిచ్ఛషాల చమసవ్యాప్తాధ్వరాగారముల్
గలయం జూచితిఁ దల్లి నేకడ వినం గానంగ లేనక్కటా! (3-9)

## అమూలకములు

ఈ క్రింది పద్యములు రెండును చతుర్థాశ్వాసమున నున్నవి పీనికి మూలములేదు.

ఆ.వె. ఇట్టి మోహభూత మిరవగు సంసార
సాలమనవబోధమూలయుతము
కాన నీశ్వరాంఘ్రికమలార్చనాజాత
బోధగజము చేరి పోవవైచు. (4-4)

2. సీ. నికటమలద్వార నిర్గత దుర్గంధ
వాతూలసంఘూతవాసితంబు
వితతకోణత్రయీవిస్తారితానేక
సాంద్రకంటక రోమసంవృతంబు
కలుషభూరి రజోవికారసముద్భవా
సారశోషిత పంకసంకులంబు
విస్రగంధాలయాజస్రపరిస్రవ
బహుంతరప్రసావవల్లవంబు

గీ. నైనభవదీయమందిర ప్రాంగణమున
కెట్టు దివిచెదు యోగ్యులైనట్టిమనుల

భృంగమౌర్వీనినాదకంపిత సమస్త
పటువియోగి జనప్రాణ!పంచబాణ! (4-10)

వీనికి మూలము లేకపోవుటచే వీరేశలింగముగారు "ఇదియొక ప్రతియందున్నది ప్రక్షిప్తమై యుండును. ఇదియొక ప్రతిలోనే యున్నది, ప్రక్షిప్తమనితోచుచున్నది." అని అధోజ్ఞాపికలు వ్రాసి యున్నారు.

అనువాదములు

ఇట్టిది యొకటియే యున్నది.

"నిహతస్యపశోర్యజ్ఞే
స్వర్గప్రాప్తిర్యదీక్షితే
స్వపితాయజమానేన
కింనతస్మాన్నిహన్యతే (6-25)

ఈ శ్లోకము ప్రబోధచంద్రోదయ నాటకమున నున్నను నది కృష్ణమిశ్ర రచితముగాదు. కృష్ణమిశ్రుడే ఉపనిషద్దేవిచేత ఈ శ్లోకమును పలికించినాడు ఈ శ్లోకము భగవద్గీత 16వ అధ్యాయమున 19వ శ్లోకము. కావుననే నీకవులు దానిని విడిచిపెట్టిరి. యథానువాదము గావించిన యధునాతన కవులు దీనిని యాంధ్రీకరింపలేదు. ఒక్క గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు మాత్రమే యనువదించిరి.

జంటకవులు దీనిని విడిచిపెట్టుటకు నింకొక హేతువున్నది. వీరు శైవులు శైవులకు భగవద్గీత ఎంతమాత్రమును ప్రమాణగ్రంథము గాదు. వారి కాగమములే ప్రమాణములు.

వర్ణనలు

కృతిపతియైన గంగన కవులను ప్రబంధరీతిని ప్రబోదచంద్రోదయ నాటకమును రచింపుడని యభిలషించినట్లు గలదు.

క. అనవుడు ననంతవిభు గం
గన వారలఁజూచి యిట్టి ఘననాటకముం

దెను(గున( "ప్రబంధశయ్యను"
నొనగూర్చ(గ నేర్చు సుకవు లుర్విం గలరే. (1-22)

కృతిపతి యఖిలాష ప్రకారము కవులు నీ నాటకానువాదమున ప్రబంధ వర్ణనలు నెలకొల్పి చంపూప్రబంధముగా మార్చివేసిరి

1. కృతిపతి కొలువుకూటము వర్ణన వచనము (1-25)

2. పురవర్ణన

సీ. అనుపమ జ్యోతిర్మయంపు( గోటలుచుట్టు
రాజిల్లుచుండునే రాజధాని
సరిలేని యమృతంపు( బరిఖలే పట్టణం
బున నగాధంబులై తనరుచుండు
మరి సాటిలేని నైర్మల్యంపు మేడలే
వీట మిన్నుల కను మీదుమిగులు
ప్రతిలేని సహజ సౌరభ్యంపు(దో(టలే
పుటభేదనంబున( బొలుపుమీఱు

గీ. సంతత రిరంసపరమహంస ప్రమోద
కారణమహావికస్వర కమలచక్ర
పూర్ణసదమల సరసులే పురమునందు(
గ్రందుకొనుచుండు నాచిదానందనగరి. (1-39)

3. జైత్రయాత్ర

సీ. కటితటీకట దానగంధ భ్రమత్ భృంగ
భీకర కరిఘటాబృంహితముల
భీషణవిద్వేషి వేషి యథోచిత
వేషఘోటక ఘోర హేషితముల
ధనురాది వివిధాయుధ ధ్వజాధిష్ఠిత
నిష్ఠురస్యందననిస్వనముల

ఖడ్గ మయూఖాంధకారి తాళాముఖ
వీరభట ప్రోద్భటారభటులఁ

గీ. గాహళారవ భేరి ఖాంకారములను
గంచుకివ్యూహ భూరి హుంకారములను
పద్మజాండంబు బీటలు వాఱుచుండ
దళదళంబులు చక్రతీర్థంబు వెడలె. (4-37)

4. ఉద్యానము

క. చంచల గురుదంచలమద
సంచరదళి సంచయాతి సంభన్నదళో
దంచిత సుమకంచు కితము
వెంచఁగొలఁదిగాక మించె నివె పూఁదోఁటల్ (4-42)

5. సూర్యాస్తమయము
చంద్రోదయ సూర్యోదయములు

శా. అంతగుంకుమపంక పాటలిమతోనస్తాద్రిపై నిత్రెఖా
స్వంతుఁ డిందుఁడు నిందగోపరుచి పూర్వక్ష్మాధరంబెక్కె వా
రెంతేఁ జూడఁగ నొప్పి రప్పుడు వివేకేశప్రతాపప్రభా
ప్రాంతంబరదలి వెంటపంజువలెఁద్రాకాదినాంతంబునన్ (4-48)

సీ. మోహుపక్షమువారి మొగములపగిది యం
భోరుహవ్రాతంబు ముచ్చుముణిఁగె
వికసించె దొగలు వివేకుని పక్షంబు
వారల చిత్తోత్సవంబు కరణి
మోహుని బంధుసమూహంబు క్రైవడిఁ
గోకసమూహంబు శోకమందెఁ
జెలఁగెఁ జకోరకములు వివేకక్షమా
ధవుని నెయ్యంపు బంధువులపగిది

గీ. ముదిసె నిశ మోహు రాజ్యసంపద యనంగఁ
దెల్లవాఱె వివేకుని తెలివి యనఁగ
దొలఁగెఁ జుక్కలు మోహుని బలమనంగఁ
దరణి పొడచె వివేకప్రతాప మనఁగ. (4-49)

6. యుద్ధము

క. కరికరి హరిహరి నరదం
బరదము భటుభటుఁడు దాఁకి యయ్యిరుమొనలన్
సరిఁ బోరిరి శర ముద్గర
కరవాలప్రముఖ శస్త్రఘట్టన మమరన్. (4-57)

మహాస్రగ్ధర ప్రవహించెన్ సైనికాళీ పలలనికరముల్ పంకముల్గా మదేభ
ప్రవరోత్తుంగాంగ శైలప్రకరహత రయాపాండురచ్ఛత్ర పంక్తుల్
కవలై క్రీడించు చక్రాంగముల గములుగాఁ కముల్ రంకముల్ గా
వివిధాస్త్రచ్ఛిన్నభిన్న ద్విషదవయవజోద్యత్ రక్తసవంతుల్

మఱియు వచనము (4-69) 13 పంక్తులు యుద్ధవర్ణన (4-68)

రసము

ఇతివృత్తము ననుసరించి ఇది శాంతరసప్రధాన మగు నాటకము. అయినను తక్కిన రసములు కొన్ని సందర్భానుసారముగా కానవచ్చుచున్నవి.

శృంగారము

ఇది ప్రథమాశ్వాసమున రతిమన్మథ సంభాషణయందు గలదు.

లోలకనీ నికాకుల విలోచనద్వీప్తులు క్రేళ్లదాటఁగాఁ
జాలభయంబున న్వడకు చక్కని చన్న లురంబు మోవఁగా
జాలమనోజ్ఞకంకణభుజాలతలన్ తనుదానె యీగతిన్
బాల గవుంగలించిన మనంబున దుఃఖము లంటనేర్చునే (1-29)

ద్వితీయాశ్వాసము మోహుండు నాస్తికతను కౌగలించిన ఘట్టము
(2-72,73)

తృతీయాశ్వాసమున కాపాలిని బౌద్ధుని కౌగలించుకొను ఘట్టము

క. జవరాలగు కాపాలిని
గవుకిటతనమేను గజరు గజరులు వోగా
నవిరళ సుఖమున హృదయం
బివతాళింపంగ బౌద్ధుఁ డిట్లని పలికెన్. (3-44)

క. వెనుకను నెందరు రండల
ఘనకఠిన స్తనులరతులఁ గౌఁగిటఁజేర్చున్
గన నెన్నఁడు నా కాపా
లిని కౌఁగిఁటిలోని సుఖము లేశంబయినన్. (3-47)

కరుణరసము

తృతీయాశ్వాసమున శాంతి తన జననిగూర్చి ప్రలాపించు ఘట్టము

క. కుడువవుగానేఁ బొత్తునఁ
గుడువక నేఁబ్రక్కలేక గూర్కవుగా యే
యెడనన్ను బాసి నీవర
గడియయు నిలువంగ లేవుగా యోజననీ (3-5)

అని శాంతి ప్రలాపించును

పంచమాశ్వాసమున మనసు మోహాదులు వివేకునిచే నిర్జితులైనపుడు విలపించు ఘట్టము.

సీ. హా! కామరాగ మదాది పుత్రకులార!
కానరారేల నాకూనలార!
కడుపుచుమ్మలు చుట్టగానెట్లు నేనిర్వ
హించెద నను నూఱడించరయ్య!
హా! యసూయాది కన్యకలార! నన్నా
థను విడ్చియిట్లు పోజనునే మీకు
అక్కటా హింసాదులైన కోడండ్రార!
యెక్కడ నున్నారు దిక్కునాకు

గీ. నేది యేదితి మిమ్ముల నిన్ని నాళ్లు
పాప కర్మపు దైన్యమీగతిని మిమ్ము
నొక్కరుని జిక్కకుండఁగ నుక్కడంచె
బాపురే! నాదురంత దౌర్భాగ్యమహిమ. (5-8)

భీభత్సము

మోహునిచే లోకము మోసపోయినపుడు వివేకమహారాజు విచారించు ఘట్టము (4-8)

గీ. వికట దుర్గంధ భీభత్స వేషమలరు
నాలయంబులు చర్మమాంసాస్థిపంజ
రములునైన వధూ శరీరంబులకును
వ్యాధిగృహముల కింతైన వాసి గలదె.

భయానకము

శా. ఏమింకేమనిం జెప్పుదుం జెలి మహాహాక్రూర నిశ్వాసయున్
నానామర్త్యకపాలకుండలియు దంష్ట్రాచంద్ర రేఖాంతర
స్థాన ప్రోల్లస జిహ్మయున్ హుతవహ జ్వాలాక్షియుం ఘోరశై
లానూనాంగియునైన భైరవి మహాహుంకార హుంకారయై (8-76)

అలంకారములు

అర్థాంతర న్యాసము

క. క్రతువునఁ గర్త్రయు ద్రవ్య
ప్రతతియుఁ జెడఁదమకు స్వర్గఫలము గలుగునే
వితతదవానల దగ్ధ
క్షితిరుహముల ఫలము మిగుల చేరువకాదే (2-35)

ఆ.వె. చచ్చినట్టి జనుఁడు శ్రాద్ధంబుచేఁ దృప్తి
బొందు ననెడి మాట పొందుగాదు

తీరవారినట్టి దివియమందునె భూమి
నెంత చమురు పోసిరేని పిదప (2-38).

క. పరిమిశ్రిత దుఃఖంబని
నిరసింతురు విషయ సుఖమున నీరసబుద్ధుల్
ధర నుముకకుగాఁ విడుతురె
సరిబియ్యమువచ్చు దీనసరి ధాన్యంబున్ (౭-౩0)

రూపకము

ఆ.వె. ......... సంసార
సాలమనవబోధ మూలయుతము
కాన నీశ్వరాంఘ్రి కమలార్చనాజాత
బోధ గజము చేరి పోవవైచు (4-4)

ఉపమ

ఇది హెచ్చుగా వాడబడినది.
ఈతఁడెవ్వరొకొ గర్వభరంబున మండు క్రైవడిన్ (2-3)
ఒడిసి వడి న్నెగయు గృధ్రియంబలె (3-73)
వెనకయ వెసల యిచ్చిన విధమున (3-79)
గాండీవి జయద్రథుఁ జంపిన క్రైవడి (4-19)
మరుదాకంపిత కంప విరహితాబ్ధియుఁ బోలెన్ (4-22)
దేవి ఉలాయదానవు వధించి నాలీల (4-25)
కేళ్లంగి వేసినట్లు (5-3)

ఉల్లేఖము

చ. మరగిన కామధేనువుల మందలు, సిద్ధరసప్రవాహముల్
దొరికిన కల్పవృక్షములతోఁటలు, జంబునదీ సమూహముల్
సురపతి రత్నపుంజములు, శుద్ధసుధాఘుటికల్, కవీశ్వరో
త్కరముల కీయనంతవిభు గంగయమంత్రి కృపాకటాక్షముల్. 1-15

## ఉత్ప్రేక్ష

చ. జలకముమూర్ధ్ని చంద్రసుధ షట్కమలంబులు బూజ ధూప ము
జ్జ్వలతర బోధవాసన నివాళి సుషుమ్న వెలుంగు సౌఖ్యముల్
తలఁపున నీగి బోనము సదానత నాదము ఘంట గాఁగ ని
ష్కలుషత నీయనంతవిభు గంగన గొల్చు నిజాత్మలింగతన్ 1-17

ఇందు శివపూజాసమయమున శివయోగానుభవము బ్రహ్మానంద సంధాయి యగు యోగానుభవముగా ఉత్ప్రేక్షింప బడినది.

## కవితారీతి

### శైలి

"శైలి' యనుపదము ఏ సంస్కృతాలంకారికులు వాడలేదు.[1] రీతియని వాడిరి. కాని తెలుగున ప్రాచీనకాలమున నీ పదము ప్రయుక్తమైనది. పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణమున నీ శైలిపదము ప్రయుక్త మైనది.

ద్వి. చరితంబులును శ్రీ బసవపురాణంబు
నేలలు వెట్టంగనింపు సొంపార
శైలిమెగ్గ్రాలుచుఁ జదివెడివారు. (పుట 483) (1939 ముద్రణము.)

ఈ ప్రయోగము క్రీ. శ. 1200 నాటిది కావున లభ్యమైన ప్రయోగములలో ప్రాచీనతరము.

ఈ పదము నేటి సాహిత్యవిమర్శకులందఱును వాడుచునేయున్నారు.

ఈ జంట కవుల రచనారీతి యత్యంత హృద్యమైనది. ప్రత్యేక విశిష్టత గలది. దీనిని గూర్చి ప్రసిద్ధవిమర్శకులగు కీ.శే. చేకుమళ్ల అచ్యుతరావుగారి

---

1. ఈ పదమ్మును గూర్చి పింగళివారి ఆంధ్రవాఙ్మయ చరిత్రలో గలదు. తెలుగున నిది కావ్యములలో శ్రీనాధుని కాలమునుండి యున్నదని శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారు నిరూపించిరి. (చూ.కలగూరగంప - ఆంధ్రవాఙ్మయచరిత్ర భారతి - (సెప్టెంబరు 1976 పుట 53)

యభిప్రాయములను నుదాహరించిన పాఠకలోకమునకు విశదమగును, వీరి కవిత "ధారాశుద్ధి సహజమై సమగతి కలదియై విరాజిల్లును."

"సుకుమారమై మృదులమై ప్రతి పద్యరసస్ఫురితమై హృదయంగమమ్ముగా నుండును.

అచ్యుతరావుగారు వరాహ పురాణమును ప్రబోధ చంద్రోదయములను తులనాత్మకముగా నవలోకించి యీక్రింది యభిప్రాయమును ప్రకటించిరి.

"వీరు రచించిన రెండు గ్రంథములలోను ప్రబోధచంద్రోదయమే ఎక్కువ గణనీయమైనదని నేనభిప్రాయ పడుచున్నాను. దీని శయ్యారీతులు లేఖాయపురచనను బోడసూపుచున్నవి. అయినను రసపుష్టిచే నిగనిగలాడు దాక్షాఫలమంజరులవలె కోమలమై మృదులమై సర్వవిధముల మనోహరమై యున్నది. అందలి పద్యరచన యెంతరమణీయముగా నున్నదో గద్యరచనయు నంతసరళముగాను మనోజ్ఞముగాను నున్నది. వీరిగద్యము పింగళిసూరనార్యుని గద్యమువలె దీర్ఘసంస్కృత సమాసములులేక చిన్నచిన్న శబ్దములతో గూర్పబడి అనుప్రాసమాత్ర శబ్దాలంకార శోభితమై ముత్యంపుసరులవలె, విరాజిల్లుచున్నది."1

అచ్యుతరావుగారన్నట్లు గద్యరచన ముత్యపుసరులవలె నుండుటయేగాక పద్యరచనయు ముత్యంపు సరులవలెనున్నది. ఈ సందర్భమున నీకవులు కావ్యారంభమున నిట్లు చెప్పుకొన్నారు

క. నేరుపరి పోహణించిన
హారమువెల యెక్కుడీల నతిశయముగ నా
పేరఁ దెనిఁగింప వలయును
సారప్రవణిమబుఁ బ్రబోధచంద్రోదయమున్ (1-26)

1. విజయనగర సామ్రాజ్యాంధ్రవాఙ్మయ చరిత్రప్రథమ భాగము పుట 268-270

ఆని స్వామివారు పలికినమాటలు అనగా పాకము కూర్పుచేత, నెంత రసము యమునగాను డీ, మనోహరమగునో నీకావ్యము తమకూర్పు నేర్పుచేత ఖరియముగను, మనోరమముగను దిద్దితీర్చి యున్నారు.

ప్రబోధచంద్రోదయము సానల దీఱిన జాతిరత్నము. ఈ కావ్యము సభలో పండితకవులు దీనిని పరిశీలించిరనియు, వారి పరిశీలన మూలముననిది మెఱుగెక్కినదనియు, నీ కవులే యిట్లు తెలిపినారు,

క, పొరి పొరి నొప్పు సలాకల
నొరసిన కుందనపుఁ బూదెయును బోలె సభన్
సరసుల సంఘర్షణమున
వరకవి కావ్యంబు మిగుల వన్నియ కెక్కున్. (1-22)

గంగమంత్రి సభలో కవి పండితులీ కావ్యమును నామూలచూడముగా పరీక్షించిరనియు, వారి పరీక్షలో నిది నిలిచి, వారి ఆమోదముద్ర బడసినదని పైపద్యతాత్పర్యము.

తక్కిన కవు లెవ్వరును నిట్లు సభలో పండితకవులను ప్రత్యేకముగా పేర్కొనలేదు. రాజాస్థానములలో పండితకవులు మాత్సర్యగ్రస్తులు. వారెప్పుడును తప్పులు వెదకుటకే ప్రయత్నించి, కావ్యమును ప్రభువంకితము గొనకుండ చూచెదరు ఇదివీరి సౌమనస్యము తెలుపుచున్నది. అట్టి పరిస్థితులలో, నీకవుల కృతి ప్రబోధచంద్రోదయము, కవిపండితుల పరీక్షను నిలిచినకృతి యగుట చేతనే, నేటికిని నీకృతి పండిత కవివిద్వన్మాన్యమై యలరారుచున్నది.

పూర్వకవుల యనుసరణలు

నన్నెచోడకవి కుమారసంభవము

క. కరిఁగరి ఘటుఘటుఁ డరదం
బరదంబు హయంబు హయము నని మొత్తములై
గిరి గిరి జము జము డిలనిల
శరనిధి శరనిధియుఁ దాఁకుచాడ్పున దాఁగెన్ (కు.సం. 11-108)

క. కరిఁ గరి హరి హరి నరదం
బరదము భటు భటుఁడుఁ దాఁకిర య్యిరుమొనలున్
సరి బోరిరి శశముద్గర
కరవాలప్రముఖ శస్త్రఘట్టన మమరన్. (ప్రబో. 4-67)

ముద్రాలంకారము

వృత్తము పేరు కథాసందర్భానుసారముగా నావృత్తమునందే నిముడ్చుట.

దీనిని తెలుగున ప్రవేశపెట్టినవాడు నన్నెచోడకవి. మత్తేభములు క్రీడించు సందర్భమున మత్తేభ విక్రీడితము. క్రౌంచములను వర్ణించునపుడు క్రౌంచపదము, స్వాగతమిచ్చునపుడు స్వాగతము, కుమారుడు పుట్టినపుడుత్సాహ కావ్యాంతమున మంగళమహాశ్రీ వృత్తములను నౌచిత్యముతో చోడుడు వాడినాడు.

ఈ కావ్యమున నన్నెచోడని ముద్రాలంకారానుసరణము గలదు.

భుజంగప్రయాతము:

నయప్రాపితో త్తేజన ప్రౌఢశౌర్యో
దయోద్భూత విద్వేషిధాత్రీ భుజంగ
ప్రయాతావధిక్ష్మాధర స్థాపితోద్య
జయస్తంభ సంభారి జంభారి భోగా (4-72)

శ్రీనాథుడు కాశీఖండము

శా. కింకుర్వాణపురం దరాదికమహాగీర్వాణ కోటీకిరీ
టాంక స్థాపిత నూత్నరత్నరుచి ధారాశ్లేషకిమ్మీరహృ
త్పంకేజుండు హరుండు జంతువులకున్ ప్రాణాంతకాలంబునం
దోంకారాక్షరమంత్రరాజము జెపన్ యోజించు గాశీస్థలిన్ (7-18)

క. పరమజ్ఞానం బెఱుఁగని
నరులకు నీవారణాసి నగరిని పిశ్శే

శ్వాసు( దంశ్ర్ట కాలమున సు
స్థిరకరుణం దారకోపదేశము చేయున్ (ప్ర చ. 2-25)

పోతన భాగవతము-

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందుడిందుబరమేశ్వరు (డెవ్వ(డు మూలకారణం
బెవ్వ( డనాది మధ్యలయు( డెవ్వ(డు సర్వము దానయైనవా(
డెవ్వ(డు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వే(డెదన్

ఉ. ఎవ్వని యందు విశ్వ ముదయించు నడంగు దలంప నీజగం
బెవ్వనిదీప్తి గాన(బడు నెవ్వనితేజము చిత్సుఖాత్మకం
బెవ్వని( టుణ్యులెల్ల గుణియింపుచు ద్వైతతమంబు బాసితా
రెవ్వలనన్ భవంబునకు నేగరు వానినుతింతు నక్రియన్ 5-32

కావ్యపౌరాణికసూచనలు-

రామాయణము-

సీ.పా. తపనసూనుడు తార( దానాక్రమింప(డె
అన్న ప్రాణములకు నళ్ళు(దలచి. (1-50)

సీ.పా. సాక్షాన్మహాలక్ష్మి జానకభూపాలనం
దన( జెఱపట్ట(డే దశముఖుండు. (3-11)

లోభ రావణునికి దాశరథి నయ్యేద - (4-25)

మత్స్యపురాణము-

సీ.పా. వేదత్రయీకాంత వెసముచ్చిలింప(డే
చూఱపట్టినయట్లు సోమకుండు. (3-11)

వరాహపురాణము

సీ.పా. చాపచుట్టఁ జుట్టిచంకఁ బెట్టుకపోఁడె
ధరణి హిరణ్యాక్షదానవుండు. (3-11)

మార్కండేయపురాణము

సీ.పా. కొసరకయమ్మదాలసఁ గొనిపోఁడె పా
తాళకేతుఁడను నక్తంచరుండు. (3-11)

దేవీభాగవతము-

ఉ. చండికాదేవి లులాయ దానవువధించినలీల (4-25)

భారతము

క. గాండీవి జయద్రథుఁ జంపిన
కైవడి పరబలము ద్రుంచికాము జయింతున్. (4-19)

వ్యాకరణము

వ్యావహారికపద ప్రయోగములు

ప్రబోధ చంద్రోదయము నాటకమున కను వాదముగావునను, నాటకములు సంభాషణ ప్రధానములు గావునను. సంభాషణలో వ్యావహారిక పద ప్రయోగము తప్పని సరియగుటచేత నీకవులు కావ్యము నంతయు సలక్షణభాషలో రచించినను వ్యావహారిక పదములను ప్రయోగించి ఈకావ్యమునకు నాటకీయముగా నొక ప్రత్యేక విశిష్టత సంపాదించినారు. ఈ విషయమును గూర్చిన వివరణము.

సంధి

క్త్వార్థక ఇకారము

అణగుండె అణగి × ఉండె (1-44)

ఎటిగెటింగియొక ఎటింగి + ఎటింగి (4-7)

## తత్సమాకారసంధి

వచ్చెనోయిది నాప్రాణవల్లభనుచు. ప్రాణవల్లభ + అనుచు
ఆత్మను అత + అను 2-19
మిధ్య + ఔట—మిథ్యౌట (5-28)

## స్త్రీవాచకసంధి

అడ వెల్లగాల్పి అడవి ఎల్లగాల్చి (1-92)
రోతని రోత × అని- (8-58)

## టుగాగమలోపసంధి

ద్వైతాద్వైతపదవి—ద్వైతాద్వైతపుటడవి

## రాగమసంధి

జోగురాలి గూడితంటరాకుమన్న (8-49)

ఇచట జోగురాలులో "రా" వ్యంజనమునకు యతి బాల వ్యాకరణము ననుసరించి కర్మధారయమున ఆలుశబ్దమునకు స్వరమునకే అచ్చునకేయతి

పేవాది శబ్దముల కాలుశబ్దము పరంబగునపుడు కర్మ ధారయంబునందు రుగాగమంబగు (సంధి-30)

కర్మ ధారయంబున దత్తమంబులకాలు శబ్దము పరంబగు నపుడు దత్ర మంబున కుత్వంబును రుగాగ మంబునగు (సంధి.31సూ)

## ద్రుతద్విత్వసంధి

ఒడిసివడిన్నెగయు గృధ్రియుంబలెనున్నన్ (2-7)
వడినే + ఎగయు వడినెగయు

ఇది ద్రుతద్విత్వసంధిగా కనుపట్టినను వాస్తవముగా నిదిద్రుత ద్విత్వ సంధిగాదు ఇచట

పడిన్ + ఎగయు-అనుసంధిలో ఎగయు శబ్దము, అజాదిగాకాక హలాది గానూ వనున్నది.

ఏసికి "నేని" అను రూపమున్నట్లు
'ఎగయు' కు "నెగయు" అనురూపమున్నది.
నీటిలోననుండి నెగయుచెంచె (భార-ఆది-3-197)

క్రియలు

చేతు ప్రాయశ్చిత్తము చేతు (1-58)

1. చువర్ణంబు తోడ దుగ్గకారంబు తకారంబగు నిలుతురు, పిలుతురు, ఆడ ధురు,..వచింతురు. ఛేతురు కోథురిత్యాదు లసాధువులని యెఱుఁగునది. (క్రియా 106సూ)

"ఏమిసేతు మందవేశ" అని మారనమార్కండేయ పురాణము 1-22లో నింతకన్న పూర్వప్రయోగముగలదు,

2. పట్టుక—2-32
చుటుక—3-11
కొనిధాతువు పరంబగునపుడి గాగమంబు బహుళంబుగానగు క్రియా.58

గుప్తార్థ ప్రకాశికలో చేసికొని చదువుకొని ఇత్యాదిక్త్వాంతంబులకు బదులుగాచేసుక, చదువుక ఇత్యాది క్త్వాప్రత్యయాంత సంగ్రహ రూపములనంతా మాత్యాతిమ్మకవ్యప్పక వ్యాది లాక్షణికులచే తమగ్రంథముల యందు వాడ బడినది. కాని రూపంబు సూత్రంబున నిరూపింపబడలేదు. అనివ్యాఖ్యలో వ్రాసినారు.

ఇట్టివి కవిత్రయము వారిలో లేవుగాని శ్రీనాథుని కాలమునుండి క్రీ.శ. 1420-30 ప్రాతములనుండి కవిప్రయోగములు కానబడుచున్నవి.

మ్రింగేవాడు-గుడి మ్రింగేవానికిన్ దల్పులప్పడముల్ 2-67
గుడి మ్రింగెడు వానికి అని యుండవలెను.
"తృవర్ణ కార్థంబునం దెడియెడు వన్నియలగు (క్రియా-44)

ప్రహరించెడివాఁడు ప్రహరించెడువాఁడు
పొగడేవు- 2-20

"పొగడితావు" అనునది సరియగురూపము పైసూత్రమే దీనికివర్తించును. ఇట్టివి క్రీ.శ. 1500లకు ముందులేవు.

త్రుళ్లడము
కేళ్లంగిప్రేసినట్లు
త్రుళ్లడమున (5-9)

త్రుళ్లుధాతువునకు భావార్థమున త్రుళ్లుట అనియేగాని త్రుళ్లదము అను అదమాంత రూపమురాదు. ప్రతిక్రియ మదాంతత్వం ప్రతీతంతున గీయతే అథ ర్త్యణ కారికావః (అజ.సూ.98)

చిన్నయసూరి కృదంత పరిచ్ఛేదమున టవర్ణకం భావ్యాదులకగు నను దూనంత లోపంబగు (సూ7) తేయుఅని టకారమే సూత్రించి ఆడు, ఊరు, ఏఁకరు ఓడు, మొదలగు ధాతువుల నిచ్చినాడు దీనిని బట్టి ఆతడును ఆడదము ఊరదము ఓడదము తేరదము మున్నగు రూపములు నిషేధింప బడినవి.

శ్రీనాథ మహాకవి కాశీఖండము అదమాంత రూపము ప్రయోగించినాడు.

గీ......అగ్ని
మొదట కాశీపురమునకు ముట్టడముగ
సకల గృహముల దనమూర్తి సంగ్రహించె కాశీ 5-801

శ్రీనాథుని ప్రయోగము ననుసరించి ఈకవులును పైరూపమును వాడియుండిరి.

ఇంకా నొకకొన్ని 2-60
ఇంకయు నొకకొన్ని అనునది గ్రాంథికరూపము.

ఇట్టిరూపముప్రయోగించుటలో తొలికవుల ప్రయోగ మందలిదే. దీని తరువాత ఆధునిక కృతియగు (18వ శతాబ్ది) పట్టాభి రామాయణమున ఇంకాగల కొన్నేవేమి" అని ప్రయోగము గలదు.

(బాలకవి శరణ్యము-94పుట)
దినాలు-(2-7)
వేదాలు-(2-7)
దండాలు-(2-48)

ఇవి వ్యావహారిక రూపములేయైనను వీనికి గ్రాంథిక భాషా సూత్రమున్నది.

"లులనలు పరంబులగు నపు డొకానొకచో ముగాగమునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు

వజ్రాలు, వజ్రాలను వజ్రాన, పగడాలు, పగడాలను, పగడాన ఒకానొక చోట ననుటచే నీకార్యంబునకు ప్రయోగ వైరళ్యము సూచింపబడియె."
(తత్సమ 48సూ)

నన్నయలో నిట్టివి లేవుగాని, శివకవుల కృతులయందును తిక్కన, ఎఱ్ఱన శ్రీనాథాదులం దిట్టివి గలవు. కాని అవి చాలా విరళము. అందునకే ప్రయోగవైర ళ్యము చెప్పబడినది.

వ్యావహారిక భాషా ప్రవర్తకులైన కీ.శే. గిడుగు రామమూర్తి పంతులుగారు పై ప్రబోధచంద్రోదయ ప్రయోగములను బాలకవిశరణ్యమున నుదాహరించి నారు. కీ.శే. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలుగారు, తమ ఆంధ్రభాషాను శాస నమున 'ప్రయోగ విశేషములు' అను శీర్షికలో పైప్రయోగములను సంగ్రహించి యున్నారు.

తత్సమపద ప్రయోగములు

1. అంబులు (5-15) అంబువులు—ఉత్వలోపము

2. ప్రౌఢిమ-చతురామ్నాయ ప్రౌఢిమ (1-10)

ప్రౌఢిశబ్దమునకు "ఇమనిచ్" ప్రత్యయము రాదని వామనోక్తి (సర్వంకష వ్యాఖ్య372పుట) కాని శ్రీనాథకవి ననుసరించి యీకవులు 'ప్రౌఢిమ' అనివాడినారు
3. బృసి-బృసీన్నివిష్టులై (2-8)

బృస యనగా ఋషుల యాసనము. ఇది ఈకారాంత స్త్రీలింగ శబ్దముగాన 'బృసీ' అను రూపము వచ్చినది. పైప్రయోగము బృసీశబ్దము ఈకారాంతమని నిర్ధారణ చేయుచున్నది.

4. వారణసి- దీనికి సరియగు రూపము వారణాసి
"ఈ వారణసిని"యని (2-5)లో గలదు.

5. సుహృత్తు (5-58)
సుహృత్ శబ్దము తకారాంతము
'హలంతంబు ప్రథమైక వచనాంత తుల్యం బిందు నామంబగు'
"ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లునకగు" (తత్సమ.67,68)
పై సూత్రములచేత సుహృత్ శబ్దమునకు సుహృత్తు అను రూపమువచ్చినది

ఛందస్సు

గద్యపద్య సంఖ్య

| | |
|---|---|
| 1-ఆ. | 87 |
| 2-ఆ. | 81 |
| 3-ఆ. | 86 |
| 4-ఆ. | 72 |
| 5-ఆ. | 117 |
| | 443 |

యతివిశేషములు

ఉపసర్గయతి

"స, మర్థులీ కృతిరాజ నిర్మాణమునకు" (1-25) సమ్ అర్థ—సమర్థ ఇచట సమర్థ శబ్దమునకు వ్యంజనయతి

"ని, ర్జయమతి గ్లేశపంచక పరాఙ్ముఖు(డయ్యె"(5-46) ఇచట పరాక్ శబ్దమునకు వ్యంజనయతి. నన్నయ దీనికి వ్యంజనయతి పాటించినాడు. "రక్కసు

లెల్ల నాహవ పరాఙ్ముఖులైరి" (ఆర 4-12), తిక్కనలోను వ్యంజనయతి.
సీ.పా. దానశీలురు పరధన పరదార ప

రాఙ్ముఖచిత్తులు బ్రాహ్మణప్రియులు శాంతి (5-11)

ఎఱ్ఱన మాత్రము స్వరయతి పాటించినాడు.

సీ పా. ప, రాఙ్ముఖు లార్యభావానుగతులు హరి.పూ (8-54)

రాగమ సంధియతి

జోగు,రాలి గూడితంట రాకుమన్న (3-49)

ఇట రాలు (రు అ) శబ్దములో వ్యంజనయతి. అప్పకవి రాగమసంధివళు లనుపేర 'రాలుధర్మాత్మురాలన రాక్షసారి' (3-215) అని దీనికి లక్షణము చేసి నాడు. కాని చిన్నయసూరి ననుసరించి రాలు శబ్దము (రు అ) అని పదచ్ఛేద మగుటచే దానికి స్వరయతియేగాని వ్యంజనయతిలేదు. "ఏ కాంతమునందు నున్న జవరాం[డ్ర]" అని అతడే యుదాహరణ నిచ్చినాడు చూ. (సూత్రము 30 సంధి పరిచ్ఛేదము) దీనిని గూర్చి నేను పూర్తిగా చర్చించి రాలు శబ్దములలో స్వర, వ్యంజన యతులు రెండును నుండ వచ్చునని నిర్ణయించినాను.[1]

సోదర శబ్దము
స్వరయతి

సోదర వధా వ్యసన సంభవోరువహ్ని (4-52)

ఇచట స ఉదర అని పదచ్ఛేదము. సహోదర శబ్దమున సః ఉదర అని పదచ్ఛేదము

---

1. ఈ రాలు శబ్దమునుగూర్చి చూడుడు Annals of Oriental Research Madras University పత్రిక యందు సం. 18(1963) లో నావ్యాసము "రాలు ప్రత్యయచరిత్ర"

## సుకవి మనోరంజనము[1]

1) అఖండవడి-

శ్రీనిత్యంబుగనుండఁ గావుత...........................................

........................................................................ భో

ధాసంద్రైకమయుండు శంకరుఁ డనంతస్వామి గంగయ్యకున్

(పుట100) (1-1)

2) అభేదవడి-దడలకు

"నావుడుఁ దద్ద్విజుం డహహ నాదగు శీలము వర్తనంబునున్
భావనముం గులంబునను బాగగువిత్తలు గౌడదేశరా
ధావరపట్టణంబునఁ గడాని మదీయగృహంబు తండ్రి ధా
త్రీవినుతుండు తత్సుతులు శ్రేష్ఠులు నేనధికుండ వారిలోన్. (2-12)

రాధావర పట్టణంబునఁ గడాని- ముద్రిత పాఠము (పుట 153)

3) ప్లుతయతి అచ్చునకు

సీ. ఏజెంత బోధించెనే తల్లి
ఏ బోడ్డి బోధించెనే యింత
ఏ రండ యెడ బాపెనే తల్లి
ఏ లంజె భ్రమియించెనేతల్లి (3-3) (పుట 265)

---

1. ఈ లక్షణగ్రంథము నూరేండ్ల క్రిందట కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని మైదవ తరమువాడైన కూచిమంచి వెంకటరాయకవిచే రచితము. ఇందు ప్రబోధచంద్రోదయమునుండి నాలుగు పద్యము లుదాహరింపబడినవి.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి వారిచే నూతనముగా ప్రకటితము (1976) పరిష్కరణ-కోవెల సంపత్కుమారాచార్య.

4) ప్రభునామయతి

సీ.పా. సింగమంత్రికి పుణ్యశీలయౌ పోచమ్మ
కాత్మసంభవుఁడు మల్లయ మనీషి (1-24) (పుట 357)

ప్రాసలు

ఖండాఖండప్రాస క. గాటపు సంసారాంబుధి, దాఁట (5-62) గీతము (5-57)లో ప్రాస పాటింపబడినది.
స్వమరు, సమయ- భ్రమర- సమర

వృత్తములు

1. హరిణీవృత్తము (1-71)

2. పృథ్వీవృత్తము (3-86)

నన్నయలో పృథ్వీవృత్తమునకు 9 వయక్షరముయతి. అదే యీ కవులును పాటించిరి.

"ప్రధాన కులభూషణా ప్రథితజగన్నిమేషణా" పెద్దనాదులు 14 వ యక్షరముపై యతి పాటించిరి.

3. దండకము మూలమున నిది దండకమే

"జయజయ వినయానతేంద్రాది బృందాకరకశ్రేణి చూడామణీ రాజితో పాంత పాదద్వయాంభోజ" (4-46.)

"విద్వాంసులెల్లన్ హకారంబెకానీ, నకారంబెగానీ, సకారంబెకాని వచింపదగున్" అని అప్పకవీయమున దండకలక్షణము (4-253)

పైదండకము సకారముతో ప్రారంభమగుచున్నది. అప్పకవి ననుసరించి నమస్తే నమస్తే నమః. అని దండకము చివర నుండవలెను. కాని యిందట్లు

లేదు. "భక్తిన్ వునర్నమ్రుఁడై" అని మాత్రమే గలదు. ఇది 5 మాత్రలుగల ఖండగతిని నడచును.

వినయాన – 5 లఘువులు లేక మాత్రలు
తేంద్రాది – ,, ,,
బృందార – ,, ,,

ఇట్టే దండకమున ప్రయుక్తమైనవి కావున నిది ఖండగతి నడచు దండకము.

దండకములకు రగడవలె గతి భేదములున్నవి. నన్నయ భారతమున తొలి దండకమున "శ్రీ కంఠ–లోకేశ –లోకోద్భ–వస్థాన–సంహార–కారీము" అని త కారముతో ప్రారంభము. ఇదియు ఖండగతినే నడచును.

శ్రీకంఠ 5 లఘువులు లేక మాత్రలు

పైరీతిగా దండకములను తాళప్రధానములుగా పరిశీలింపవలసిన ఆవశ్యకత యున్నది.

4. ఉత్సాహవృత్త మిందు ఆశ్వాసాంతమున నున్నది. ఆశ్వాసాంత పద్యములలో ఉత్సాహవృత్తమువాడరు. ఈ కవులు మాత్రము వాడినారు.

5. భుజంగప్రయాతము (4–72.) భుజంగ ప్రయాత మిందు ఆశ్వాసాంతమున నున్నది. ఇదియు నాశ్వాసాంతముల వాడుకలేదు. పైదాని వలెనే క్రొత్త వాడుక.

6. మణిగణనికరము ఈవృత్తము నన్నెచోడాది ప్రాచీనకవులు వాడిరి.

ఇది 15వది యగు అతిశక్వరీ ఛందస్సున బుట్టినది.

"అనవుడు మనసును నతిముదమున న
వ్వనరుహభవుని వనజవదనా
తనయుని పలుకు లితరమరయఁగ నా
మనసునఁ గలిగిన మమతయుఁ దొలఁగెన్" (5–40)

ఇందునాలుగు నగణములు చివర సగణ మున్నది.

న న న న స
అనవు | దుమన | సునున | తిముద | మునన | వ్వ

అప్పకవీయమున నిట్లే కలదు.

మణిగణనికరము మను లఘు గురువై (4-305)
మణివిరమణమయి మనుదనుజహరున్.

మణివిరణమనగా 9వ యక్షరముపై యతి.
మణు లనగా రత్నములు. రత్నములు తొమ్మిది.

7. విద్యున్మాల (5-78)

అమ్మయిన్నాళ్లత్యంతాయా
సమ్మం జెందం సచ్ఛన్నాకా
రమ్మం జొప్పారంగా నెచ్చో
నెమ్మె నెమ్మొందున్ నీవుంటన్.

ఈ వృత్తము 8 వడియగు అనుష్టుప్ ఛందస్సులోనిది. అప్పకవీయ లక్షణమునకు సరిగానున్నది.

మ మ గగ
అమ్మాయిన్నాళ్లంత్యంతాయా
ఈ వృత్తము సాధారణముగా కవులు వాడుక చేయలేదు.

8. చిత్రకవిత-గర్భకవిత

ఇందొక్కచో గర్భ కవిత కలదు.
కందగర్భిత మణిగణనికరము

కలికి యొకతె యలకము లలి బలమున్
బలె నలికతలముపయిఁ గడలుకొనన్
గలకల నగియెడు కనుగవతళుకుల్
తళతళ మెఱయఁగఁ దను బలుకుటయున్. (5-56)

ఇందలి గర్భిత కందము

క. కలికి యొకతె యలకము లలి
బలమున్ బలె నలికతలముపయిఁ గడలుకొనన్
కలకల నగియెడు కనుఁగవ
తళుకుల్ తళతళ మెఱయఁగఁ దనుబలుకుటయున్.

దీని వలన నీకవులు చిత్ర కవితయందు సామర్థ్యము గలవారని తెలియుచున్నది.

అశ్రుత వ్యాఖ్యాన మాశుకవిత్వంబుం అని 54 పద్యమున ఆశుకవిత్వ ప్రశంస గలదు. ఇందువలన కావ్యమధ్యమున ఆశుకవితా ప్రసక్తి తెచ్చుటచేత వీరు ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వములో మధురకవిత (యక్షగానాదులు) తప్ప తక్కిన వానియందు నేర్పరులని గ్రహింపవచ్చును.

మంగళమహాశ్రీవృత ము

ఈ కావ్యాంతమున (5-117) మంగళ మహాశ్రీ వృత్తమున్నది. కావ్యము శ్రీతో ప్రారంభించి మంగళమహాశ్రీ వృత్తముతో సమాప్తముచేయు సంప్రదాయము పూర్వ ముండెడిది.[1] నన్నెచోడమహాకవి తన కుమారసంభవమున నీ సంప్రదాయము ప్రారంభించినాడు ఆవెనుక శ్రీనాథయుగము తరువాతను నీ సంప్రదాయ ముండెడిది.

---

1 దీనిని గూర్చి-చూడుడు నాఉదాహరణ వాఙ్మయచరిత్ర పుట 47.

నన్నెచోడని వెనుక

1) జక్కన విక్రమార్క చరిత్ర

2) మడికి సింగన పద్మపురాణము, జ్ఞానవాసిష్ఠము

3) నందిమల్లయ ఘంటసింగయకవుల

ప్రబోధ చంద్రోదయము

విని యందుకలదు

ప్రబంధ యుగమున నీసంప్రదాయము ముగ్గురుకవులు పాటించిరి.

1) ముక్కు తిమ్మన పారిజాతాపహరణము

2) వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము

3) కాణాదము పెద్దన సోమయాజి అధ్యాత్మ రామాయణము

జాతీయములు

"ఉముకకు (ఊంక) ధాన్యమి విడుచు"

"కడుపు చుమ్మలుచుట్టు" "కాలిలోములుగాడకుండ"

"క్రూకటి వ్రేళ్లుండగా మూసిడి కొనలు విఱుచుట"

"నల్లమేంకతప్పు" మొదలగు జాతీయము లిందుగలవు. వానిలో నల్లమేక తప్పు అనుదాని వివరణ ఆవశ్యకము.

నల్లమేంకతప్పు (1-50) "సీ.పా. బలభేదిగౌతము భార్యనహల్య గామించి చేయడె నల్లమేంకతప్పు"

ఇంద్రు డహల్యను కామించి గౌతము డెప్పుడును నింటివద్దనే యుండుటచే తెల్లవారు జామున యుండడని గ్రహించి కోడియైకూసి ఆతడు ప్రాత స్నానమునకు వెడలగానే అహల్యతో భోగించెను. గౌతముడు తిరిగి వచ్చుచుండగా ఇంద్రు డాతని కంటబడెను జరిగినది తెలిసికొని గౌతము డింద్రుని ముష్కములు తెగి పోవునట్లు శపించెను. అవి తెగి పోయినవి. అంత దేవత లది చూచి నల్లమేక ముష్కములు నతికించిరి.

సామెతలు

గుడి మ్రింగేవానికి తలుపు లప్పడములు (2-65)
రెంటికిం జెడిన రేవడు (3-24)
వెనకయ్య చేతికి వెసల యిచ్చిన విధమున (4-29)

పైవానిలో వెనకయ్య చేతికి వెసలు యిచ్చిన విధమున అనుదాని యర్థము సరిగా నింతవఱకు వివరింప బడలేదు సూ.నిలో వెసలు క్రింద యిది చూపబడి "తాను చెడి యితరునిగూడ చెఱచుట అను నర్థమీయబడియున్నది. (సం. 7 పుట 351)

ఈ సామెతను నాచన సోము డుత్తర హరివంశమున ప్రయోగించినాడు (3-59) సూని దీనిని యుదాహరించినది. దీనియర్థమిది "ఇచట వెనకయ్య అనగా మన విఘ్నేశ్వరుడుగాడు. వినాయక శబ్దభవము వెనకయ్య ఈవినాయక శబ్దము గణపతినేగాక, బుద్ధుని బోధించును" బుద్ధోవినాయకః॥ అని అమరము.

బౌద్ధ భిక్షుకులు వారికి వెసలు వంటపాత్రలతో ప్రమేయములేదు. కోమటి బౌద్ధునికి వంటపాత్రలిచ్చి తాను చెడుటయేగాక ఇతర కోమట్లను చెఱుచును. అందు వలననే సూని యందిచ్చిన యర్థము సరియైనది. ఇది బౌద్ధమత సంబంధమైన సామెత యని గ్రహింప వలెను. (చూ. హంసడిభకోపాఖ్యానము నా వ్యాఖ్య పుట 103)

సంస్కృత సూక్తులు

ఇందు పైసూక్తులు రెండు మాత్రమే గలవు
"స్త్రీముఖం సదాశుచిః" 2-55

స్త్రీ ముఖం సదాశుచి యన్న సూక్తికి తెలుగున నీక్రింది పద్యమువాడుకలో నున్నది.

క. జిగిగల పడతుల మోవికి
యగణితముగ నీళ్ళబావి కమృతంబునకున్
తగ నుచ్ఛిష్టము లేదని
ఖగవాహనుతోడ గరళకంఠుడు పలికెన్.

అహింసాపరమోధర్మ 3-40

ఉష్ణముష్ణేన శామ్యతి 5-12

విశిష్టపదములు - అర్థములు

అనుభోగించు. సం స క్రి అనుభవించు

"తనువునకు నాత్మ వేఱట

యను భోగించు నట పిదప

నాముష్మికమున్ (2-31)

ఈ పదమున కిది యొక్కటే ప్రయోగము (సూ.ని)

అనూనయించు. సం.స.క్రి (ఇందలి యడాగనుము విచార్యము) అనూనినుగాఁ జేయు, గౌరవించు, పూజించు

"ఉపనిషద్దేవిని ననూనయించి తోకొంచు రందని పలికి (1-84) ఈపదమునకు మొదటి ప్రయోగమిది సూ.ని.లో, రంగారాయ చరిత్ర, అని యనూనయించుచు, (1-15-16) అనియు "ధాత ననూనయించి" సేతు ఖండము (1-41)

అను రెండు ప్రయోగములు గలవు. కాని ఈ రెండుప్రయోగములు అర్వాచీనములు

అవధాని సం.విణ న్.సీ న్ అవధానము కలవాఁడు (సూని. సం.1 325 పుట) దీనికి ప్రయోగము చూపబడలేదు. అర్థము సరిగాలేదు. అవధాని శబ్ద మునకు రెండర్థములు. ఒకటి వేదములు చదువు వాడు

"అర్థంబు తెలియక యఱచెద రవధాను లూరక వేదాలు నోరికొలది. (2-7) అవి యిందు ప్రయోగము.

రెండు అష్టావధాని:-అష్టావధానము చేయువాడు.

శతావధాని:- సాహిత్యమున శతావధానము చేయువాడు అనియు వాడుకలో నున్నవి.

---

సూ.ని. సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదటి సంపుటము.

అహం బ్రహ్మీభవించు: సం. అ. క్రి. అహం బ్రహ్మ అనుకొనువాడగు. నేనే బ్రహ్మ మని యనుకొను "అహం బ్రహ్మీభవించి తల్లికిందగిన బిడ్డ కలిగెనన మెలంగుచుండు (1-76) చల్లాసూరయ కవి దీనిని తన వివేకవిజయమున ప్రయోగించెను. (పుట 69) (సూ.ని)

ఆగ్రహముచేయు సం.స.క్రి - కోపముచేయు సూ.నిలో ఆగ్రహము సం.వి.అ.పు 7వ యర్థము కోపము ఈ యర్థము తెనుగు గ్రంథములయందును వాడుకలోను గాన్పించుచున్నది.

"ఆగ్రహ మాత్మలోఁ బొడము నట్లుగ వి.పు. 1-19 (పుట390. ఇచ్చట ఆగ్రహము విశేషముగా నున్నది. గాని క్రియగా లేదు) ఆగ్రహముచేయు

"చెఱచెదనంచు నాగ్రహము చేయుగాని" (5-61)
అని యందు ప్రయోగముకలదు. ఇది నిఘంటువుల కెక్కలేదు

ఆశుకవిత్వము సూ.ని.లో "ఆశుకవి" పదమున్నదిగాని ఆశుకవిత్వములేదు. శబ్దరత్నాకరాను బంధమున (పుట 11) నేను చేర్చితిని. అశ్రుత వ్యాఖ్యాన మాశుకవిత్వంబు 5-56

ఆలు ప్రత్యయ ప్రయోగములు — వృధారంజకురాలు- (1-79)
కులస్థురాలు- అభాసురాలు- 8-95 — సేవకురాలు- 2-54
జోగురాలు 8-49 — విహ్వాలురాలు 8-74
భావకురాలు- 5-57

పైవానిలో 'జోగురాలు' అను పదమునకు మాత్రమే నిఘంటువులలో ప్రయోగముగలదు. తక్కిన వానికిలేవు. జోగురాలి శబ్దమును మొదట ప్రయోగించిన దీకవులే.

ఇవతాళించు ఇవతాళింపంగ బొద్దుఁడిట్లని పలికెన్ (8-46) ఇవతాళించు అనగా చల్లనగు శీతమగు అని యర్థము.

దీనిని శ్రీనాథు డింతకు మున్ను ప్రయోగించినాడు, ఇవతాళించు విదర్భ రాజతనయా హృద్యస్తన ద్వంద్వమున్ (నైష 3-84)

ఇవతాళించు పదమునకు పైరెండు ప్రయోగములుగాక విక్ర. (4-158)లో ప్రయోగముకలదు.

ఉత్సార్యంజేసి (5-36) ఉత్సార్యము అనగా తొలగింపబడునట్లు చేయుట అని యర్థము. దీనికి నిఘంటువులలో ప్రయోగములేదు.

ఎడమపెని వెట్టు (1-81)పాడుచేయు వ్యతిరేకముచేయు పెనిమిటి ధర్మమున కెడమపుని వుట్టుదునే

ఇది నేతకు సంబంధమైనది. నేతిగాండ్రు సాధారణ త్రాళ్ల కుడివైపునకు పెనవెట్టిన పేటలతో నేయుదురు. అందొకపేట ఎడమపెన వెట్టిన దైనదో అది తక్కిన వానితో గలియదు. నేత సరిగా జరుగదు. ఈ క్రియకు నీగ్రంథ ప్రయోగమొకటియే కలదు. (సూ,ని)

గాణు—గాడు హాని ఈపదమునకు నిర్ధారకముగా నొక్కటే ప్రయోగమిందున్నది. క. రాణించి - ప్రాణేశ్వర - జాణ - గాణు (ప్రాస)

(వావిళ్లనిఘంటువు)

గ్లౌ-చంద్రుడు "గ్లౌ వంశ యనంత మంత్రి కమలజగంగా". ఇది 'గ్లౌ" అను శబ్దస్వరూపము నీర్ధారించును గ్లౌ-క-

ఇది శ్రీనాథుని నుండి గ్రహించినదే

"కంఠేకాల కిరీట విటంక గ్లౌరుచి చుళుకితజల మణికర్ణిక" కాశీ.(6-125) చిన్నయసూరిననుసరించి "గ్లౌ" శబ్దమును "గ్లౌ" అను రూపాంతరము గలుగును.

రైగ్లో శబ్దంబుల కోత్వంబు విధాషనగు తత్సమ. 64 సూ

కాని "గ్లా" శబ్దమునకేగాని గ్లో శబ్దమునకు నిర్ధారక ప్రయోగములులేవు.

జముకాణ (శ)ము. జంబుకాణము జంబుఖానము

జమ్మఖానము. వి. (హిం జమ్ఖానా.) కూర్చుండుటకు ముతకనూలితో నేసి క్రింద పఱచెడి ఆస్తరణ విశేషము- (సూ. ని 3 సం. 393 పుట) సూ. ని. లో మనుచరిత్ర, చంద్రభానుచరిత్ర, ప్రబంధరాజమునుండి ప్రయోగము తీయబడియున్నవి గాని ప్రబోధచంద్రోదయ నందలి ప్రయోగమును మాత్రము హావిళ్లనిఘంటు విచ్చినది. జంబుకాణమునకు, ప్రయోగములు నవీనములే. ఇది అన్యదేశ్యము. ఈ యన్యదేశ్యము తొలుత నుపయోగించివ కవులు, ఈ కృతికర్తలే.

క. .........తచ్చాసన

మున చేరువ జమ్మఖానమునఁగూర్చుండఁన్, ఇది జమ్మఖాణము - అను రూపమునకు నిర్ధారకము.

జంత. వి. (కజంతె) గయ్యాళి. సూ. ని. లో నీపదముకు సుదక్షిణాపరిణయము ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము నుండి ప్రయోగము తీయబడినవి. (3 సం 850 పుట).

కాని యిందలిప్రయోగమే మొదటిది. "ఏజంత బోధించినే" 3-3.

తలనొప్పి వి గ. శిరోవేదన తలనొచ్చుట:ఆ తలనొప్పి సూని (3సం 726పుట ఇందు. 17వ శతాబ్దినాటి శుకసప్తతినుండి మాత్రమే ఈపదమునకు ప్రయోగమీయబడినది. కాని తొలిప్రయోగ మీపదమునకు నిందేకలదు "తలనొప్పేమియుజెందకేహృదయ సంతాపంబునుంజెందకే" (4-23)

తామ్రంపుగిండి రాగిపాత్ర తామ్రంపుగిండి నంబువులిడ (2-14)

ఇది నిఘంటువుల కెక్కలేదు.

నిబద్ధి సత్యము "ఇది నిబద్ధి తప్పదు మీపాదమాన" (2-53)

ఈపదమునకు నిదియే మొదటి ప్రయోగము సూ.ని. (4సం. 351పుట) లో నిది చూపబడినది ప్రయోగములన్నియు సానందో పాఖ్యానము, భాస్కర శతకము, చెన్నబసవ పురాణము లోనివి. ఈకృతుల కర్వాచీనములు. వావిళ్ల నిఘంటువు దీనిని గ్రహించినది.

పరామర్శించు. సం సక్రి. చక్కగా విచారించు అని ఉత్తర రామాయణము నుండిప్రయోగ మీయబడినది (సూ ని. 5సంపుట 202) ఇది17వ శతాబ్ది ప్రయోగముకాని ఇంతకన్న పూర్వ ప్రయోగమిది.

విరాళి "దిగంబరా ఇవ్విరాళిం బరామర్శింపుము" (3-65)

వావిళ్ల నిఘంటువున భాగవతము (4-777) నుండి ప్రయోగము గ్రహించినది.

పల్లఱపులు వి.బ (ఫలు అఱపులు నీచపుమాటలు దుర్భాషణములు.

"శాస్త్రంపు పల్లఱపులు" (3-2)

ఈపదము నీకవులు తమ వరాహపురాణమున వాడినారు.

"నీవఱచు పల్లఱపుల్ సహించితి" (11-91)

ఈకవులకు సమకాలికుడగు నారయకవి పంచతంత్రమున దీనిని వాడి నా రు. పల్లఱపులుమాని (1-199)

వావిళ్ల నిఘంటు నీపదమును గ్రహించినద్ది కాని ఈప్రయోగము చూపలేరు.

బోడి బోద (క.బోడి). వి. సన్యాసి. ముండవిధవ. నిందాద్యోతకము

సీ. పా. ఏబోడి గావించే యింత విరిపోటు తల్లినీ కుపనిషత్తరుణితోడ ప్రబోధ 3 3 (సూని. 5సం. పుట 1173)

ఈ పాదముననేగాదు తక్కిన పాదములలోని స్త్రీవాచకములు నిందార్థ ద్యోతకములే.

సీ. ఏ జంత బోధించెనే
ఏ బోడి గావించెనే

ఏ ముండ యెడ బాపెనే
ఏ రండ భ్రమయించెనే

ఇందు మొదటిది మహద్వాచకము దాసరిబోడి. వై జ 4-32

రెండవది మహతీవాచకము

బోడి శబ్దనముకు మహతీ వాచకమున ప్రబోధచంద్రోదయ ప్రయోగ మొకటియే యున్నది.

పూఁబోఁడి-సమాసములో బోడి శబ్దము గలదు. కానిఇది సార్థబిందుకము "బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబు మీది మేనునకుఁ బోడియగు" అనిసూరి (సమా 23సూ.) నేటి వ్యాకరణములో 'బోఁడి"లో అరసున్న యున్నది గాని-సూరి సూత్రాంధ్ర వ్యాకరణమున "మేనుర్బోడి స్యాత్" అనినిరనుస్వార ముగా నున్నది.

పూఁబోడిలోని బోడి విశేషణము
బోడి వ్యస్తముగా విశేష్యము

మనవి పత్రము వి.స. మనవిపత్రము రాజులకు విన్నవించెడి పత్రికా రూప మైన మనవి మాటలచే కానిది అని యర్థము.

గీ. అనుచు మనవిపత్ర మర్పింతఁ ప్రబోధ (2-52)
ఈ శబ్దము సూ.ని లో లేదు.

ముండ వి ఈపదమునకు 1 విధవ, 2. దాసి, 3. ఉంపుడుకత్తె 4. ధూర్తు రాలు:వంచకురాలు అనునాలు గర్థములు సూ.ని లో గలవు వానిలో ఇందు 4వ యర్థమున "ఏ ముండ యెడబాపె" (3-8)అను అను ప్రయోగము చూపబడినది, (నం 6 పుట 357)

మృద్బిందులు సం.వి.అ.పుం. మట్టికలిసిన నీటి కణములు మృద్బిందులు దాల్చి 2-10 (ఇది సూనిలో లేదు)

లక్కముద్ర వి లక్కతో ముద్రవేసిన పత్రము, ఈశబ్దము సూ నిలో లేదు.

గీ అనుచు మనవిపత్ర మర్పింపఁ దత్పుత్ర
మునకు నిడిన లక్కముద్రఁ జూచి 2-52

ఈ పదమున కిదియే తొలిప్రయోగము. ఆవెనుక సీసవము చదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రమున గలదు
పై లక్కముద్రపెట్టి

విరాకులవిత్తు. విణ (విరియు + ఆకు + విత్తు) చెడినది

"అఁటవడ వేదమార్గమున విరాకుల విత్తుగ. (2-45)
(సూ.ని 7సం. 344పుట)

ఈ పదమునకు నొక్కటే ప్రయోగము లభించినది. వ్యుత్పత్తినిబట్టి "పూర్తిగా, సమూలముగా చెడిన" యనునర్థము నిచ్చుచున్నది "విరాకు" అను పదము సంస్కృతమునలేదు ఈ పదము అ, యతితో నుండుటచే వ్యుత్పత్తి సరియైనది

విరాళి వి (స.విరహః) 1 మోహమువఁ పు 2. భక్తి విణ, మోహముకలది.
సూ ని (7సం. 345 పుట)

ప్రయోగములు ధనాభిరామమున "తరితీపరి గాక విరాళిగాక" అనియు 'విరాళికల్కి' అని రాజవాహన విజయమునుండి ప్రయోగములీయ బడినవి కాని విరాళికి తొలి ప్రయోగమిందేకలదు. "దిగంబరా, ఇవ్విరాళిం బరామర్శింపుము" సూ.ని.లో ఈ ప్రయోగములేదు.

విరుద్ధపరచు మి.స.క్రి విరోధింపఁజేయు "వేద మార్గోపనిషత్తుల తోడ శ్రద్ధను విరుద్ధపరచి ప్రబోధ (8-2) విరుద్ధపడు మి.అ.క్రి ప్ర.చం (4-58) (వా.ని.) (సూని. 7సం. 355 పుట) పై ప్రయోగ మొక్కటియే చూపబడినది. ప్రయోగాంతరము లభ్యము కాలేదు.

సంకటపరచు. మి.స క్రి బాధించు, పీడించుఁ చపలునికిం గ్రొత్తచేసి సంకట పఱచెన్. (ప్రబోధ 3-70) (సూ.ని 8సం,767పుట)
ఈ పదమున కిది యొకటియే ప్రయోగము

సంబెల. వి.వక్కలాకులతిత్తి సంబెళ- సంపుటము. దర్భలు మొదలగువానితో నల్లిన సజ్జఅను నరములు చూపబడినవి. (సూ.ని 8సం 828 పుట) ఈగ్రంథమునందలి "సంబెళలోపలిదేవ పూజలున్" అను ప్రయోగము చూపబడినది. (2-8) (కాశీ 1-85 వా.సి)

సాహో. హిం అవ్య. పరివారజనముచేయు హెచ్చరిక ఈ పదము ప్రయోగించుటకు తొలి కవులువీరే. "సాహో యని కటికవారు సందడిజడియం" (2-29) వరాహపురాణమున 'సురలు సాహా యనగన్' (6-42) అని తరువాతి ప్రయోగములు దీనిననుసరించినవి.

సురధాణి. సురధాణ తురకదొర (హిం, సుల్తాన్) చక్రవర్తి
గజపతి సురధాణి గడిదుర్గములకెల్ల
రాజువజ్రంపు బోరుతప్ప. ప్రబోధ చం (1-19 సూని 8సం 1067పుట బోరుతప్ప అనుటతప్పు - బోరుతల్పు) అని యుండవలను.

ఇట్టితప్పు లీ యెనిమిదవ సంపుటమున చాలగలవు. ఈ సంపుటము పూర్తిగా సంస్కరింపదగినది

## తెలుగున ప్రబోధచంద్రోదయములు

తెలుగు భాషలో ప్రబోధచంద్రోదయము మొదటిసారిగా నవతరింపజేసిన వారు నందిమల్లయ ఘంటసింగయకవులే, వారి వెనుకనే తక్కిన కవులు దీని పద్య ద్విపదలో రచించిరి.

### పద్యకావ్యము

కొటికెలపూడి వేంకట కృష్ణ సోమయాజి (1764-1864) ఈతడు బొబ్బిలి సంస్థానకవి నూరేండ్లు జీవించినకవి. ఈతని గ్రంథ మముద్రితము [1]

---

1 మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము—కాగితపుప్రతి

## ద్విపదకావ్యము

కావ్యకర్త రాచూరి వేంకటలింగమంత్రి. ఇది యైదాశ్వాసములుగలది. అముద్రితము[1] ఈతడు దాక్షిణాత్యకవి క్రీ.శ. 1800 ప్రాంతమువాడు.

## ఆధునిక యుగము

సంస్కృత నాటకమునకు యథానువాద నాటకకర్తలు కందుకూరివీరేశలింగము (1892:) వడ్డాది సుబ్బారాయడు (1898:) ఆకుండ వ్యాసమూర్తిశాస్త్రి (1911)[2] వీనిలో నేవియు ప్రచారములోనికి రాలేదు.

శ్రీగట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారి యనువాదము క్రిందటియేడు క్రీశ. (1975) ప్రకటితమైనది.

అద్వైత పరముగా నీ నాటకము రచించిన వెనుక సంస్కృతమున దీని కనుకరణములు బయలు వెడలినవి. వానిలో పేర్కొనదగినవి రెండు-

1 సంకల్ప సూర్యోదయము- ఇది విశిష్టాద్వైతపరముగా రచింపబడినది. కృతికర్తలు మహాప్రసిద్ధులు వేదాంత దేశికులు (1270-1372)

2 శివలింగసూర్యోదయము- ఇది శివాద్వైతపరముగా మల్లనారాధ్యులచే రచితమైనది

పైరెండును రచించినకవులు ప్రతిభావంతులేయైనను, కేవలము అనుకరణములుగా నిలిచిపోయినవేగాని ప్రచారములోనికి రాలేదు.

పైవివరణములనుబట్టి సంస్కృత ప్రబోధచంద్రోదయ నాటకము మహాగంభీరమైన అద్వైతవేదాంతమును ప్రతిపాదించు అధ్యాత్మికనాటకమని మనకు స్పష్టమైనది.

---

1 ,, ,, తాళపత్రప్రతి 715(సమగ్రము)

2 ఆంధ్రవాఙ్మయసూచిక పుట 118.

## అనుసరణలు

తెలుగున ప్రబోధ చంద్రోదయ నాటక మవతరించిన వెనుక, అట్టిదే మఱియొక కావ్యము తెలుగున వెలసినది. దాని పేరు

### జగన్నాటకము

ఇది ప్రబోధచంద్రోదయమువలె సంస్కృత నాటకానువాదముకాదు. తెలుగు ప్రబోధచంద్రోదయము ననుసరించిన స్వతంత్రకావ్యము.

ఈకావ్యకర్త ఏదుట్లశేషాచలుడు[1] ఇతడు తెలంగాణ ప్రాంతమువాడు. కృత్యాది యందీతడు చేసిన కవిస్తుతిలో పింగళి సూరన కడపటివాడు గావున నీతడు క్రీ.శ. 1700 ప్రాంతమున నుండియుండును.

ప్రబోధచంద్రోదయమువలె నిదియు నైదాశ్వాసముల పద్యకావ్యము ఈకావ్య మముద్రితమగుటచేత ఇందుగల యాశ్వాసము లందలి విషయములను వివరించుచున్నాను.

ఇందు మొదటి రెండాశ్వాసములకన్న తరువాతి మూడాశ్వాసములలోను నీ నాటకకథ హెచ్చుగా నున్నది.

### ప్రథమాశ్వాసము

సత్స్వరూపంబైన పరబ్రహ్మంబునందు, జీవప్రకృత్యాది జననంబును నతండు వినోదార్థంబుగా భరత శాస్త్రానుసారాధ్యాత్మ విద్యానుసారంబుగా త్రివిధాండంబులు బుట్టి విలసించిన తద్భూత త్రిశక్తి త్రిమూర్తులన్యోన్య పరిగ్రహ సామర్థ్యంబున నాట్యసామాజిక సంపత్తి గాపరబ్రహ్మ నిర్దేశంబున నిరూపితులై నిలుచుటయు తత్పరమేశ్వరుండు సభాసదనంబు గల్పించి పేరోలగం

---

1 మఱుగుపడిన మాణిక్యాలు. డాక్టరు బి.రామరాజు ఏదుట్లశేషాచలుడు- గోలకొండ పత్రికా ప్రచురణ 1961 ఈ శీర్షికయందలి విషయము లన్నియు నిందుండి గ్రహింపబడినవి పైగ్రంథకర్తకు కృతజ్ఞుడను.

బున్న సమయంబున మార్దంగికాది సామాజికజనంబు నతనిం బ్రశంసించుటయు బుద్ధివిదూషకుడు మనస్సూత్రధారి యనునుతంబున విప్రమాతృకాగమన సూచనము చేయుటయు ననునవి గలవు.

## ద్వితీయాశ్వాసము

విప్రమాతృకాగమంబును ఆయ (...)ంబు వాచికాభినయంబుల జెప్ప (—) దను గమ్యమానులైన విప్రులు వేదశ్రోత జ్యోతిషసాముద్రిక శకున సప్నసాహిత్య వైద్యాది విద్యలు ప్రసంగించుటయు క( ) దా ్ఛ ఆంగికాభినయంబును ( ) తత్పురోభాగమున చతురంగ బలసమేతులై రాజమంత్రులు చనుదెంచుటయు తమతమ...టయు...నాట్యాభినయంబు చూపుటయు మాగధులు స్తోత్రంబులు చేయుటయు వైశ్యమాతృక యేతెంచి యాహార్యంబున నభినయించుటయు తద్వ్యవహారగోత్రమాతుల కన్యావివాహ నిర్ణయంబును శూద్రమాతృక చనుదెంచి సాత్వికంబున నభినయించి వర్ణభేదంబు దెలుపుటయు సకల శక్తిప్రకారంబు సేయుటయు ననునవి గలవు.

## తృతీయాశ్వాసము

మహాకావ్యంబునందు అహంకారుండు మమకారియను భార్యసమేతుండై వచ్చితన ప్రభావంబు వక్కాణించుటయు, మోహుం డేతెంచి తనస్థితిని జెప్పుటయు కామాగమనంబును రతివర్ణనంబును లోభుండు తృష్ణ యను పత్నితోడం గూడి చనుదెంచి తన నడక చెప్పుటయు క్రోధుండు హింసయను మహిషీ సమేతంబుగా మదమత్సరులం గూడివచ్చి తనప్రభావంబు రూపించుటయ గాణాపత్య సత్య బౌద్ధ, జైన చార్వాక శాక్తేయు లేతెంచి తమస్థితులు వచించటయు శైవ, వైష్ణవ సంవాదంబుచే యుద్ధంబగుటయు సుమతియని సాధ్వీసహితంబుగా వివేకుడరుదెంచి కలహంబు మాన్పుటయు ననునవిగలవు.

## చతుర్థాశ్వాసము

ద్వైత విశిష్టాద్వైతు లేతెంచి, భేద భే[illegible]బు చేత బ్రహ్మస్వరూపంబు నిరూపించుట యనునవి గలవు

## పంచమాశ్వాసము

జగన్నాటకంబను మహాకావ్యంబునందు విరాడ్విగ్రహుం డహంకార భార్యయైన మమత శాంతిని వానికిచ్చి పెండ్లిచేసి, నిరహంకారుండని పేరుపెట్టుటయు శాంతి పరిచయంబును నొందుటయు చంద్రవాయు మన్మథామ్యాపాలంభంబును పూజా విధానంబును శాంతి గర్భంబును జ్ఞానదేవుండు జనియించి జగన్నాటకంబునకు వచ్చుటయు జ్ఞానోపదేశంబును భూమీశు నితిహాసంబు దెలుపుటయు ఉదయాస్తమయ వర్ణనంబును శాంతి నిరహంకార జ్ఞానదేవులు జనులకు సంశయ పరిచ్ఛేదంబుగా పలుకుటయు సకలజనులు నప్పరమపురుషుని మతినిలుపుటయు ననునవి గలవు.

## ప్రబోధచంద్రోదయము : జగన్నాటకము
## భేదసాదృశ్యములు

జగన్నాటకమున పైని వివరించిన కథాక్రమమునుబట్టిచూడ నదిపూర్తిగా ప్రబోధచంద్రోదయము నాదర్శముగా పెట్టుకొని దానిననుసరించినదే యగుట స్పష్టము. అందువలె నిందును నైదాశ్వాసములు గలవు. రెండింటి యందు ఈశ్వరుండైన పరబ్రహ్మంబునందు జీవప్రకృత్యాది జననము వర్ణితమైనది. అందువలె నీందును వివేకుడు మతి కాముడు రతి క్రోధుడు హింస లోభుడు తృష్ణ అహంకారుడు అనుపాత్రలు వత్తురు. అందు ప్రబోధచంద్రుడు ఇందు జ్ఞానదేవుడు జనించును. బౌద్ధ, జైన చార్వాకాది మతప్రసక్తి రెంటియందు సమానమే.

### భేదములు

| ప్రబోధచంద్రోదయము | జగన్నాటకము |
|---|---|
| 1 అద్వైత వేదాంత ప్రతిపాదకము జీవబ్రహ్మైక్యము | 1 విశిష్టాద్వైత వేదాంత ప్రతిపాదకము జీవబ్రహ్మభేదము |
| 2 ఈశ్వరునికిమాయవలన మనసు మనసునకు ప్రవృత్తి నివృత్తి | 2 ఇందు పరబ్రహ్మమునకు జీవప్రకృత్యాది జననము ద్వైతవిశిష్టాద్వైతమున |

| | |
|---|---|
| భార్యలవలన కామక్రోధాదులు వివేకాదుల జననము | మాయలేదు |
| 3 అహంకారుని భార్యపేరులేదు | 3 ఇందు మమకారి యనుభార్యగలదు. |
| 4 జైన బౌద్ధ చార్వాకాది సంవాదము మోహునికి వివేకునికి యుద్ధము | 4 శైవ వైష్ణవ సంవాదము వారిరువురకు యుద్ధము |
| 5 వివేకునకు ఉపనిషద్దేవి వలన ప్రబోధచంద్రుని జననము. | 5 నిరహంకారునికి శాంతివలన జ్ఞానదేవుని జననము |

## దృశ్యకావ్యములు
## యక్షగానములు

జగన్నాటకము శ్రవ్యకావ్యము కాని దృశ్యకావ్యములైన యక్షగానములలో వేదాంతపరమైన యక్షగానములుకలవు. అవి ప్రబోధచంద్రోదయానుసరణములే.

### ముక్తికాంతాపరిణయము

పరమానంద తీర్థరచితము ఈతడు క్రీశ 1630 ప్రాంతమువాడు. "సచ్చిదానంద పురాధీశ్వరుడు తన పుత్రికయగు మోక్షకన్యకకు స్వయంవరము చాటించుట-వివిధ మతాధిపతులను దేశాధీశులు విచ్చేయుట-మోక్షకాంత నొక్కొక్కరి నొక్కొక్క నెపమున రప్పించి అద్వైతవేదాంత మతస్థుడగు వివేకుని పెండ్లియాడుట నిందలి యితివృత్తము.

### ముక్తికాంతావిలాసము

తరిగొండ వెంగమాంబ రచితము (1784-1868) జగదీశ్వరుడు మాయను వీడి ముక్తికాంతను బొందగోరి యామె మందిరమునకువచ్చుట-విజ్ఞానకాంత (చెలికత్తై) తలుపుమూయుట - తలుపుకడ నావల నీవల నాయకానాయకుల సంవాదములు-మాయాశక్తి వైరాగ్య జ్ఞానశక్తులతో వాదించుట మున్నగునవి యిందలి ఇతివృత్తము.

## సుజ్ఞానఎఱుక

రామబ్రహ్మయోగి రచితము. క్రీశ 17వ శతాబ్ది ప్రతిలేని నిర్గుణిని పతి గాను మతి కోరినబుద్ధి కాంతకడ "ఎఱుక" (జ్ఞానము) అను నెఱుకతవచ్చి వేదాంతగోష్ఠి నెఱపుట ఇందలి ఇతి వృత్తము[1]

## నాటకము

### వివేకవిజయము

ఇది చల్లాసూరయకవి రచితము ఈతడు క్రీశ. 16వ శతాబ్దివాడు దాక్షిణాత్యకవి తంజావూరిదగ్గర పొందవాకగ్రామ నివాసి ఇత డద్వైతమతాను యాయి సదానందయోగి శిష్యుడు. ఇతడు జంటకవుల తెలుగు ప్రబోధచంద్రో దయమును, వివేకవిజయము అనుపేర నాటకముగా రచించినాడు. ఇందు అంక విభజనలేదు. నాటకమువలె పద్యములున్నను యక్షగాన రీతిని తాళప్రధానము లైన త్రిపుటలు, జంపెలు, దరువులు మున్నగు గేయరచనా భేదములుగలవు. ఎడనెడ చిన్నవచనములున్నవి. ద్విపదలు గలవు. కవి గ్రంథాంతమున దీనిని నాటక మనియే యిట్లు పేర్కొన్నాడు.

చ. అలరగ నీవివేకవిజయాభిద నాటకమెవ్వరేని ని
శ్చలమగు భక్తిచేఁ జదువఁజాలి తదీయపదార్థ భావముల్
సలలిత చిత్తవృత్తి ననిశంబును చింతనచేసిరేని వా
రలఘుతరాత్మతత్త్వ పదమంది శుభస్థితి గాంతు రెప్పుడున్.

పద్య ప్రబోధచంద్రోదయమునకిది హృద్యమైన నాటకానువాదము. అందలి కథాక్రమమే యిందలి కథాక్రమము, అందలి పాత్రలే ఇందలి పాత్రలు ఁ దానందనగరి-ఈశ్వరుడు-మాయ-మనస్సు-ప్రవృత్తి నివృత్తి భార్యలు - కామ మోహాదులు-దంభుని, మోహుని కాశీనివాసము- బౌద్ధజైన చార్వాకాది మత ప్రసక్తి-వివేకునికి ఉపనిషద్దేవికి సమాగమము-ప్రబోధచంద్రుని జననము తూచా తప్పకయున్నవి, నాటకాంతమున మాత్రము సూరయకవి మార్పుచేసినాడు,

---

1. పై మూడును డాక్టరు యస్వీజోగారావుగారి ఆంధ్రయక్షగాన వాఙ్మయము నుండి గ్రహింపబడినవి. ఆంధ్రవిశ్వకళా పరిషత్తు ముద్రణ (1964)

ఈ నాటకమున ప్రబోధచంద్రుని జననమైన తరువాత, వివేకుడు ముక్తి కన్యను గాంచును. ఆ కన్య పెద్దదియైన వెనుక స్వయంవరము చాటించును. ఈ స్వయంవర మంతయు విష్ణుభక్తి నడపును. ఆ స్వయంవరమున శైవవైష్ణవ, ద్వైతాద్వైతాది సకల మతాధిపతులును వత్తురు. వారినందరిని విష్ణుభక్తియే పరిచయము చేయును. ముక్తికాంత అద్వైతపతిని వరించును.

ఈతడు క్రీ.శ. 16వ శతాబ్దివాడగుటచేత జంటకవుల ప్రబోధచంద్రోదయమున లేని విశిష్టాద్వైతమును మాధ్వమతమును నిందు చేర్చినాడు.

అనుసరణలు

| ప్రబోధచంద్రోదయము | వివేకవిజయము |
| --- | --- |
| 1. అహంబ్రహ్మీభవించు | "పరగనప్పర మేశు |
| "అహంబ్రహ్మీభవించి | సంసారి యనిపించి |
| తల్లికిం దగినబిడ్డ | పరగ దానవుఁ డహం |
| కలిగెనని మెలంగుచుండు" (1-76) | బ్రహ్మీభవించెన్" |

ప్రబోధ

2. నుదుటన్ ముక్కునఁ జెక్కులన్ జుబుకమందున్ గండపృష్ఠంబులన్
బెదవిన్ బొమ్మనఁ గుక్షి నూరువుల మృద్బిందుల్ ప్రకాశింప ద
ర్భదళంబుల్ శిఖలోపలం గటితటిన్ బాణిద్వయిం న్మించ గా
నిదెపో దంభము మూర్తిదాల్చె ననఁగా నీయయ్య చూపట్టెడున్ (2-10)

వివేకవిజయము

నొసటన్ ముక్కునఁ జెక్కులన్ బెదవియందున్ గండభాగంబులం
దసమాంసంబులఁ గుక్షి రొమ్మునను జాన్వగ్రంబునన్ మృత్తికల్
పసగాఁ గన్పడఁగా శిఖిన్ జెవుల నాపాణి ద్వయిన్ రొంటినిన్
వెస దర్భాగ్రము లుంచి యున్నయితఁడే వేసాన దంభుండెపో (పుట 75)

ప్రబోధ

క.	రాజులు నీతనిపాదాం
	భోజంబులు ముట్టవెఱచి పొనపొన దవులన్
	రాజిత మకుటమణిచ్ఛవి
	రాజుల నీరాజనంబు రచియింతు రనన్ (2-16)

వివేకవిజయము

కల్యాణి	రాజు లెల్ల నితని పాదపూజ సేయవెఱచి
	రాజితాచ్ఛ మకుటకాంతి రాజిచేతను
	ఓజమీఱఁ బాదనీరాజనంబు లిచ్చి మ్రొక్కి
	జేజె విడుచు నుతిశతంబు చేయుచుందురు. (77 పుట)

ప్రబోధ

పుట్టింప రక్షింపఁ బొలియింపఁ గర్తయౌ
	భైరవేశ్వరుఁడు మాపాలివేల్పు
ప్రమద నటద్భూత భయదశ్మశానశ్రీ
	గాటకంబులు మాకు నాటపట్లు
నక్షత్ర పటలీవలక్షంబులైన న
	రాస్థి ఖండములు మాహారతతులు
నీహారకరబింబ నిభమానవ శిరఃక
	పాలములే మాభుక్తి భాజనములు

గాఁ జరింతుము తమలో జగంబులెల్ల
వేరువేరైన శివునితో వేరుగా వ
టంచుఁ జూతుము సిద్ధయోగాంజనప్ర
దీపితంబైన సుజ్ఞాన దివ్యదృష్టి. (3-32)

వివేకవిజయము

ద్వి.	వినవోయి మాదైన వృత్తంబు చాల
	ఘనుఁడు భైరవుఁడు మాకదైనవేల్పు

ప్రకటనటద్భూత భయదశ్మశాన
నికటశృంగాటక నివహంబులెపుడు
రచ్చపట్టులు మాకు రమ్యవరాస్థు
లెచ్చైన హారములిందుబింబాభ
నృకపాల పాత్రిక నిండిన సురయు
నొకటఁ గ్రోలుచు...... (పుట 102)[1]

పై సంవాదములనుబట్టి సూరయకవి జంటకవుల రచన నెంత సన్నిహిత ముగా తూచా తప్పక యనుసరించెనో తెలియగలదు.

పై యనుసరణలను బట్టి యీ కావ్యప్రాశస్త్యము గ్రహింపవచ్చును.

## శృంగార షష్ఠము లేక కవుల షష్ఠము

1. శా. శ్రీరామామణి సీతనాథుని యురస్సీమ న్నిజచ్ఛాయఁ గ
న్నారం గన్గొని యాత్మ నన్యవనిషేర్ష్యం బూనఁ దత్కంధరన్
హారం బున్చుచు నింఁజూడు మనం దానౌటం ద్రపంజెందఁజె
ల్వారున్ రాముఁడు బ్రోచుఁగాత చికతిమ్మాధీశు తిమ్మాధిపున్.
(కవిసంశయ విచ్ఛేదము)

2. మ. తనతో నల్గిన వాణిపాదముల మీఁదన్ వ్రాల లేనెత్తి నా
య్యన పాశ్చాత్య నిజాస్యతన్ముఖములం దన్యోన్య మొక్కపు చుం
బనముబ్బంగఁ జతుర్ముఖము భరింపం జొక్కు పద్మాసనుం
డనవద్యాయురు దీర్ఘఁజేయు చికతిమ్మాధీశు తిమ్మాధిపున్.
(సర్వలక్షణసార సంగ్రహము. 1-297)

---

1 వివేక విజయము - యక్షగానములు సంపుటము 4
ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రకటితము. 1959.

3\. శా. చండాంశుప్రభవీక్ష! తిమ్మయతనూజా తిమ్మవిధ్వస్త పా
షండం బైనత్రిలింగభాగవత షష్ఠస్కంధ కావ్యంబు నీ
కుం డక్కెన్ జతురాననత్వగుణ యుక్తుల్ మీఱ వాణీమనో
భాండారోద్ధత చూఱకార బిరుద ప్రఖ్యాతి సార్థంబుగన్.
(స.ఆ.సా.స. 1-210)

అప్పకవీయము

4\. సీ. గీ. వలవదు భయంబు వారెంతవారలైన
నట్టివారలు మన కగ్గమైనవారు
వాకు నిరయంబునకుఁ గాపు వచ్చు వార
లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు. (3-180)

అని యుదాహరింపబడిన గీత పద్యమునకు పైనున్న రెండు సీసపాద ములను కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగారు తమ కుమారసంభవము ప్రథమ భాగము అనుబంధములో నిల్పిచ్చినారు.

సీ. వారధిశయనుఁ జేయారఁ బూజింపని
ఖలు గట్టిపెడకేలు గట్టి తెండు
హరిమందిరమున కధీశుఁడై నడవని
హీనాత్ముఁగాల్పట్టి యీడ్చితెండు
(మలయ మారుతము సింగన్న షష్ఠస్కంధము.)

పై సీసపద్యములో రెండు పాదములు కవిగారి కెట్లు లభించినవో తెలియ రాలేదు. కవులషష్ఠము వారు చూచి యుందురని పైదానిని బట్టి విశదమగు చున్నది, లేదా వేరొక లక్షణగ్రంథకర్త యెవడైన నుదాహరించెనేమో తెలియ రాదు [1]

---

1 మానవల్లికవి రచనలు పుట 16. ప్రస్తుత పరిష్కర్త పీఠికా సహితము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ 1972.

5. క. అనుటయుఁ గృష్ణద్వైపా
యన తనయుం డిట్టులనియె నవహితమతియై
విను మతిగుహ్యము నారా
యణకవచము భక్తి వాంఛితార్థ ప్రదమున్. (3-338)

6 సీ గీ (ఎసగఁబాత్రిక నోరంబిడకమున్నె
యతిరయంబునఁ బరిశేష మాచరించు)
తత్తరమున నా పోశనమెత్తఁబోయి
భూసురుండెత్తు నుత్తరాపోశనంబు. (3-164)

7. గీ. తల్లియును దండ్రి దైవంబు దలఁప గురుఁడ
కాఁడె నితఁడేమి చేసినఁ గనలఁనగునె?
నాస్తికాధమ ! యోరి ! యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వంగురోః పర" మ్మనఁగ వినవే. (3-146)

సర్వలక్షణ సారసంగ్రహము

8. క. మనుజులలోపలఁ గర్మం
బొనరుచువారెల్ల దండ్యులొ వారలలోఁ
గనుఁగొనఁ గొందఱె దండ్యులొ
యనవుడు హరిభటుల కనిరి యప్పార్శ్వచరుల్. (1-134)

9. చ. అదలిచి నిల్వ వారిఁగని యంతకుకింకరు లెవ్వరయ్య మీ
రిదె యమునాజ్ఞజద్రోచితిరి యెచ్చటనుండిట వచ్చినార లె
య్యదిగత మడ్డపెట్టుటకు నెవ్వరివార లెఱుంగఁ జెప్పుఁ డా
యదితితనూజులో సురలొః యక్షులొః సిద్ధులొః కాక సాధ్యులో
(1-137)

10 సీ పా చిగురాకుబోఁడిమై చెమట పన్నీటిలో
నానుట త్రిషవణస్నానమయ్యె. (1-175)

11శా శ్రీఘంబేటికివచ్చి సంసృతి భవశ్రీసౌఖ్య గంభీర వా
నాఘ్రాణింపని మత్తనూజుల దురాత్మా! భిక్షులం జేసినన్
శుభ్రాదిన్యసమగ్నుఁ జేసితి కృపాశూన్యుండవై గోముఖ
వ్యాఘ్రంబింతియగాక నీవుఋషివే యాహా వితర్కింపఁగన్. (1-275)

12మ. పదముల్ దొట్రిలఁ గౌనుఁదీవ వెలయింపన్ గేశముల్డాలఁ బ
య్యెద వక్షోరుహపాళి చేర కనుదోయిం బాష్పముల్ గ్రమ్మగ
ద్గదకంఠంబున వాక్యముల్ తడబడన్ దద్గేహముం జొచ్చి యా
సుదతీరత్నము గాంచె బాలుని మన శోకానలజ్వాలునిన్ (1-317)

13 గీ ఇవ్విధంబున మఱియు ననేకగతుల
లలిత శృంగారచేష్టల లాచిలాచి
చూచుచున్నట్టి ప్రమ్లోచఁ జూచి మునికి
మనసు గురుగురమనియె ఝుమ్మనియె నొడలు. (2-244)

14ఉ. హంసనమానగామినికి నట్టి వినూతన గర్భశుద్ధికిన్
పుంసవనాది కృత్యములు భూపశిఖామణి యార్యసంపదా
శంసితకర్మకర్మఠత సాంగముగా నొనరింప నన్వయో
త్తంసుఁ గుమారునిన్ గనియె దర్పకు నిందిర గన్న కైవడిన్.(2-268)

15క. ఇంటికిఁ జనుటయు మానెన్
నంటొనరింపంగఁజాలె నాగరికులతో
కుంటెనకాడుల గూడెన్
గొంటరియై యతఁ డసాధుగోష్ఠీపరతన్ (2-354)

16చ. పెరిగిన యీసున న్నెమలిపింఛములన్ పురివిప్పఁబోలు నీ
సరసిరుహాక్షి వేనలికి సాటిగ నిల్వఁగనోడి చొచ్చె నిం

దిరశరణంబు తేఁటిగమి నీలము లింద్రుని పేరు గాంచె పె
న్నిరులు గుహాశ్రయంబు గనియెన్ నెఱిగల్గిన వారికో ర్తురే.(8-68)

17క. నెరసె నెఱసంజ చక్రక
సరసీరుహ విరహభేద సంసూచకమై (8-133)

18మ. గురుబంధుల్ దనుఁజుట్టి రాదిగిచి యాక్రోశింపనిశ్చేష్టుఁడై
యొరలం దన్ను నెఱుంగలేక యసహ్యత్ వ్యాధార్తిముంజెంది చూ
పరతన్ మ్రోయుచుఁబో వివర్ణతమెయిం బాటిల్లి (8-160)

19. క. అరిగి సమిత్ప్రసవకుశాం
కురపక్వఫలోత్కరంబుఁ గొని గృహమునకున్
మరలి యట వచ్చునప్పుడు
ధరణీసురనందనుండు దనకట్టెదురన్. (8-177)

20 ఉ. తెక్కలతో సరాగము నెఱిం బరికింపఁడు వేడ్కఁజెంది యా
యక్కనకాచలంబు విబుధాధ్వమునం ఱనుదెంచుచున్న. (8-192)

21. ఉ. జాఱుటయుం దదూరుయుగసాంద్రరుచుల్ కటిమీఁదనుండి డై
వాఱఁగఁ గాంచి పంచశర పంచశరీ పరికంపితాత్ముఁడై
పాఱుఁడు దాబహుశ్రుతము బల్మియు భావవిశుద్ధి కల్మియున్
మీఱిన నెమ్మనంబు గడిమి న్నిలుపోపఁగలేక లోలతన్ం(8-251)

22.సీ పా. రాయైన తలిసి పేరంటాలిఁ గ్రమ్మర
గలిగించు నడుగుచే వెలసినాఁడు. (8-291)

## నందిమల్లయ
## మదనసేనము

నదిమల్లయ మదనసేనము అనుకావ్యమును రచించినట్లు పెదపాటి జగ్గన ప్రబంధరత్నాకరమునుండి యీక్రింది పద్యములవలన మనకుతెలియుచున్నది.

గీ. అపుడు తానావసానంబునందు మధ్య
కీలితంబయి యొప్పెఁ గెంగేలు వలికి
నవియవు గదా యటంచు నానడిమితీగ
నుపచరింపఁగ వచ్చినదో యనంగ

సీ. తళతళమను పతాకల తోడ రవికాంతిఁ
దలతలమనెడి రత్నములతోడఁ
గనఁగన సొబగధికంబైన పొడవుతో
గనకనచ్చను హేమకాంతితోడఁ
గలకలఁబల్కు చిల్కలతోడ గృహదీప్తి
కలఁ గలహంససంఘములతోడఁ
బఠిపరినాడు బర్హులతో నిజో
పరిపరిగతి మేఘపంక్తితోడఁ

గీ. దముల విహరించు పారావతములతోడ
భ్రమదళివ్రాత సుమవితానములతోడ
బ్రమద వనవాననలచేతఁ బ్రమదమొసఁగి
నెనయు నీమేడతోఁ బ్రతి నెనయగలదె. (341)

సీ. పరిపుల్ల హల్లక ప్రభలు నిండినచోట
సాంధ్యరాగద్యుతి వౌకళింప
వికచ నీలోత్పల ప్రకరస్థలంబుల
గిఱిగొన్న చీకట్లు క్రేళ్లుదాఁట
నిర్ణిద్ర కుముద వనీప్రదేశంబులఁ
దేటవెన్నెల పిల్లతీపులాడ
వికసిత కనకారవింద బృందంబులఁ
బెరయునీరెండ పింపిళ్లుగూయఁ

గీ. బగలురేయును దమలోనఁ బగలుమాని
కలిసిమెలిసిన బాగూన గడలుకొల్పి

వివిధమహిమలఁ దనరునా విమల సరసిఁ
జూచి నివ్వెఱవడి రాజసూనుఁ డపుడు. (342)

సీ. మెఱుఁగుశృంగములందు మెదలక యున్నవి
నీలమేఘంబులు నీరజాస్య!
వెన్నెలపులుగులు వేకువ చంద్రుపైఁ
దేలుచన్నవి చూడు తియ్యఁబోఁడి!
మింట నాగడపలు మెల్లమెల్లగ విచ్చి
కానరావయ్యెనో కలువకంటి
పారిజాతపు దీగ బహువర్ణపుష్పభా
రంబు మోవఁగలేదు కంబుకంఠి

గీ. ననుచుఁ దమలోన గర్భోక్తు లాడుకొనుచుఁ
దనకు నుపచారములు సేయు నన్నుఁగు జెలులఁ
జూచి నవ్వుచు సహజన్య చూడనొప్పెఁ
జారుదోహదలక్షణ సహితయగుచు (343) [1]

## సంస్కృతనాటకములు - ప్రబంధానువాదములు

పూర్వకవులు సంస్కృతనాటకములను ప్రబంధములుగా ననువదించుటకు హేతువు "ఆంధ్రనాటకములు - రంగస్థలములు" అను గ్రంథమున నిట్లుగలదు. [2]

"మన ప్రబంధములు సంస్కృత నాటకములకును సంస్కృతకావ్యములకును మధ్యవర్తులు. వీనియందు నాటకములయొక్కయు కావ్యములయొక్క

1 ప్రబంధరత్నావళి-వేటూరిప్రభాకరశాస్త్రి
ద్వితీయ ముద్రణము 1976. పుటలు 72,73. ఇందు ప్రస్తుత గ్రంథపరిష్కర్త పీఠిక కలదు.

1 పేకుమళ్ల అచ్యుతరావు. విజయనగర సామ్రాజ్యాంధ్ర వాఙ్మయచరిత్ర పుట 168-169

యు లక్షణములు సామాన్యముగా నుండుటచే వేఱుగానాటకములు వ్రాయుసవ సరము లేకపోయినది."

కాని యింతకంటె బలవత్తరమైన కారణము నాకీసందర్భమున పొడగట్టు చున్నది. అది సంస్కృతనాటకము లందున్న

## భాషావైవిధ్యము - ప్రాకృతము

సంస్కృత నాటకములలో సంస్కృతభాషయే ప్రధానమైనను అందు ప్రాకృతభాషలకు స్థానము గలదు. అందు ఉత్తమ పాత్రలకు సంస్కృతమును మధ్యమాధమ లేక నీచపాత్రలకు ప్రాకృతభాషయు నుపయోగింపబడును. ఆపాకృతమైనను నొకటికాదు. ఆరు విధములైన ప్రాకృతములు వాడబడును. శ్రీనాధుడు, కొఱవి గోపరాజు వంటివారు మన పూర్వకవులలో కొందరు సంస్కృత, ప్రాకృత భాషానిష్ణాతులు, కావున యీ భాషావైవిధ్యముకమూలననే పూర్వకాలమున సంస్కృతనాటకములు యధామాతృకముగా గద్యపద్యాత్మిక ముగా తెలుగులోనికి ననూదితములు కాలేదని గ్రహింపవలసియున్నది. ప్రాచీన కవులు ప్రబంధరీతినే యనువదించిరి. అట్టివానిలో మొదటిది.

## కేయూరబాహుచరిత్రము (క్రీ.శ. 1300)

ఇది మంచెనకవి ప్రణీతము క్రీ.శ. 1300 ప్రాంతము నాటిది. ఇది సంస్కృతమున రాజశేఖరమహాకవి రచించిన "విద్ధసాలభంజిక" అను నాటికకు తెలుగు. నాటికలో నాలుగంకములే యుండును. గాన నిందు నాల్గా శ్వాసములేకలవు. నాటికా కథాక్రమము ననుసరించినదయ్యు నిందు, నిరువది రెండు నీతికథలు సంధర్భానుసారముగా చొప్పింపబడినవి. ఇట్లున్నను కావ్యము రసవంతముగాచేయు నేర్పు మంచెనయందుచితముగా గలదు. దీనికి సుసం స్కృత ముద్రణము రావలసియున్నది.

## క్రీడాభిరామము (క్రీ.శ. 1430)

ఇది రావిపాటి త్రిపురాంతకుడు సంస్కృతభాషలో రచించిన "ప్రేమాభి రామము" అను నాటకమునకు తెలుగు. ఇది దశరూపకములలో 'వీథి' అను

నాటక భేదము ఇది చాలావ్యాప్తమైనవి. కాని దీని కర్తృత్వమును గూర్చి భిన్నాభిప్రాయములుగలవు మానవల్లివారు, వేటూరివారు దీనిని శ్రీనాథకృతిగా గ్రహింపగా తక్కిన కవిచరిత్రకారులు వినుకొండ వల్లభరాయనిదిగా గ్రహించిరి.

అప్పకవి స్పష్టముగా శ్రీనాధుని వీథినాటకము అని రెండు పద్యములను అప్పకవీయమున నుదహరించినాడు. (కుసు ంబద్దిన 3-139కందుకకేళి3-379 కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహములో "ఒప్పెం బింతయు (1-66) కుసుమంబద్దిన" అనుపద్యములను శ్రీనాధుని వీధినాటకము నుండియని ఉదహరించినారు. ప్రథమాంధ్రకవిచరిత్రకారులు గురుజాడ శ్రీరామమూర్తి గారు వీధినాటకము శ్రీనాధునిదిగా వ్రాసియున్నారు.

## శృంగార శాకుంతలము (క్రీ శ. 1480)

పిల్లలమఱ్ఱి పినవీరన కవితాగౌరవమువలన నిది విశేషప్రచారములోనికి వచ్చినది. కథలోమార్పులు గలవు.

## ప్రబోధచంద్రోదయము (కీ శ. 1480)

నందిమల్లయ ఘంటసింగయ కవులు. దీనినిగూర్చి సవిస్తరముగా ముందు తెలిపితిని ప్రబోధచంద్రోదయము, నాటక కథాక్రమముననే మార్పులు లేక యధామాతృకముగా ననువదింపబడినది. ఈ పద్ధతికి వీరే ప్రారంభకులు.

## ప్రసన్నరాఘవనాట్య ప్రబంధము (క్రీ.శ 1550)

ఇది బొడ్డుచెర్ల చినతిమ్మనరచితము. జయదేవుని ప్రసన్నరాఘవ నాటకమునకు యథానువాదము [1] ఇందు ఆశ్వాసములకు బదులు అంకము లనియే యున్నది.

---

1. ఈ గ్రంథము నూతనముగ 1962లో డాక్టరు బి.రామరాజుగారిచే సంపాదితమై పీఠికా పరిష్కరణములతో ముద్రితమైనది.

## అనర్ఘ రాఘవము (క్రీ.శ. 1700)

ఇది బిజ్జుల తిమ్మభూపాలకృతము. మురారి యనర్ఘరాఘవ నాటకము నకు ప్రబంధ పరివర్తనము యథామాతృకము. ఇది ముద్రితమైనది [1]

## తెలుగులో జంటకవులు

తెలుగున జంటకవులనుగూర్చి పరిశోధించిన నీ క్రింది వారు గన్పట్టుచున్నారు.

కాచ విభుడు

విఠలరాజు

వీరిరువురు రంగనాథ రామాయణోత్తరకాండను ద్విపదగావించిరి [2] వీరిరువురు సోదరులు. తెలుగున తొలిజంటకవులు వీరే. వీరు క్రీ. శ 1350 ప్రాంతమువారు.

నందిమల్లయ, ఘంట సింగయ్య

ప్రబోధచంద్రోదయ, వరాహ పురాణాంధ్రీకరణ కర్తలు.

తురగా రాజకవి–అయ్యంకి బాలసరస్వతి

వీరిరువురు కలిసి 'నాగర ఖండము' అను పద్య కావ్యము రచించిరి, క్రీ. శ. 1608 ప్రాంతమువారు.

కేసన–మల్లన కవులు.

వీరిరువురు దాక్షాయణీ పరిణయము అను ప్రబంధము రచించినవారు. వీరిరువురు సోదరులు. బమ్మెర పోతనవంశీయులు. పోతనకు మునిమనుమలు క్రీ. శ. 1650 ప్రాంతమువారు.

---

[1] ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారు దీనికి తిరిగి సుపరిష్కృత ముద్రణ గావించుచున్నారు.

[2] ఈ ద్విపద ఉత్తరరామాయణము పూర్వము "సరస్వతి" అను పత్రికలో కొంతభాగము ఆ వెనుక చెలికాని లచ్చారావుగారి ఆంధ్రభాషావిలాసిని గ్రంథమాలలో చాలవఱకు ముద్రితమైనది. దీనికి సుసంస్కృతమైన శుద్ధప్రతి చాల యావశ్యకము.

అయ్యలరాజు, అయ్యల భాస్కర కవులు.

వీరిరువురును కలిసి "రెట్టమతము" అను జోతిశ్శాస్త్రమును పద్యములలో రచించిరి.

ఆధునిక యుగమున చాలమంది జంటకవులు వెలసిరి. వారిలో సుప్రసిద్ధులు.

తిరుపతి వేంకట కవులు

1. దివాకర్ల తిరుపతిశాస్త్రి, 2. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

కొప్పరపు సోదర కవులు[1]

1. కొప్పరపు వేంకట సుబ్బరాయకవి. 2. వేంకట రమణకవి.

వేంకటరామ కృష్ణకవులు

1. ఓలేటి వేంకటరామశాస్త్రి. 2. ద్వివేది రామకృష్ణశాస్త్రి

రామకృష్ణశాస్త్రి, వేంకటరామశాస్త్రికి మేనత్త కొడుకు. వీరు పీఠికాపుర సంస్థాన కవులు, శతావధానులు, గ్రంథకర్తలు.

వేంకట పార్వతీశ్వర కవులు

1. బాలాంత్రపు వేంకటరావు. 2. ఓలేటి పార్వతీశము.

వీరు పద్యకావ్య రచయితలగు కవులేగాక ప్రసిద్ధ నవలారచయితలు. ఇది వీరి ప్రత్యేకత.

శేషాద్రిరమణ కవులు

1 తిరుమల శేషాచార్యులు. 2. దూపాటి వేంకటరమణాచార్యులు

---

1 వీరినిగూర్చి సంపూర్ణ వివరములు నాచేత రచింపబడిన "కొప్పరపు సోదర కవుల చరిత్ర" అను గ్రంథమును చూడనగును.

జంటకవులనుగూర్చి చూ. 1. ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు సంస్కృతమున జంటకవులు. భారతి ఫిబ్రవరి 1968. 2. AAN Raju: Handbook of Pseudonymous Authors in Telugu (1974)

# శ్రీనాథయుగము కావ్యవిభజనము

ప్రబోధచంద్రోదయ వరాహపురాణ కృతికర్తలైన నందిమల్లయ ఘంటసింగయకవులు తెలుగు సాహిత్యమున శ్రీనాథయుగమునకు జెందినవారు.

## శ్రీ నాథయుగము

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున క్రీ.శ. 1400-1500 అని నిర్ణీతమైనది. ఈ కవుల కృతులనుబట్టి వారు శ్రీనాథయుగమున చివర రెండు దశాబ్దులలో ననగా క్రీ.శ. 1480-1500 ప్రాంతమున నుండెడి వారని చెప్పనగును.

ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథయుగమొక విశిష్టయుగము. ఈ యుగమున పద్యకవితయేగాక పదకవితయు వర్ధిల్లినది. శ్రీనాథుని సమకాలికులగు తాళ్లపాక అన్నమయ్య, తిరుపతి క్షేత్రమున శ్రీవేంకటేశ్వరునిపై వేలకొలది పదములు పాడినారు. ఆయన పదకవితా సార్వభౌముడు. ఇట్లు పద పద్యకవితా సార్వభౌము లిరువురును, సమకాలికులుగా నుండుట మన సాహిత్య చరిత్రమున నొక సంస్మరణీయమైన సన్నివేశము.

శ్రీనాథయుగమున పురాణములు, అనువాదాకావ్యములు, కథాకావ్యములు, చారిత్రిక కావ్యములు, క్షేత్రమాహాత్మ్యములు, శాస్త్రగ్రంథములు, ద్విపద కావ్యములు వెలసినవి, వానితోపాటు క్రీడాభిరామమను రూపకము వెలసినది. సంస్కృత నాటకములు పద్యకావ్యముగా నీ యుగమున వెలసినవి. పిల్లలమఱ్ఱి పినవీరన కాళిదాసు శాకుంతలనాటము నందిమల్లయ, ఘంటసింగయ కవులు ప్రబోధచంద్రోదయ నాటకము ప్రబంధానువాదములు గావించినారు.

శ్రీనాథయుగమున కృతులయందలి విభాగము పైనచెప్పిన పినవీరభద్ర కవి శృంగార శాకుంతల పీఠిక (పుట 4) యందిట్లుగలదు. [1]

"ఈయన (పిల్లలమఱ్ఱి పినవీరన) శృంగారశాకుంతలము శ్రీనాథ యుగలక్షణములకు నిర్దుష్టమైన యుదాహరణము.

---

1 శృంగారశాకుంతలము, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి ప్రచురణ. పీఠికారచయిత డాక్టరు శ్రీమతి నాయని కృష్ణకుమారి, సంపాదకురాలు. 1967.

ఈ యుగమునందలి కావ్యములన్నిటిని మూడు విభాగములు చేయవచ్చును.

1 పురాణములను పరివర్తించుట:-

1 వరాహపురాణము
2 జైమిని భారతము
3 పద్మ పురాణోత్తరఖండము
4 భాగవత దశమస్కంధము
5 వాసిష్ఠ రామాయణము
6 ప్రబోధచంద్రోదయము

2. పురాణాంతర్గత కథలను ప్రబంధములుగా చెప్పుట:-

1 శృంగార శాకుంతలము
2 హరవిలాసము
3 కాశీఖండము
4 భీమఖండము
5 శృంగారనైషధము
6 నాచికేతూపాఖ్యానము

3 వివిధ కథలనుగూర్చి యేక కావ్యముగా రచించుట:-

1 విక్రమార్కచరిత్ర
2 భోజరాజీయము
3 సింహాసనద్వాత్రింశిక
4 పంచతంత్రము."

అని యున్నది. దీనికి కొంత విమర్శన యావశ్యకము.

2. జైమినిభారతము. ఇది పురాణ పరివర్తనముకాదు.

సంస్కృతమున భారతము ఇతిహాసము గాని పురాణముకాదు.
(జనమే జయుండు ...... నివ్వినుతేతిహాసంబువిని భార. స్వర్గా. 79).

4. భాగవత దశమస్కంధము. సంస్కృతమున భాగవతము పురాణము. శ్రీనాథయుగమున వెలసి ఆబాలగోపాల మెఱిగిన పోతన బాగవతమును విడిచి ఒక్క దశమస్కంధము మాత్రమే యెట్లు పేర్కొనబడినదో తెలియుటలేదు.

మడికి సింగన భాగవతదశమస్కంధము ద్విపద యున్నది. ఇది పద్మ పురాణోత్తరఖండ కృతికర్తయైన మడికి సింగనదే. భాగవత దశమస్కంధము పైద్విపదకృతి యనుకొనవలెను.

5. వాసిష్ఠరామాయణము. రామాయణము, తెలుగువారి వ్యవహారమును బట్టి పురాణముకావచ్చును కాని సంస్కృతమున నది కావ్యము. ప్రథమకావ్యము

ఆదికావ్యము. ఇది ఒక్క వాల్మీకిరామాయణమునకు మాత్రమే చెల్లును రామాయణముపేరితో నున్న తక్కిన వానికిది చెల్లదు. ఇంతకు వాసిష్ఠ రామాయణము (ఇదియు మడికి సింగనదే)నకు, అసలు రామాయణమునకు సంబంధములేదు. మడికి సింగన రచించినదీ జ్ఞానవాసిష్ఠరామాయణము వేదాంతగ్రంథము.

16. ప్రబోధచంద్రోదయము. సంస్కృత నాటకమునకు ననువాదమగుచుండగా నిది పురాణముగా నెట్లు పరిగణింప బడినదో దురూహ్యము.

పైయెడింటిలో వరాహపురాణము, పద్మపురాణము, భాగవతము మాత్రమే పురాణములు

పురాణాంతర్గతకథలను ప్రబంధములుగా చెప్పుట

2.1. శృంగారశాకుంతలము : శృంగారశాకుంతలమున భారతకథ ప్రస్తావన యుండుటచేతను, భారతము పురాణమను నూహతోను, ఈ భాగములో చేర్చినారు పీఠికా రచయితలు శృంగారశాకుంతలమంతయు భారత కథనే తూచాతప్పక పూర్తిగాననుసరించిన నిందుచేర్చుట సమంజసమే కాని, పినవీరభద్రకవియే

"భారతప్రోక్తకథ మూలకారణముగ
కాళిదాసుని నాటకక్రమముకొంత" (1-27)

అని స్పష్టముగా కాళిదాసుని నాటకక్రమమునుగూడ ననుసరించినట్లుచెప్పుట చేతను పేరు "శాకుంతలము" అని పెట్టుటయు నిది నాటకానువాదము క్రిందవచ్చును. కేవల భారతకథయే యైన పినవీరన దీనికి "శకుంతలో పాఖ్యానము" అని పేరుపెట్టునుగాని శాకుంతలమని పెట్టడు ఇది నాట కానువాదమని విమర్శకుల యభిప్రాయము[1] భారతము పురాణముకాదు.

---

1. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము -పిల్లలమర్రి పినవీరన- -శృంగారశాకుంతలము పుట 167 చేకుమళ్ల అచ్యుతరావు (1983.)

2. హరవిలాసము. ఇది యేకైకముగా నొక పురాణమునుండి గ్రహింపబడిన కథలు కలదికాదు. కథాకావ్యము. 1,2 ఆశ్వాసములు చిఱుతొండ నంబి కథ బసవపురాణములో నున్నది. కాని బసవపురాణము మన పురాణముల వంటిది కాదు.

3, 4 ఆశ్వాసములు గౌరీకల్యాణము కాళిదాసు కుమారసంభవమున కనువాదము. 5వ ఆశ్వాసము ఈశ్వర లింగావిర్భావము. 6వ ఆశ్వాసము హాలాహల భక్షణము. 7వ ఆశ్వాసము కిరాతార్జునీయము (ఇది నన్నయ కిరాతారున కథాభాగమునకు నకలు.

3, 4, కాశీఖండ భీమఖండములు (భీమఖండ కాశీఖండములని క్రమము) స్కాందపురాణాంతర్గతములు కాని ఇందు భీమఖండమునమూలము శ్రీనాథునిదిగాని వ్యాసునిది కాదని నిర్ణయింపబడినది.[1]

5. నైషధీయచరితమను శ్రీహర్షునికావ్యమునకు ననువాదము

6 నాచికేతూపాఖ్యానము. దీనిని పురాణాంతర్గత కథగా చేర్చినారు. దీనికి కఠోపనిషత్తు మూలము. భారతమున నీకథ కలదు. దగ్గుపల్లి దుగ్గన తెలుగుకృతికి మూలము సంస్కృతములో నున్ననాసికేత చరిత మను కావ్యము.[2]

కావున నీవిభాగములో చెప్పదగినవి రెండే- భీమఖండము, కాశీఖండము సంస్కృత నాటకానువాదములు అనియొక విభాగముచేసి అందు

1. క్రీడాభిరామము
2. శృంగారశాకుంతలము
3. ప్రబోధచంద్రోదయము

చూపిన సమంజసముగా నుండెడిది.

---

1 శ్రీనాథుడు. డాక్టరు కొర్లపాటి శ్రీరామమూర్తిగారి సిద్ధాంతగ్రంథము. (పుటలు 287-424)

2 విజయనగర సామ్రాజ్యమునందలి ఆంధ్రవాఙ్మయము పుట 135.

శ్రీనాథయుగమును గూర్చి నేను ప్రత్యేక గ్రంథము రచించియున్నాను. అది ముద్రితము కావలసియున్నది.

## గ్రంథ సూచిక


కవితములు: గురుజాడ శ్రీరామమూర్తి (1893) నంది తిమ్మన చరిత్రలో నందిమల్లయ, ఘంటసింగయ కవులచరిత

ఆంధ్రకవులచరిత్ర: కందుకూరి వీరేశలింగము ప్రథమభాగము (1917)
ఆంధ్రకవితరంగణి: చాగంటి శేషయ్య. 6వ సంపుటము
సమగ్రాంధ్రసాహిత్యం తొలిఆరుద్ర రాయలయుగం – నందిఘంటలజంట
మఱుగుపడిన మాణిక్యాలు: డా. బి రామరాజు

విజయనగర సామ్రాజ్యాంధ్రవాఙ్మయచరిత్ర (మొదటి భాగము) వేకువల్లఅచ్యుతరావు (1933)

వ్యాసములు

గాండీవి (శ్రీవంతరాంరామకృష్ణరావు) ప్రబోధచంద్రోదయము 1960. ఆం.సా. ప ప. శార్వరి 50. సం (92) పుట 46.

సంస్కృతము

1. గోపమంత్రికృత చంద్రికవ్యాఖ్యతో కూడిన ప్రబోధచంద్రోదయము (సంస్కృతము) సంపాదకులు వాసుదేవ లక్ష్మణశాస్త్రి (1935)

2. సంస్కృత ప్రబోధచంద్రోదయము: సంపాదకులు కె.సాంబశివశాస్త్రి త్రివేంద్రమ్ (1936)

3. ప్రబోధచంద్రోదయము: పండిట్ రామచంద్రమిశ్రగారి "ప్రకాశ" సంస్కృత హిందీవ్యాఖ్యానములతో చౌకాంబా విద్యాభవన్ వారణాశి-1 (1968)

## ఈ క్రింది ముద్రణస్ఖాలిత్యములను ముందుగా సవరించుకొన ప్రార్థితులు

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 3 | 13 | 4 | సరణిక్ | సరణిన్ |
| | 14 | 6 | తమ | తామ |
| 4 | 16 | 3 | లయ | లమి |
| 7 | 27 | 2 | యొక్క | యెక్కు |
| 12 | 50 | 10 | తాత్న | తాత్మ |
| 13 | 54 | 4 | నంచ | సంచ |
| 23 | | | ద్వితీశ్వా | ద్వితీయాశ్వా |
| 24 | 17 | 4 | థము | ఠము |
| 25 | 22 | 12 | మునే | మునీ |
| | | 8 | క్షి9తి | క్షితి |
| 27 | 32 | 2 | యోహ | యోహో |
| 28 | | 15 | యొఋం | యెఋం |
| 31 | 50 | 19 | గనుఁ | గనుఁ |
| 32 | 53 | 11 | నిదిబుద్ధి | నిది నిబద్ధి |
| 38 | 81 | 4 | 51 | 81 |
| 44 | 23 | 3 | రిఁగి | ఱిఁగి |
| 46 | 31 | 4 | సౌమ | సోమ |
| 47 | 32 | 6 | భోజ | భాజ |
| 49 | 40 | 3 | తెఱఁగి | తెఱంగెఱిం |
| | 44 | 1 | వంబు | నంబు |
| 50 | 47 | 3 | నెవ్వ | నెన్న |
| 51 | 51 | 2 | ఢెర్య | ధైర్య |
| | | 9 | యంబ | యంబు |
| | | 51 | బైర | భైర |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 56 | 75 | 1 | రిలి | టిలి |
| 57 | 80 | 7 | దేపీ | ద్దేపీ |
| 59 | 3 | 2 | లయ్యు | లయ్యు |
| 60 | 8 | 1 | ధభత్స | ధభీభత్స |
| | 9 | 2 | మర | సుర |
| 61 | 10 | 1 | విశ్ర | విస్ర |
| | | | గంభా | గంధా |
| | 12 | 2 | నసు | నను |
| | 14 | 2 | వ్వాని | న్వాని |
| 62 | 17 | 2 | స్రప | స్రవ |
| | | 3 | బద్ల | బద్ధ |
| | 18 | 2 | కోను | కోమ |
| | 19 | 18 | ఒర | బర |
| 63 | 23 | 1 | డంప | డింప |
| | 24 | 4 | రావి | గావి |
| | 26 | 1 | వధి | వధి |
| 64 | 27 | 5 | మున్ని | మున్ని |
| | 29 | 4 | షని | షని |
| | 30 | 1 | ణత్య | ణత్వ |
| | 31 | 3 | బ్రచ్చా | బ్రచ్చా |
| | 32 | 1 | తృర్ణష్ణా | తృష్ణార్ణ |
| 65 | 36 | 8 | మాణ | యాణ |
| 68 | 46 | 8 | తును | తాను |
| | | 20 | దచ్చా | దచ్చా |
| | | 21 | కామ | కాను |
| 70 | 54 | 14 | జెటి | బెటి |
| 73 | 68 | 2 | శైల | శైల |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- | --- |
| 74 | 72 | 4 | జ్ఞయ | జ్జయ |
| 77 | 8 | 3 | చుమ్ము | చుమ్మ |
| | | 6 | ఘని | ఘను |
| 78 | 13 | 2 | సడ | నడ |
| 79 | 17 | 2 | నిక్ర | విక్ర |
| 81 | 30 | 2 | నుచ్న | నున్న |
| 83 | 36 | 1 | నీరా | నీలా |
| | 37 | 1 | ఙా | భా |
| | | 2 | సేమ | సీమ |
| | | | ఖేద | ఖేద |
| | 38 | 9 | పొడ | పొడు |
| 85 | 45 | 24 | వృద్ధికి | వద్దికి |
| 90 | 61 | 2 | హిక | హిత |
| 92 | 68 | 2 | సామే | సమే |
| | | 9 | ముంద | మంద |
| 95 | 88 | 9 | నేమని | నేమనిచెప్పెడిది |
| 100 | 105 | 28 | తత్త్వ | తత్త్వమీ |
| 101 | 108 | 1 | నునె | నున్ |
| 102 | 118 | 14 | విష్ణ | విఙ్ణ |
| 103 | 115 | 3 | ముగ్గా | ముగ్ధా |

(—)

# ప్రబోధ చంద్రోదయము

శ్రీ నిత్యంబుగ నిచ్చు నాహరివిరించి స్తంబపర్యంత మీ
నానాజీవులలోన రత్నములలోనన్ సూత్రముం బోలెఁ దా
లీనుండయ్యు జగత్కరండకనిచోళీభావముం దాల్చు బో
ధానందైకమయుండు శంకరుఁ డనంతామాత్యగంగయ్యకున్. 1

శా. సాంగత్యంబునఁ బొందు మూఁడు జగముల్ సత్త్రివర్గేక్షణా
పాంగంబే జగదంబ కొంతనటియింపం జేయు మాత్రంబునన్
మాంగళ్యైక నివాసమైన మహిమన్ వర్తించు నాశంభు వా
మాంగస్థాయిని యిచ్చు వైభవ మనంతాధీశుగంగయ్యకున్. 2

సీ. ఛాయామదము తుండసంవితభోగి తా
రకములు కరశీకరవ్రజంబు
వితతశబ్దంబు బృంహిత మాశ్రితానిలం
బాలోలకర్ణతాళానిలంబు
సాంధ్యరాగము శిరస్సాంద్రసిందూరంబు
జాహ్నవీపూరంబు జన్నిదంబు
ఘనములు గండభృంగము లర్కవిధుబింబ
ములు పాణిఫలపూర కలశములును

గీ. గాఁగఁ బ్రత్యక్షమైన యాకాశతత్త్వ
మూర్తి విఘ్నేశ్వరుండు త్రిమూర్తిసుతుఁడు
కరుణతోడ ననంతయగంగమంత్రి
శేఖరునికోర్కి సఫలంబుఁ జేయుఁగాత. 3

శా. ఆకాశైందవకాంతి నుబ్బి విమలంబై యోగసామ్రాణ్మనో
నీకాశంబగు దుగ్ధసాగరమున న్విశ్రాంతి నేకాంతి నా

నా కౌతూహలవృత్తి సల్పుచుఁ జిదానందంబునం బొల్చు ప
ద్మాకంజాక్షులు ప్రోతు రెప్పుడు ననంతాధీశుగంగాధరున్. 4

చ. అమలమరాళయాన చతురాననభావసువర్ణదేహవి
భ్రమముల నిద్దఱుం దొరసి బ్రహ్మము శక్తియునైన తా రభే
దమున నటించులీల విశదంబుగఁ దెల్పుచు నల్వయు న్వచో
రమణియు నిత్తు రీప్సితవరంబు లనంతయగంగమంత్రికిన్. 5

శా. ఆ వాణీపతిపౌత్రుఁడైన యనఘుం డాదిత్య దైత్యాది నా
నావిశ్వంబునుగాంచె నీచతురుదన్వన్మేఖలన్ మేదినిం
గావించెన్ దనపేరఁ గాశ్యపి యనంగాఁ దత్త్వవిజ్ఞానఖ
ద్యావర్త్మైకవిహారి కశ్యపుఁడు తద్బ్రహర్షి గోత్రంబునన్. 6

ఉ. ఐతనమంత్రి సంజనితుఁడై తనకీర్తి దిగంతనాకచ
ప్రోతనవీనమౌక్తికవిభూషణలీల వహించుచుండఁ బ్ర
ద్యోతనసూనుదానమహిమోన్నతి మించి సునీతిచాతురీ
శాతనఖంబులం దునిచె శత్రుమహామహిమాంకురంబులన్. 7

క. కనియెం దనయుల నాయై
తన యేవురఁ గొమ్మవిభుని సంబఱు నన్న
య్యను మాచన నప్పయ్యను
ననఘులు వారలకుఁ బెద్దయగు కొమ్మనయున్. 8

సీ. శిష్టసంరక్షణ దుష్టనిగ్రహశక్తి
హరి నాల్గుభుజములకరణివారి
వేదవేదంగాదివిద్యల భారతి
వదునాల్గు మోముల కరణివారి
నర్థి కామితపూరణారంభమున దివ్య
గవినాల్గు చన్నుల కరణివారి
ప్రత్యర్థి కుంజరభంజనంబున నింద్ర
కరి నాల్గుకొమ్ముల కరణివారి

గీ. సుతుల నల్వురఁ గనియె ధీయుతులఁ బెద్ద
నార్యు నారపమంత్రి ననంతవిభుని
గంగయామాత్యు నుర్వి సాంగంబులైన
పూరుషార్థంబులో యన వారిలోన. 9

క. చతురామ్నాయప్రౌఢిమ
చతురతచేఁ జతురుపాయసాంగత్యమునకున్
జతురాశాగతవితరణ
చతురుఁ డనంతయ్య సకలసమ్మతుఁడగుచున్. 10

ఉ. కాచనమంత్రిశేఖరునిగాదిలిపుత్త్రి హరిప్రియేశనా
రీచతురాస్యకాంతల సరిన్ గణుతింపఁగవచ్చు పుణ్యశీ
లాచరణప్రభావకరుణాతిశయంబుల మించు బంధుర
శ్చాచణఁ దిప్పమాంబఁ గరకల్పలతానికురంబఁ బెండ్లియై. 11

గీ. మహిమయెల్లన నెల్లన సహజదాన
కామధుగ్గణ మనఁగ దుగ్గణను లక్ష్మి
పట్టుకొమ్మనఁ గొమ్మనఁ బరమబోధ
గరిమ గంగయ్య యనఁగ గంగయ్యఁ గనియె. 12

క. ఆధన్యులలోనం గం
గాధరవిభుఁ డలరుఁ గీర్తికాంతాధవుఁడై
రాధేయ సుధాకర పృ
థ్వీధరగాదాధరీకవితరణ సరణిక్, 13

సీ. మౌద్గల్య గోత్రసంభవుఁడైన రాజశే
ఖరమంత్రి యేసాధ్వికన్న తండ్రి
యత్రాంత మధురాన్న విశ్రాణనమున సా
క్షాదన్నపూర్ణ యేచంద్రవదన
కాచమ్మ బంధు సంకల్ప కల్పన కల్ప
వల్లి యేకాంతమతల్లి తల్లి

యనుకరించు ననసూయారుంధతీశ్వేత
పతుల నేకళ్యాణి వర్తనంబు

గీ. మానసంబెల్లఁ గరుణ యేమానవతికిఁ
బలుకులెల్లను నమృత మేభాగ్యవతికి
నట్టినారమ్మ పత్నిగా నమరుశాంతి
సంగత వివేకమనఁగ నీగంగవిభుఁడు. 14

చ. మరగినకామధేనువుల మందలు. సిద్ధరసప్రవాహముల్
దొరికినకల్పవృక్షములతోఁటలు, జంబునదీసమూహముల్
సురపతిరత్నపుంజములు, శుద్ధసుధాఘుటికల్ కవీశ్వరో
త్కరముల కీయనంతవిభుగంగనమంత్రి కృపాకటాక్షముల్. 15

సీ. మాధవవర్మభూమండలేశ్వర వంశ
జలధికి నేరాజు చందమామ
యేరా జుదయశైల మెలయ విభేదించెఁ
గపటాహితమదాంధకార మడఁగ
గజపతిసురథాణిగడిదుర్గములకెల్ల
నేరాజు వజ్రంపుబోరుతల్పు
మహిమచే నేరాజు మఱపించె నలభగీ
రథపృథు మాంధాతృ రఘురమణుల

గీ. నట్టిగుణశాలి తమ్మరాయనికుమార
వీరబసవక్షమా చక్రవిభునిచేత
మన్ననలుగాంచి మించిన మహితుఁ డితఁడు
మనుజమాత్రుండె గంగయామాత్యవరుఁడు. 16

చ. జలకము మూర్ధ్నచంద్రసుధ షట్కమలంబులఁ బూజధూప ము
జ్జ్వలతరబోధశాసన నివాళి సుషుమ్న వెలుంగు సౌఖ్యముల్
తలఁపున నీగి బోనము సదా తననాదము ఘంటగాఁగ ని
ష్కలుషత నీయనంతవిభుగంగన గొల్చు నిజాత్మలింగతన్ 17

సీ. సరిలేని నీతిచాతురిచేత రాజ్యతం
త్రంబును నడిపిన నడువుఁగాని
యనిశంబు పుష్పచందనవనితాదిసౌ
ఖ్యంబుల నందిన నందుఁగాని
సంగీతసాహిత్యసరసవిద్యావినో
దంబులఁ దగిలినఁ దగులుఁగాని
స్వామిహితాసక్తి సదవనాసదను శా
సనలీల జరపిన జరపుఁగాని

గీ. నీళ్ళలోపలి సరసిజినీదళంబు
సరవి నిర్లేపుఁడైన సంసారయోగి
సందియములేదు ప్రత్యక్షశంభుమూర్తి
యీయనంతయగంగమంత్రీశ్వరుండు. 18

క. అని శివపూజావసర
మ్మున దీవనలిచ్చి పొగడు బుధులుఁ గవులు ని
ట్లని పల్కిరి కౌతుకమున
ఘనబలశృంగావతీర్ణగంగారభటిన్. 19

ఉ. ఈదృశవర్తనంబునకు నెక్కుడు బోధమగున్ ప్రబోధచం
ద్రోదయ మాంధ్రభాష నతియోగ్యకవీంద్రులచేత నంకితం
బై దిశలం బ్రసిద్ధముగ నందినఁ గస్తురితావి పైఁడికిన్
మేదురహేమకాంతి ధరణిన్ మృగనాభికిఁ గల్గులాగునన్. 20

సీ. వివరింప నిది సర్వవేదాంతసారంబు
తలఁపగానిది గట్టితెలివిత్రోవ
యిది భోగమోక్షసంపదలకు మూలంబు
మోసలే దిది ఘనంబులకు ఘనము
జ్ఞానకర్మరహస్యసాధనంబును నిది
యిది నవరసముల నీనుసురభి

షడ్ధర్మసంబులు సరవి నిందున్నవి
సందేహములు దీఱ వింద గాని

గీ. యిమ్మహారసపాకము నెఱింగినిట్టి
జనుఁ డెఱుంగఁడు మఱి తల్లిచన్నుపాలు
దీనిసరి చెప్ప మరిలేవు త్రిభువనముల
దొరక దీకృతి నీవంటిదొరకుఁగాని. 21

క. అనవుడు ననంతవిభుగం
గన వారలఁజూచి యిట్టి ఘననాటకముం
దెనుఁగునఁ బ్రబంధశయ్యకు
నొనగూర్పఁగ నేర్చుసుకవు లుర్విం గలరే 22

వ. అని పలికిన. 23

సీ. కలరు కౌశికగోత్రకలశాంబురాశిమం
దారంబు సంగీతనంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుఁడు మల్లయమనీషి
యతని మేనల్లుఁ డంచిత భరద్వాజగో
త్రారామచైత్రోదయంబు ఘంట
నాగధీమణికిఁ బుణ్యచరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మితనయుండు ఘలయమారు

గీ. తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృతవాక్కు
లీశ్వరారాధకులు శాంతు లిలఁ బ్రసిద్ధు
లుభయభాషల నేర్పరు లుపమరులు స
మర్థు లీకృతిరాజనిర్మాణమునకు. 24

వ. అనిపలికి వారలం గనుంగొని సంతోషవికసితవదనారవిందుండై మీ తలంపు నా తలంపు నేకంబయ్యె నిదియ సరిలేని శుభనిమిత్తంబని వచ్చి

మమ్ముఁ బిలిపించిన మేమును రాజ్యలక్ష్మీ కటాక్షపరంపరానుకారి మదాళి మాలికామండిత గండ మండల భద్రశుండాల మండితంబును, సేవాగతా నేకదుర్గాధిప చిత్రాందోళికాతపత్ర సహస్రావలంబిత భిత్తిభాగంబును, సుభట కోటివివిధాయుధ ప్రభాధగద్ధగాయమానంబును నగుబహిరంగణంబు దఱసి సామంతులు పుత్తెంచిన కానుక లందుకొనఁ గ్రందుకొన నందందు నడయాడుకంచుకీ సంచయంబుల విలోకింపుచుఁ గక్ష్యాంతరంబులు గడచి విద్వత్కవినాయక వాంశికవందివైణవికవైతాళికమర్దళికాదులైన కళా వంతులు ప్రసంగంబునం గొలగొల మంచు నంచెలంచెలై నిలిచినకొలువు చంచలలోచనలమ్మైఁదీగెలం గదంబించుపరిమళంబుల గుబులుకొనుచు సమీపంబునం గూర్చున్న మన్నెరాజుల భూషణరత్న కిరణరాజులచే విరాజితంబగు క్రొలువుకూటంబుచొచ్చి తనవైభవరత్నాకరంబున విహ రించు నంచలాకోయనఁ జామరగ్రాహిణీ కనకకంకణక్రేంకియాలంకృతం బైన వింజామరంబు లిరువంకల రంజిల్ల నయనోత్సవంబుగాఁ గొల్వున్న తన్మంత్రిశేఖరుం గనుంగొని పరమహర్షంబున నాశీర్వదించిన నతండు. 25

మ. వినయం బొప్పగ మమ్ము నైజనికటోర్విన్ జిత్రవర్ణాసనం
బున నాసీనులఁజేసి తత్సమయసంపూజాలసచ్ఛంభుమూ
ర్ధనవీనేందు కళాసుధాసురభిగంధంబైన హస్తాంబుజం
బునఁ గర్పూరపు వీడియంబు లిడి సంపూర్ణానురాగోక్తులన్. 26

క. నేరుపరి పోషణించిన
హారము వెల యొక్కలీల నతిశయముగ నా
పేరఁదెలిఁగింపవలయును
సారపుఫణితులఁ బ్రబోధచంద్రోదయమున్. 27

గీ. అనిన సౌందర్యలక్ష్మికి యౌవనోద
యంబు దొరికినగతి నీమహాప్రబంధ
మునకుఁ బతివైతి మాకు నపూర్వమైన
కీర్తి కల్గెనటంచు నంగీకరించి. 28

క. పౌరిఁబొరి నొప్ప సలాకల
నొరసిన కుందనపుబూఁదెయును బోలె సభన్
సరసుల సంఘర్షణమున
వరకవికావ్యంబు మిగుల వన్నెకు నెక్కున్. 29

ఆ.వె. కరభములకుఁ బుష్పితరసాలవాటిక
దిరుగఁ గంటకంబు దొరకనట్లు
కుకవికీటములకు సుకవికావ్యములోన
నెమక వీస మంత నెరసు లేదు. 30

క. అని సుకవీంద్రులగుణములు
గొనియాడుచుఁ గుకవి సరకుగొనక మహిఁ బరా
తనసుకవులసాహిత్యము
పనుపఱచిన యట్టిసరసభాషాసరణిఁ. 31

సీ. ఎఱుఁగనివారికి నేదేవుఁడు ప్రపంచ
మౌ మరీచికలు నీ రైనకరణి
నెఱిఁగినవారికి నే దేవుఁడు జగంబు
గాఁడు పగ్గము పాముకానికరణి
నేదేవుఁడు వెలుంగు నాదిశక్తియుఁ దాను
నెలయును నిండువెన్నెలయుఁ బోలె
బ్రహ్మనాద్యాగతప్రత్యక్ప్రరంజ్యోతి
నా మించు నేదేవునడిమినేత్ర

గీ. మట్టి సర్వేశుతోడి తాదాత్మ్యమహిమ
గలిగి పరిపూర్ణభావ విఖ్యాతులైన
దక్షిణామూర్తి దేశికోత్తము నఘోర
శివుల భజియించి యేకాగ్రచిత్తమునను. 32

## షష్ఠ్యంతములు

క. బోధ్యప్రబోధబోధక
తాధ్యాసీనాత్మతన్మయస్ఫురదరుసా
రాధ్యానుగ్రసంతత
శుధ్యంతః కరణునకును సుగుణాంబుధికిన్. 33

క. కరుణావరుణాలయునకు
జరణాభరణాయమానసరసిజచిహ్నా
స్ఫురణాశరణాగతసం
భరణైకగుణానురూపమహిమాఢ్యునకున్. 34

క. అక్షయకీర్తివిలక్షిత
నక్షత్రేశ్వరధురీణునకు జలధిగ్రా
శిక్షుద్బలరేణునకున్
శిక్షితరిపు కదళీదోశసికరేణునకున్. 35

క. భువనప్రతిమాపేటికి
భవనాటక సూత్రధార భావనరతికిన్
నవయోరూపవిభూతికి
శివయోగరహస్యరత్న శేవధిమతికిన్. 36

క. మహిత ప్రభావఖండిత
బహిరంతశ్శాత్రవునకుఁ బ్రభుచంద్రునకున్
బహుసుగుణమండితాఖిల
మహికి ననంతయ్య గంగమంత్రీందునకున్. 37

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మారచియింపంబూనిన ప్రబోధచంద్రోద
యం బను మహాకావ్యంబునకుం గథాసూత్రం బెట్టి దనిన 38

# కథాప్రారంభము

సీ. అనుపమజ్యోతిర్మయంపుఁగోటలు చుట్టు
రాజిల్లుచుండు నేరాజధాని
సరిలేని యమృతంపుఁ బరిఖ లేపట్టణం
బున నగాధంబులై తనరుచుండు
మరి సాటిలేని నైర్మల్యంపుమేడ లే
వీట మిన్నులకును మీదుమిగులు
ప్రతిలేని సహజసౌరభ్యంపుఁదోఁట లే
పుటభేదనంబునఁ బొలుపు మీఱు

గీ. నంతతరిరంసపరమహంసప్రమోద
కారణమహావికస్వరకమలచక్ర
పూర్ణసదమలసరసు లేపురమునందుఁ
గ్రందుకొనుచుండు నాచిదానందనగరి. 39

క. పాలింపుచు నఖిలమునకు
నేలికయై రాజు మెఱయు నీశ్వరుఁడనఁగా
నాలోకవిభుఁడు మాయా
నీలాలకవలన మన సనెడు సుతుఁ గనియెన్. 40

ఆ.వె. ఆమనోభిధానుఁ డఖిలజగంబులు
గలుగఁ జేయఁ దానె కర్త యగుచు
మత్తకాశినులఁ బ్రవృత్తి నివృత్తుల
క్షేమ వెలయఁ గాఁ బరిగ్రహించె. 41

క. మునుపుగఁ బ్రవృత్తివలనం
గనియెన్ మోహాదిసుతులఁ గలుషాత్మకులన్
వెనుకను నివృత్తివలనం
గనియె వివేకాదిసుతుల గతకల్మషులన్. 42

మ. అవలేపంబున నన్నదమ్ము లగుమోహాదు ల్వివేకాదులున్
భువనైకాధిపతిత్వకాంక్షఁ దమలోఁ బోరాడి రేకామిషో
ద్భవలోభంబునఁ బోర కుండరు గదా దాయాదులై మున్ను కౌ
రవులుం బాండవులున్ ధరిత్రికయి హోరాహోరిఁ బోరాడరే. 43

చ. జనకునిపక్షపాతమున సంతతమున్ బలవంతుఁడైనమో
హునిభుజవిక్రమంబునకు నోర్వఁగ లేక వివేకుఁ డాజిలోఁ
దనబలగంబుఁ దానును యథాయథలై చని వృత్రు కోడిపో
యిన సురరాజుచందమున నెక్కడనో యణఁగుండె నంతటన్. 44

వ. బలవదతివ్యూహ దురవగాహ కామ క్రోధ లోభాహంకారాది సహచరస
న్నాహుం డగుచు మోహుండు విశ్వంబునం గలపురంబు లన్నియుఁ
దనవశంబుగా నెదురు లేక సామ్రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు
పేరోలగంబుండి తనతమ్ముల విలోకించి వివేకాదు లక్కడక్కడం బొడ
కట్టుట చారుల ముఖంబున నెఱింగితిమి, యింతట నిందులకుం బ్రతి
చింతన చేసి వైరులపీఁచంబు లడంచుటకు మీకుఁ దోఁచిన యుపాయంబులు
వినిపింపుం డనిన రతిసముత్తుంగకుచాంకితరోమాంచకంచుకితాంతుండును,
మదఘూర్ణితాపాంగుఁడును సకల జగన్మోహనాకారాభిరాముండునగు
గర్వంబున నిట్లనియె. 45

క. తగ వెరుసుమాట చెప్పెద
మగువలచంచలకటాక్షమార్గణజాలం
బుగెలువఁ దాఁకినఁ దాఁకవె
జగతిం గోవిదులమతులుఁ జదువులుఁ దెలువుల్. 46

వ. అదియునుంగాక 47

మ. అలిగీతంబులతోడిపుష్పలతలున్, హర్మ్యంబులుం జందనా
చలమందానిలకందళంబులును, వాసంతంబునుం బండువె
న్నెలలుం గొంతలు నాకు నమ్మినబలానీకంబులై యెల్లచో
టుల నుండగ వివేక మెట్లొదవుఁ బుట్టున్ బోధ మెబ్భంగులన్. 48

క. నావిలు నమ్ములుఁ జూడఁగఁ
బూవులవలె నుండుఁగాని భువనముల మదా
జ్ఞావశులు గాక తక్కిన
దేవాసురవరులనైన ధృతి దూలింతున్. 49

సీ. తనకన్నకూఁతును దాన పెండ్లాడఁడే
వారిజగర్భుండు వావితప్పి
బలభేది గౌతముభార్య నహల్యఁ గా
మించి చేయఁడె నల్లమేఁకతప్పు
కదలేనిరట్టడి కొడిగట్టుకొనియైనఁ
గమలారి గురుతల్పగతుఁడు కాఁడె
తపనసూనుఁడు తారఁ దా నాక్రమింపఁడె
యన్నప్రాణములకు నల్లు దలఁచి

గీ. మరియు నిట్లు జగంబుల మరులుకొల్పి
యెట్టినియతాత్మకులనైన గుట్టు చెఱిచి
కానిత్రోవల నడిపించుకడిమినాదు
వాఋఁదూపులగమి కవలీల గాదె. 50

ఆ. వె. అనుచుఁ గాముఁ డాడుకొనుపంతములు విని
మతి గలంగి పలికె రతివధూటి
యావివేకుఁ డల్పుఁడా యమనియమాది
సచివయుతుఁడు మోహు సరకుగొనునె? 51

క. తగినసహాయము గలిగిన
పగతునియెడ మొక్కలంపుఁబని గాదనినన్
జిగురుపిలుకాఁడు రతి! నను
బెగడించెదు నీవు సహజభీరువ వగుటన్. 52

క. మానిని! యమనియమాదులు
నా నెనమంత్రులును వివేకనరపతిమిత్రుల్

కానిమ్ము వారిపాలికి
మీనవిలోచనలు గారె మృత్యువు లరయన్. 53

క. తరుణులచూపులు మాటలు
గరగరికలు నగవు బిగువుకౌఁగిటిపొందుల్
పరికింప నేల తత్సం
స్మరణమె చాలదె మనంబు నంచల పఱుపన్. 54

ఆ వె. కాన మానసంబు గలఁగిన యమనియ
మాదు లెల్లఁ బోవు నాడనాడ
కమలవనములోన కలహంసపంక్తులు
కలఁకనీరు విడిచి తొలఁగునట్లు. 55

క. ఉడుపుం ద్రోచుఁ దహింసను
సడలింపుదు నేను బ్రహ్మచర్యాదుల ను
క్కడఁగించు లోభుఁ డుద్ధతి
నడవాడ లేకుండ సూనృతాస్తేయములన్. 56

సీ. వినుము విశేషించి మనరాజుదొరలగు
మదమత్సరాదుల కెదురు గలదె
యావివేకుని మంత్రులగు యమనియమాదు
లెనమంద్ర మోహునియనుఁగు మంత్రి
యైనయధర్ముండె యాక్రమింపఁ గలండు
నావుడు రతిప్రాణనాథుఁ జూచి
యొకతండ్రిబిడ్డలై యుండియు నింతేసి
పోరాట మేటికిఁ బుట్టె మీకు

తే.గీ. వనితః పోరాటమాత్రమె వారు మమ్ము
నిందఱను సంహరింపంగ నెత్తికోలు
గొన్న వారన రతి యెట్లొకో దురాత్ము
లింతగాఁ బ్రాణపర్యంత మెట్టు తెగిరి. 57

వ. అనవుడుం గాముండు రతిని విలోకించి చంచలలోచనా! వారును మేమునుం జేపెఱుంగనికూనలమై మీఁద వచ్చు నుపద్రవంబు విచారింపక దురాశాపాశబద్ధులమై కలహసన్నద్ధుల మయితి మింతియ యిప్పుడు పిడుగువంటి వార్త యొక్కటి దిక్కుల న్వినంబడుచున్న యది యది యెఱింగించెద వెఱవకుము పూర్వంబున సంగరహితుండైన పరమేశ్వరునకుఁ దద్గృహిణి యైనమాయకుఁ గూటమి లేకయే చిత్రంబుగా సంభవించిన మనంబునకుఁ దనయుండైన వివేకునకు నుపనిషద్దేవివలనఁ గాళరాత్రికల్పయగు విద్య యనురాక్షసి ప్రబోధచంద్రునితోడం గూడ నుద్భవిల్లి తల్లిదండ్రులను సహోదరులగు మోహాదులు మొదలైన సకలకులంబునుం గసిమసంగి మెసంగు నీవిద్యాప్రబోధ జననంబునకు నా శమదమాదు లెదురు చూచుచున్నవా రనిన రతిపల్లవాధర యుల్లంబు తల్లడిల్ల నాహాకార పూర్వకంబుగా నాలింగనంబు గావించినఁ గాముండు తదీయసంస్పర్శనంబునకుఁ జొక్కి యాత్మగతంబున 58

ఉ. లోలకనీనికాకులవిలోచనదీప్తులు గ్రేవ దాటఁగాఁ
జాలభయంబున న్వడఁకుచక్కనిచన్ను లురంబు మోవఁగాఁ
జాల మనోజ్ఞకంకణభుజాలతలన్ దనుదానె యీగతిన్
బాల కవుంగిలించిన మనంబున దుఃఖము లంటనేర్చునే? 59

క. అని తలఁచి రతిం గనుంగొని
వనితా! మేమెల్ల జీవవంతులమై యుం
డినయన్ని నాళ్ళు నెక్కడ
జనియించును విద్య వలదు శంక యటన్నన్. 60

క. రతియును దమకులనాశము
మతి నెఱిఁగియు నకట! శమదమప్రభృతులు తా
రతిసాహసమున నీగతి
యతనము చేసెద రదేటి కనఁ గాముఁ డనున్. 61

క. సహజఖలుం డుదయింపుచు
మహిఁ గులమును జెఱిచి తాను మడియుఁ జుమీ భూ

రహము లొఱయఁగాఁ బుట్టిన
దహనుం డడవెల్లఁ గాల్చి తాఁ జెడును గదా. 62

వ. అనియిట్లు రతికాము లాడువాక్యంబులు విని మోహుని సమ్ముఖంబునకు దుర్గుణుండనెడి పేరి చారుం డొకండువచ్చి వినతుండై దేవా! వివేకవిభునకు నుపనిషద్దేవికి యోగంబు గలుగుట కాదంపతులకు విద్యాప్రబోధచంద్రు లుదయించుటకు విఘ్నంబు లుద్భవింపక యుండ శమదమాదులువచ్చి సకలపుణ్యతీర్థంబులవెంట దేవతాప్రార్థనంబులు సేయ సమకట్టియున్న వారు చేయకుండ నంకిలిందగఁ గావింపం దగువారింబనుపు మనిన మోహుండు మదిలోన నాగ్రహించి. 63

క. దంభునిఁ జూచి వివేకా
రంభంబున కిప్పుడంతరాయము చేయన్
గుంభిని తీర్థంబులలో
సంభావిత కాశిపురికిఁ జనుమని యనిపెన్. 64

అ. వె. ఇట వివేకుఁ డున్నయెడకు సదాచారుఁ
డనెడుచారుఁ డొకఁడరుగుదెంచి
మోహుచేయు కృత్యముల విన్నవింపంగఁ
జొచ్చె నపుడు పూనగ్రుచ్చినట్లు. 65

వ. దేవరపంపున మహామోహుని రాజ్యంబునకుం జని వారలాడుకొను దూరాలాపంబులునుం జేయుకృత్యంబులు నెఱింగితి నది యెట్లంటేని యప్రతిహతస్వేచ్ఛావిహారులైన రాగాదులచేత భర్త్సితుండై తేజంబు గోలుపడి సాంద్రనీహార పరంపరాంతరితయైన కాంతితోడి చందురుచందంబునం బొనుంగుపడిన మతిసతిం గూడియున్న వివేకుండు మిక్కిలి కృశాంగుడయ్యెను మానధనుండు గావున నసము డింపక యుపనిషద్దేవి వలనవిద్యాప్రబోధచంద్రులం గన మనలకుం దనకులంబునకు హాని చేయఁదలంచుచున్నవాఁడటః కులక్షయప్రవృత్తు లగుదుర్వృత్తులు తమ చేటుఁ దలంతురేః ధూమంబు జీమూతపథంబుఁ బొంది నిజసంభవస్థానం

తై నదహనంబు నార్చి తానుందూలిపోవదే· కావునం బాపకారి యగువివే
కుని నానాప్రకారంబులం జెఱుపవలయునని పెక్కుపాయంబుల వర్తింపు
చున్నవారని విన్నవించిన మెచ్చి తనదేవి మతిం గనుంగొని. 66

మ. తనతంత్రింం బరము న్నిరంజను జగద్భర్తం గదా కట్టివై
చె నహంకారునిఁగూడి మజ్జనకుఁ డచ్ఛేద్యంపుఁ బాశంబులన్
మునుపుం దాముఁ దదానుకూల్యపరు లీమోహాదులంచుం జూమీ
తునుమం జూచితి నమ్మ నమ్ముఁ దము నిందున్ దోషినే నౌదునే. 67

క. కార్యాకార్యము లెఱుఁగక
నార్యత వర్తించుగురువునైనను విడువన్
మర్యాద యనుచు వృద్ధా
చార్యులు పలుకుదురు వేదసమ్మత మగుటన్. 68

ఉ. సారసుఖైకమూర్తియగు సర్వజగత్పతిఁ గట్టిమోహనం
సారపయోధిఁ ద్రోచిన విచారవిహీనులు తారు మంచి వా
రైరఁట తత్సదాశివుని నంటిన దుర్దశ మాన్పఁ దమ్ము సం
హారము చేయు మే మఁట దురాత్ములమో కలకంఠి వింటివే. 69

ఆ.వె. అనిన మతివధూటి యావివేకునిఁ జూచి
ప్రాణనాథ! మోహపాశములను
నిర్విరోధమహిమ నిత్యప్రకాశుఁడౌ
పరముఁ డెట్లు కట్టుపడియె ననిన 70

హరిణీవృత్తము. సతమలనయ స్వచ్ఛుఁడై నం బ్రశాంతి వహించి తా
నొదవు ధృతులఁ బ్రౌఢుఁడైన న్మహోదయధీకళల్
వదలు హరినేత్ర లీలం దలంపఁగ మాయతన్
బొదువ మఱచె నీశ్వరుండుం బ్రబోధము నావుడున్. 71

ఆ.వె. [illegible]
[illegible]

మాయ డాయ నతనిమహిమంబు తప్పునే
యబల ! యట్ల తప్పదైన వినుము 72

క. వారాంగనవలె మాయ వృ
థారంజకురాలు గానఁ దత్సంగతిచే
నారక్తుం డగుశివుఁడు జ
పారంజిత యైనయట్టిస్ఫటికముఁ బోలెన్. 73

గీ. అరయ నాతఁడు నిర్లేపుఁ డగుట హాని
బొరయఁ డీమాయ కావించు బూటకములు
పాయకెప్పుడుఁ బురుషుల భ్రమలు నిడుట
సహజ మింతియ నారీపిశాచములకు. 75

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నలు చేసి
వెడమాటలను ప్రేమ గడలు కొలిపి
తరితీపునటనలఁ దమకంబుఁ బుట్టించి
వట్టిప్రియంబుల గుట్టు తెలిసి
కలికితనంబునఁ గాఁకలు గావించి
తోడినీడలువోలెఁ గూడిమాడి
యలుకల నలయించి కలయిక వలపించి
బాసల నడియాస పాదుకొల్పి

గీ. మనసు కరఁగించి ప్రబలయించి మస్తరించి
మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులుపఱిచి
పాసి యెడఁబాసి తమబంటుఁ జేసికొనరె
వారలోచన లెంతటివారినైన. 75

వ. అదియునుం గాక దురాచారి యగుమాయాదేవి కపటకృత్యం బొక్కటి
వినుము. తానును జవ్వనం బెడలిన పెద్దదాన నతండుఁ బురాణపురుషుండు

విషయరసవిముఖుండు గావున నేతత్పరమేశ్వరపదంబునం దనతనయుం డగు మనంబు నింతటఁ బట్టంబు గట్టెద నని తలంప నమ్మనంబు నమ్మ యభిప్రాయం బవలంబించి తాను జనకునాసన్నవర్తి యగుటం జేసి తత్పరమేశ్వరత్వంబుఁ గైకొన్నవాఁడుపోలె విజృంభించి నవద్వారంబు లగుపురంబులు రచియించి యప్పురంబుల నద్వితీయుం డగునాత్మనిం ద్రుంచివైచిన నతండును దనకులోనై మణిక్రిందివత్తివిధంబునఁ దన యందు నిజచేష్టితంబులు చూపుచుండ నీడతోడం గూడినదర్పణంబుజాడ నహంబ్రహ్మీభవించి తల్లికిం దగినబిడయె కలిగె నన మెలంగుచుండు నట్టిమనంబు పెద్దకొడుకగు నహంకారుండను మనుమనిచేత నాలింగితుండై పరమేశ్వరుండును. 76

మ. ఇది నాతల్లి యితండు తండ్రి యిది నాయి ల్లీకళత్రంబు నా
యిది నాబిడ్డలు వీరు నాహితులు వీరేవైభవం బెల్ల నా
యది యంచున్ జడమానసోదయుఁ డవిద్యానిద్ర ఘూర్ణిల్లుచున్
సదసద్వస్తువివేకి యయ్యుఁ గను సంసారామిత స్వప్నముల్. 77

క. ఈమాటలకు వివేకుని
తో మతియను నిట్టునిద్ర తొట్టి వివేకం
బేమియు శివుఁ డెఱుఁగండఁట ః
యే మాడ్కిఁ బ్రబోధచంద్రుఁ డిఁక జనియించున్. 78

క, అనిన వివేకుఁడు లజ్జా
వనతాననుఁ డగుచుఁ గొంతవడియూరక యుం
డి నిజాంగనతో నిట్లను
ననునయమధురాక్షరంబు లగువాక్యములన్. 79

క. చంచలము మానయుతమును
గంచుపదనువంటి దరయఁ గాంతలహృదయం
బంచు నొకమాటయాడఁ ద
లంచియుఁ జెప్పంగ మదిఁ దలంకెద నన్నన్. 80

క. అనుమాన పడక వల్లభ!
విసుమా నామాట వారిపేరిఁ బలె నన్
గనుఁగొనకుము కులకాంతలు
పెనిమిటిధర్మమున కెడమపెని పెట్టుదురే. 81

సీ. అనవుడు మతిఁ జూచి యను వివేకుఁడు నీవు
విషయరసాస్వాద విముఖురాల
వగుచు నవస్థాత్రయం బనుసంకేత
నిలయంబు చేరక నిమిషమాత్ర
మిన్న కుండినఁ జాలు మున్ను నాతోడుతఁ
గలహించి చిరవియోగమునఁ బొరలు
నుపనిషద్భామిని నొకభంగి బోధించి
హరిభక్తిశాంత్యాదు లైనచెలులు

గీ. పొసఁగ నాతోడఁగూర్పఁ బ్రబోధచంద్రుఁ
డుదయమై ఘోరభవపాశయూథనిబిడ
బంధమోక్షంబు మనవంశకర్త కొసఁగుఁ
గొమ్మ! నీ విందులకు నియ్యకొంటివేని. 82

శా. నాయుగ్రంపుఁ బ్రతిజ్ఞ యొక్కటిసుమీ నాళీకపత్రాక్షి! దో
షాయత్తత్వమతిం బురంబులఁ ద్రిలోకాధీశ్వరుం గట్టరే
దాయాదు ల్గడుబ్రహ్మహంత లగుచున్ దర్పించి ప్రాణాంతిక
ప్రాయశ్చిత్తము చేతు నాఖలులకున్ బ్రహ్మంబు భిన్నంబుగన్ 83

వ. అని మతికాంత నొడంబఱిచి విష్ణుశాంత్యాదులం బిలిచి మీర లుపని
షద్దేవి ననూనయించి తోకొంచురండని పంచె నిటమీఁది వృత్తాంతం
బాకర్ణింపుము. 84

శా. గౌరీనాయకపూజనా కలితహృత్కర్పూర నీరాజనా
సౌరఖ్యాయతనాయమాన బహుతేజశ్ఛన్నదూర్వాసనా

పారంపర్యతమోనిజాశ్రితజనా ! పాండిత్యధీభాజనా !
వీరారిస్థితిభంజనా ! నిఖిలపృథ్వీమండలీరంజనా ! 85

క. గుణగణమణిగణరోహణ
ఫణినాయకనిర్విశేషభాషణ ! జలజే
క్షణసుతసన్నిభశుభల
క్షణ ! శివభక్తిస్ఫుటప్రసవషట్చరణా ! 86

మాలిని. అకలుషనయసీమా ! యంగసౌందర్యకామా !
వికసితరుచిసోమా ! విశ్వసంస్తుత్యనామా !
సకలభువనరాజీశారదావస్తులీలా
శుకదమలయశోవిస్ఫూర్తి సౌభాగ్యధామా ! 87

గద్య. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధపార్వతాభినంది నంది
సింగయామాత్యపుత్ర మల్లయమనీషితల్లజ మలయమారుతాభిధాన
ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ ప్రణీ
తంబైన ప్రబోధచంద్రోదయం బనుమహాకావ్యం
బునందుఁ బ్రథమాశ్వాసము

---o---

# ప్రబోధ చంద్రోదయము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీకరవీక్షణదాన
శ్రీకర నరసింహనృపవశీకర నయవి
ద్యాకరణ చతుర్దశ వి
ద్యాకర ధీరంగమతి యనంతయ గంగా! 1

వ. అవధరింపుము మున్ను విద్యాప్రబోధచంద్రులకు నిర్విఘ్నంబు సంభవించుటకునై పుణ్యతీర్థంబులవెంట దేవతాప్రార్థనంబుకొఱకు వివేకుండు పనిచినశమదమాదుల భంజించి చతురాశ్రమవర్తనంబులం జీకాకుపఱచు కొఱకు మహామోహునిచేత ననుజ్ఞాతులైన భవదీయహితులలోన దంభుండు దృఢప్రారంభుం డగుచు నగణ్యపుణ్య మణిసాగరంబును దురితానిలాజగరంబునునైన కాశికానగరంబు ప్రవేశించి గృహమేధివేషంబున వసియించి క్రమక్రమంబున నంతట నావటించిన తనమహిమ విలోకించి సంతసించి యాత్మగతంబున. 2

మ. రతులన్ సీధురసంబుక్రోవు లగువార స్త్రీలకెమ్మోవులన్
మతినుప్పొంగుచుఁ గ్రోలివెన్నెలల నానందించి రేపాడి దీ
క్షితులై తాపసులై సదాజపితలై క్షీరోదకాహారులై
యతులై దంభత మోసపుచ్చుదురు మర్త్యశ్రేణి ధూర్తోత్తముల్ 3

చ. అనుచుఁ దలంచి దక్షిణదిశాభిముఖుండయి దంభుఁ డొక్కనిం
గనుఁగొని యాతఁ డెవ్వఁ డొకొ గర్వభరంబున ముందుకైవడిన్
బెనఁచి జగంబులెల్ల వడిమ్రింగెడులాగున వాక్యలీల భ
ర్త్సన మొనరించుచందమునఁ బ్రాజ్ఞత నొప్పెడిరీతి నొప్పుచున్. 4

క. వారణసి దాఁటి యచటికిఁ
జేరఁగఁ జనుదెంచె నితనిచే దక్షిణరా

ధారాష్ట్రిగతుఁ డగు నహం
కారుని వృత్తాంత మెఱుఁగఁగావలె ననినన్. 5

ఉ. ఆయరుదెంచువాఁడును మహామికన్ జగమెల్లఁ బామర
ప్రాయము గాదె లేదు గురుభట్టుఁత శ్రవణంబు తర్కమున్
న్యాయము వ్యాససూత్రములయర్థముఁ జూచిన బత్తి దోఁప లే
దేయెడ మర్త్యకీటకము లేగతిఁ గాంతురు సూక్ష్మవస్తువున్. 6

సీ. ఆహహా! ద్వైతాద్వైతపదవిలోఁ బడు నీత్రి
దండులఁ జూడఁ బాతకము గాదె
యర్థంబు తెలియక యఱచెద రవధాను
లూరక వేదాలు నోరికొలఁది
పాషండు లీశైవపాశుపతాదుల
య్యో! దురభ్యస్తాక్షపాదమతులు
భుక్తిగానక వృథాభోడులై సన్న్యాసు
లకట! దాల్చెదరు వేదాంత మెల్ల

గీ. నౌనె ప్రత్యక్షముఖ్య ప్రమైకసిద్ధ
బహువిరుద్ధార్థములు చెప్పఁ బాలుపడిన
యట్టివేదాంతమే శాస్త్రమయ్యె నేని
బౌద్ధమత మది చేసినపాప మేమి? 7

ఉ. పీరలు గంగలోఁ బులినవేదులమీఁద బ్రుసీనివిష్టులై
నోరు వృథా మెదల్చుచుఁ గనుంగవ మోడ్చెద నక్షమాలికల్
సారెకుఁ ద్రిప్పుచుం గుశలు సంబెళలోపలి దేవపూజలున్
దారును దాంభికుల్ జనధనంబు హరించెద రద్భుతంబుగన్. 8

వ. అని యిట్లుదూషింపుచుం జని చని యెదుర వెదురుదండంబుల నాఱఁగ
ట్టిన దట్టంపు నీర్కావిదోవతులవలనను, ధూమ శ్యామలితవ్యోమసీమం
బులగు హోమధూమంబుల వలనను నాదకాదకుఁ బచరించిన కృష్ణాజిన

దృషదుపలచషాలకో లూఖల ముసలంబులవలనను. బలిహరణ సమయంబున సందడించు నతిథిబృందంబులవలనను మనోహరంబగు నొక్క గృహమేధిమందిరంబు గనుంగొని యందు రెండుమూఁడు దినంబులు నిలిచెదనని తద్గృహంబు ప్రవేశించి యందు. 9

మ. నుదుట న్మక్కునఁ జెక్కులన్ జుబుకమందున్ గండపృష్ఠంబులన్
బెదవిన్ బొమ్మనఁగుక్షి నూరువుల మృద్బిందు ప్రకాశింప ద
ర్భదళంబుల్ శిఖలోపలం గటితటిన్ బాణిద్వయిన్ మించఁగా
నిదెపో దంభము మూర్తి దాల్చెననఁగా నీయయ్య చూపట్టెడున్. 10

సీ. అనుచు మెల్లనచేరి యాశీర్వదింపంగ
దంభుఁ డహంకారతను నదల్చి
తనశిష్యుఁ జూడ నాతఁడును సన్నయెఱింగి
బ్రాహ్మణాః యేతదాశ్రమపదంబు
ధూళికాళులతోడ నేల చొత్తెంచితి
వనిన నయ్యతిథియుఁ గినుక పుట్టి
యాసనార్ఘ్యాదుల నతిథులఁ బూజింపు
దురు కోపము గృహస్థు లెఱుఁగ రకట

గీ. యనిన దంభునిహస్త సంజ్ఞాను మతిని
శిష్యుఁ డోవిప్రః మీకులశీలవర్త
నంబు లారాధ్యు లడుగుచున్నారు మీరు
దూరదేశాగతులు గానదూరనేల.

ఉ. నావుడుఁ దద్ద్విజుం డహహః నాదగుశీలము వర్తనంబునున్
బావనముల్ కులంబునను బాగుపవిత్రను గౌడదేశరా
ఢావరపట్టణంబునఁ గడాని మదీయగృహంబు తంత్రిధా
త్రీవినుతుండు తత్సుతులు శ్రేష్ఠులు నే నధికుండ వారిలోన్. 12

క. అనవుడు శిష్యుఁడు దంభుని
యనుమతిఁ దాత్రపంపుగిండి నంబువులిడఁ గై

కొని యతఁడు పాదశౌచం
బును నాచమనంబుఁ జేసి ముందటి కరుగన్. 13

గీ. కోప ముదయింపఁగా బండ్లుకొఱుకు కొనుచు
దంభుఁ డిస్సిస్సి! పైగాలి పగిలి నీదు
చెమటబిందులు మామీఁదఁ జిలుకకుండ
నోయివిప్రుండ! యెడగల్గ నుండు మనిన 14

క. అతిథియు నీబ్రాహ్మణ్యము
క్షితిలోఁగడుఁగ్రొత్తయనిన శిష్యుండును నీ
కృతకృత్యునిమహాత్మ్యం
బితరులకుం గలుగకుండు టెన్నఁడు వినవే. 15

క. రాజులు నీతనిపాదాం
భోజంబులు ముట్టవెఱచి పొనపొన దవులన్
రాజితమకుటమణిచ్ఛవి
రాజుల నీరాజనంబు రచియింతురనన్. 16

ఆ. వె. విప్రుఁడాత్మలోన వికలుఁడై యీదేశ
ములజనంబు డాంబికులకుఁ గాని
భ్రమియ రనుచుఁ దలఁచి పరిసరదర్భపీ
ఠమునఁ గూరుచుండ డాయ వటువు. 17

క. మాయారాధ్యస్వాముల
దీయాసన మెక్కఁ బోల దితరుల కనినన్
నాయట్టికులశ్రేష్ఠున
కీయాసన మెక్కఁ బోలదే వెడవడుగా! 18

చ వినుము! మదీయమాత జనవిశ్రుతవంశజ యంతకంటె మ
ద్వనిత కులస్థురా లగుటఁ దంద్రికి నేనధికుండ నట్టి నా

యను(గువధూటితమ్మునికి నల్లునికూ(తురు లేనినింద( బొం
దిన( బ్రియభార్య మానితి వినిందితబాంధవగంధసంగతిన్ 19

క. నా విని దంభు(డు నవ్వుచు
నా విప్రుని( జూచి నీమహత్త్వమె పొగడే
పీ వింక మత్ర్పభావం
బీ వెఱు(గవుగాక విన్న నిందుల తరమే 20

మత్తకోకిల. ఏను మున్నొకనా(డు పద్మజునింటి కేగిన( గొల్వులో
మౌనులెల్లను లేచిరప్పుడు మమ్ము( జూచి పితామహుం
డాన వెట్టి ప్రియంబు( జెప్పుచు నంబుగోమయమార్జితం
బైన యట్టినిజోరుపీఠికయందు నిల్పె(డె నావుడున్. 21

శా. ఓరీ డాంబిక! యెంతపట్టెదవు గర్వో ద్రేకివై యింద్రు(డున్
నీరేజాసను(డున్ మునీశ్వరులు నా నీకెంత దౌ డ్డీసునా
నీరు ల్లక్షలు వేలు బ్రహ్మలు మునిశ్రేణుల్ పరార్థాధికుల్
పోరా! నే నెఱు(గంగ నాతపముపెంపుల్ చూడ నింతింతటే. 22

క. అనవుడు దంభు( డహంకా
రునిగా నాతని నెఱింగి మ్రొక్కుచు నే నీ
మనుమ(డ లోభునితనయు(డ
నని చెప్పిన( దెలియ విని యహంకారుండున్. 23

వ. ఆ దంభుని పరిరంభణంబు గావించి యోవత్సా! నీతలిదండ్రులైన తృష్ణా లోభు లెచ్చట నున్నవారనిన( బితామహునితో వారింబాసి నే నొక్కక్షణంబయిన నోరువంజాలుదునే. వారును నేనును నిచ్చటనే యున్నవారము.మీ రిచ్చటికి విచ్చేసిన కారణం బానతీవలయుననిన నహంకారుండు మనుమనిం జూచి వినుము! మనయేలికయైన మహామోహునకు వివేకుని వలనం గా(గల మహోపద్రవంబు( బరిహరించుటకై వచ్చితి. మహామో

హుండును వివేకునిం బరాజితుఁ జేసి యీవారణాసియే రాజధానిగా రాజ్యంబుచేయవలయునని చిత్తంబునంగలదు గావున నేట రేపటలోన నింద్రలోకంబునుండి యిచ్చటికి విచ్చేయు ననువార్త వినంబడుచున్నది యనిన దంభుండు విద్యాప్రబోధజన్మభూమియు, నిరత్యయంబునునైన యీ కాశికానగరంబు దండ చేసికొని వివేకుండు కులోచ్ఛేదంబు గావింపఁ గాచుకొని యున్నవాఁడు. దీనికిఁ బ్రతికారం బతిదుర్ఘటం బదియెట్లంటేని. 24

క. పరమజ్ఞానం బెఱుఁగని
నరులకు నీ వారణాసినగరిని విశ్వే
శ్వరుఁ డంత్యకాలమున సు
స్థిరకరుణం దారకోపదేశము చేయున్. 25

క. ఐనను గామక్రోధా
ధీనుల కదిదొరక దిచట దృఢనియతవచో
మానసకరపదములు గల
ధీనిధులకుఁ గాక కలవె తీర్థఫలంబుల్. 26

క. అనుచు నహంకారుఁడు దం
భునితో మాటాడు సమయమునఁ గ్రందుకొనన్
వినువీథిని వినవచ్చెను
ఘననిస్సాణాదివాద్య కలకలమంతన్. 27

సీ. కలయంగఁ గస్తూరి కలయంపి చల్లిరి
వినుకాంత మాణిక్య వేదికలను
యంత్రమార్గము లెల్ల ననువుగాఁ దీర్చిరి
ధారాగృహాంతరాంతరములందు
నవరత్నమయతోరణంబులు గట్టిరి
వారక గోపురద్వారములను
మెఱుఁగారుమేడలమీఁద నిల్చిరి పురం
దరధనుర్ధామచిత్రధ్వజములు

గీ. సౌవిదల్లానుమతి బౌరజనము లిట్లు
సంభ్రమమునొంద నిజకులస్వామి మోహ
నృపతి యేతెంచె నం చెదురేగి కనిరి
యా యహంకార దంభలోభాదిహితులు. 28

క. మోహుం డతివైభవమున
సాహో యని కటికవారు సందడి జడియం
గా హేమరత్న ఖచితమ
హాహర్మ్యము చొచ్చి యందు నాసీనుండై. 29

క అపు డతఁడు నగుచు సౌగత
క్షపణక పాషండ బౌద్ధ కపాలిక ము
ఖ్యపరీవారముతో ననుఁ
బ్రపంచ మిది యకట! మూర్ఖబహుళం బయ్యెన్. 30

క. తనువునకు నాత్మ వేఱఁట!
యనుభోగించునఁట! పిదప నాముష్మికమున్
వినుఁ డీదురాశ గగనా
వనిరుహపుష్పఫల భోగవాంఛన్ బోలెన్. 31

మ. కదుచోద్యం బిది పంచభూత పరిపాకప్రాప్తచైతన్య మీ
యొడలే యాత్మను సత్యవాదులఁట! యోహో నాస్తికుల్ దేహముం
బడఁగా నాత్మయు వేఱ యుండునని దబ్బర్లాడు వా రాస్తికుల్
పుడమిం బూజ్యులు నైనవారలఁట! యీ బొంకు ల్వినం బోలునే. 32

క. కరచరణాద్యవయవములు
సరియఁట! మరి వేరెవేరెజాతులు గలవా
ధరలో నకృత్యమందురు
పరదారధనాక్రమములు పౌరుషహీనుల్. 33

## చార్వాకమతము

వ. తమతమయుక్తిబలంబులఁ బదార్థభేదంబులు గల్పించి వావదూకులైనడ దుర్విదగ్ధులు సర్వజనంబుల మోసపుచ్చుచున్నవా రింతియ కాని మాకు నిది యెడంబడిక కాదు. తొడిఁబడం జెల్లుఁబడిగల వార లేమిచేసినం జెల్లియ పోవుఁగాక లోకంబులఁ గృత్యాకృత్యంబులు గలవనుట మిధ్య తథ్యంబు లోకాయతికంబె శాస్త్రంబు దండనీతియె విద్య. ప్రత్యక్షంబె ప్రమాణంబు, పృథివ్యప్తేజోవాయురాకాశంబులే తత్త్వంబులు. భూతంబులె ప్రేరకంబులు. చచ్చుటయే మోక్షంబుగాక పరలోకంబన నెక్కడియది. యిదియకదా వాచస్పతి చార్వాకున కుపదేశించె నతండును శిష్యప్రశిష్య పరంపరవలన జగంబునం దనమతంబు బహుళంబు చేయవలసి కురుక్షేత్రాది పుణ్య క్షేత్రంబులకుఁ జనినవాఁడు వాఁడును మనల మిచ్చుటకు వచ్చుట విని యింతకుఁ జనుదెంచు ననిపలుకు నవసరంబునఁ జార్వాకుండును సర్వ తీర్థంబులఁ జరియించి మహామోహుమహిమాక్రాంతంబైన కాశికానగరంబు ప్రవేశించి యందు నిజమతప్రకారంబు విలోకించి సంతసించి శిష్యునితోడ వత్సా ! ప్రత్యక్షాప్రత్యక్షఫల మూలంబైన కృషిగోరక్షణాదిసహిత దండ నీతియ మంచి విద్యయని యెఱుంగక కొందఱు మూఢులు మునిభండ నిశాచరప్రముఖ ధూర్తప్రలాపితంబైన వేదత్రయంబు చదువుదు రందు వృధాప్రయాసంబెకాని భుక్తిలేదు. పరలోకంబు మొదలికే లేదు. వేదోక్త ధర్మంబు లబద్ధంబు లగుట చెప్పెద వినుము. 34

క. క్రతువును గర్తయు ద్రవ్య
ప్రతతియుఁ జెడఁ దమకు స్వర్గఫలము గలుగునే?
వితతదవానలదగ్ధ
క్షితిరుహములవలన ఫలము చేరునకాదే. 35

గీ. చచ్చినట్టిజనుఁడు శ్రాద్ధంబుచేఁ దృప్తి
బొందు ననుట వినఁగఁ బొందుగాదు
తీరనారినట్టి దివియ మండునె భూమి
నెంతచమురు పోసిరేనిఁ బిదప. 36

క. నావుడు శిష్యుం డిట్లను
దేవా! యిట్లయ్యెనేని తృణపర్ణఫలాం
భోవాయు భోజనాదుల
నీవెఱ్ఱులు తీర్థవాసులేల కృశింపన్. 37

క. అనఁ జార్వాకుఁడు శిష్యునిఁ
గనుఁగొని యిట్లనియె ధూర్త కథితాగమముల్
విని మోసపోయి చెడు దు
ర్జను లాసాసలనె తనిసి భ్రమయుదురు సుమీ. 38

మ. కుజనుల్ వీరలు భిక్షుకత్వము లతిక్రూరాటవీవాటికా
భజనంబుల్ సతతోపవాసనియతుల్ పంచాగ్ని మధ్యస్థితుల్
భుజనిష్పీడిత బాహుమూలయుగళీభుగ్న స్తనాభోగనీ
రజనేత్రాపరిరంభసంభవసుఖారంభాంశముం బోలునే. 39

క. పరిమిశ్రిత దుఃఖం బని
నిరసింతురు విషయసుఖము నీరసబుద్ధుల్
ధర నుముకకుఁగా విడుతురె
సరిబియ్యమువచ్చు దీనసరిధాన్యంబున్. 40

క. అని వెలుపటఁ జార్వాకుఁడు
తన శిష్యునితోడఁ జెప్ప తద్వాక్యంబుల్
విని మోహుఁ డింతకాలం
బునకు న్వినఁగల్గె నమృతపుంజపుఁ బల్కుల్. 41

క. ఈమాడ్కిఁ జెవికినింపై
ప్రామాణికముద్ర గలిగి బహుళార్థముగా
నీమాటలు చార్వాకుని
వో మంచివటంచు నాత్మ నూహించుతఱిన్. 42

సీ. చార్వాకుఁడును మోహుసమ్ముఖంబున కేగి,
మ్రొక్కినఁ గుశలంబు చక్కనడిగి

యామోహుఁడును సమీపాసనంబున నున్నఁ
గూర్చుండి దేవ! నీకూర్మి కలుగు
బంట్రైనకలి నీకుఁ బదివేలదండాలు
పెట్టితి నని వినిపింపు మనియె
నతనికి లెస్సయె యయ్య! నీకృప గల్గ
నన్నియు లెస్సలౌ నతఁడు నింక

గీ. విశ్వమెల్లను ద్రిమ్మరి వివిధ పుణ్య
తీర్థములవెంట వేదశాస్త్రార్థకథలు
పొనుఁగుపడఁజేసి వైరుల ద్రోపడంచి
కాని దేవరపాదముల్ గాన రాఁడు. 43

క. తను నేలిన యేలిక పం
పినపని సాధించి జనులు మేలని పొగడన్
బునరాగతుఁడై యేలిక
తను మెచ్చఁగ మ్రొక్కుబంటు ధన్యుఁడు కాఁడే. 44

చ. అలవడ వేదమార్గము విరాకులవిత్తుగ సజ్జనాళి వి
చ్చలవిడిఁ జెంతలం దిరుగుజాడకుఁ దెచ్చితి మెల్లచోట్లన
క్కలియును నేను నీమహిమ కాకిది చూడఁగ మాప్రభావమే
తలఁపఁగ నెందు నేలికప్రతాపమె తేజముఁ దెచ్చు బంటుకున్ 45

గీ. స్వామి! యుత్తరపథికపాశ్చాత్యు లెల్ల
వేదములసుద్ది మొదలంట విడిచి రొక్క
చోట నెందైనఁ గలిగినఁ గూటికొఱక
కాని కాదని శాంత్యాదికారణములు. 46

క. యోగంబులు వేదంబులు
యాగంబులు నుదరపోషణార్థంబు లలో
ద్యోగవిహీనునకగు నని
యాగీష్పతి మున్ను తెలియ నానతి యీఁడే. 47

వ. కావునఁ గురుక్షేత్రంబున విద్యాప్రబోధచంద్రు లుదయింతురన్న సంది యంబు దేవరడెందంబునఁ గలలోనైన నిలుపవల దనిన మోహుండు తాదృశంబైన తీర్థంబు వ్యర్థంబుచేసి మదర్థంబు ప్రయాసపడితిరని సంత సించినఁ జార్వాకుండు దేవా! యింక నొక్కవిన్నపంబు విన్నవింపం గలదు. మహాప్రభావయగు యోగినియొర్తు కలిచేత విశకలిత ప్రచార యయ్యె నైనను దదనుగృహీతులైన వారల మాకుఁదేఱిచూడ నశక్యంబు దానికిఁ బ్రతివిధానంబు దేవరచేతంగాని కాదనిన మహామోహుం డాత్మగ తంబునఁ గొండొకసేపు చింతించి యామహాయోగిని విష్ణుభక్తి యదిసదా మాతోడి కొఱకొఱ మానదు కటకటా! దాని నెన్నఁడును సాధింప లేక పోయితిమని తలంచి యాచార్వాకుని విలోకించి కామక్రోధాదులముందఱ దీనిపని యేమి యున్న యది యొక్కటి కొంచెపుఁ బగఱనైన నుపేక్షిం పక హెచ్చరిక గలిగి శీఘ్రంబ త్రుంపవలయుఁ గాలంబునఁ ద్రుంచ కుండఁ బోవిడుచుట కొఱగాదు వినుము. 48

క. అఱకాలున విఱిగినములు
కుఱుచైనను బిదపఁ జీము కూరిచెడుగతిన్
దఱిఁ జెఱుపమిఁ గొంచెపుఁబగ
కఱకరి నరికట్టి పిదపఁ గడునొప్పించున్. 49

క. అని కామక్రోధాదుల
గనుఁగొని యావిష్ణుభక్తి గడుపిల్లది దా
నిని మీరు సావధానం
బున గెలువఁగ వలయు ననుచు బోధింపంగన్. 50

క. ఆలోన బత్రహస్తుఁడు
కాలరివాఁ డొకఁడు మోహుఁగని సాగరతీ
రాలయ పురుషోత్తమదే
వాలయనిలయమదమాదు లనిపిరి నన్నున్. 51

గీ. అనుచు మనవిపత్ర మర్పింపఁ దత్పత్ర
మునకు నిడిన లక్కముద్రఁ జూచి

యిందువలన నొప్పమేదైన వినవలె
ననుచుఁ దానె చదువుకొనియె నిట్లు. 52

సీ. శ్రీమతు వారణాసి మహాపట్టణ
స్వామి రాజాధిరాజ పరమేశ్వ
రుఁడు మహామహేశ్వరుని దివ్యపాదప
ద్మంబులకును మానమదులు సద్వి
నయభక్తిదండ ప్రణామంబు భక్తిఁగా
వించి చేయంగల విన్నపంబు
తనతల్లిశ్రద్ధయుఁ దాను శాంతి వివేక
భర్తకు నుపనిషద్భామినికిని

గీ. నడుపుచున్నది దౌత్యంబు విడువకెపుడు
కామసఖుఁడైన ధర్ముండుఁ గలయ మాట
లాడె వైరాగ్యముఖ్యులతోడ నిది
బుద్ధి తప్పదు దేవరపాదమాన. 53

క. అని చదువుకొనుచు మిక్కిలి
కినలి మహామోహుఁ డాత్మఁ గటకట! లోకం
బున శాంతికి వెఱతురే త
జ్జననంబే మొదల లేదు సంశయమేలా. 54

మ. నియతాత్ముండు విరించి భారతికి నెంతే చిక్కె. దక్షాధ్వర
క్షయకారీశుఁడు గౌరికౌఁగిటను జొక్కెన్ వార్ధిలోఁ గైటభా
రియ లక్ష్మీయువతికపోల మకరీ రేఖాంకితోరఃస్థ లుం
డయి తక్కెన్ మఱి యున్నజంతువుల కాహా! శాంతి సిద్ధించునే? 55

గీ. అనుచు విశ్వాసియగు ధర్మ నణఁగ నీవు
పట్టి బంధించుమని కాముఁ బంపువెట్టి
క్రోధలోభులు మీరును గూడి శాంతి
గొట్టివైవుండు పొందనఁ గ్రోధుఁ డనియెను. 56

శా. దేవా! నా కెదురే తలంప హరిభక్తిశ్రద్ధలున్ శాంతియున్
గావే లోకము లంధముల్ బధిరితుల్ గారే మహాధీరులున్
జీవుల్ చేతనఁ బాయరే విడువరే నిష్ఠల్ మునుల్ తప్పరే
ధీవైదగ్ధ్యము కోవిదుల్ పొదువు నాతీవ్రప్రభావంబునన్. 57

క. కానఁడు కృత్యాకృత్యము
వీనుల హితభాషణములు వినఁ డభ్యస్తం
బైనట్టివిద్య మఱచును
మానవుఁ డెటువంటివాఁడు మత్సంగతుఁడై. 58

క. నావుడు లోభుం డిట్లను
నావలనం గల్గుకామనా ఘోరనదుల్
జీవులు తరింప నోపినఁ
గా వెనుకం గల్గు శాంతికథ యెట్లనినన్. 59

ఉ. మానసవేగవాహములు మత్తగజంబులు నిన్ని యున్న విం
కా నొకకొన్ని కూర్పవలెఁ గల్గె ధనంబది తొల్లి యిప్పుడున్
మానక వచ్చుచున్నది క్రమంబున మీఁద గడింతు నంచు నా
శానిధులైన యయ్యలకు శాంతి ఘటించునె యన్నఁ గ్రోధుఁడున్. 60

వ. మహామోహేశ్వరుం గనుంగొని నిజప్రభావంబు తేటపడ నిట్లనియె. 61

మ. తునిమెన్ శక్రుఁడు త్వష్టకూర్మి సుతు వృత్రున్ బ్రహ్మమూర్ధంబుఁ ద్రుం
చె నుమాభర్త, వసిష్ఠపుత్రుల వధించెన్ గాధిసూనుండు నా
యనుభావం బడరన్ సమర్థమగుఁ గార్యాచార విద్యాయశో
వినయౌన్నత్య విభూషితాన్వయములన్ వేవేగ ఖండింపఁగన్. 62

క. అంతట లోభుఁడు తనకుల
కాంతం దృష్ణఁ గని స్వామికార్యవిఘాతా

త్యంతప్రయత్నయగునా
శాంతిన్ మడియింప నీవ చాలుదు వరయన్. 63

సీ. పుడమిలో మాన్యంపుమడి కొంత గలవాఁడు
గ్రామమెల్లను నేలఁగాఁ దలంచు
గ్రామ మేలెడువాఁడు కాంక్షించు గిరివన
స్థలజలదుర్గవద్రాజ్య మేల
రాజ్య మేలెడువాఁడు రాజ్యవైభవమున
హెచ్చితా నొకద్వీపమేలఁ గోరు
ద్వీప మేలెడువాఁడు తేజస్వియై మహీ
వలయ మెల్లను నేల వాంఛచేయు

గీ. నిట్లు కడలేనియాసాస లీనుచుండ
జనులు బ్రహ్మాండకోటులఁ దనివినొంద
రనిన శాంతికిఁ గాలూఁదనైనఁ గలదె
యెడము మదిఁ దృష్ణ నీవింత వెడలితేని. 64

క. నావుడుఁ దృష్ణయు లోభుని
నీఢానతియిచ్చినట్టు నిక్కము బ్రహ్మాం
డావలులకోటు లైనను
నావిపులోదరము నిండునా యనునంతన్. 65

క. క్రోధుఁడు హింసను గని దు
స్సాధాటోపమున మల్లచఱుచుచు వినుమా
యోధర్మపత్ని! నీవను
సాధనమున నెట్టివారిఁ జంపుదుఁ గొంచన్. 66

మ. పడఁతీ! తల్లిని దండ్రిఁ జంపుట తృణప్రాయంబు తోఁబుట్టులన్
మడియంజూచుట లెక్కగాదనిన జన్మజ్ఞాతికేటంబులన్
గెడపంబూనుట నాకు దొడ్డె గుడి భ్రమింగేవానికిం దల్పుల
ప్పడముల్గావునఁ బిల్లపిల్లతరమున్ భక్షింతు దాయాదులన్. 67

ఆ.వె జ్ఞాతికులమునూర్చి నూతఁబోయక నాదు
దెంద మించుకైన డిందుపడదు
కాన రాదు గాని లోన కుమారిలు
చున్న దిపుడు రోషహుతవహంబు. 68

వ. అని యిట్లు బహుప్రకారంబులఁ బంతంబులాడు హింసాక్రోధులఁ దృష్ణాలోభుల విలోకించి మహామోహుండు మీరు నలుగురుం గలిగినఫలంబు చాలదినాలనుండియు మనతోడఁ బోరాట గొన్నశ్రద్ధాతనూజ శాంతి యనుకుంటెనక త్తెం దుత్తుమురు చేయుండని పనిచి యాత్మగతంబున శాంతి యత్యంతమాతృవత్సల గావునఁ దదీయజననియగు శ్రద్ధను బద్ధురాలిం జేసి పట్టితెచ్చినం జాలు శాంతి మాతృవియోగదుఃఖాతిశయంబునఁ దను దానె కృశియించి నశియించి నడియ మంచియుపాయంబు శ్రద్ధం బట్టి తేనోపునది నాస్తికతయని తలంచి కెళవుల నున్న విభ్రమావతి యను దానింజూచి నీచెలికత్తియ నాస్తికతావిలాసినిం దోడితెమ్మనిన నదియునుం జని నాస్తికతా వనితతోడ నీ వృత్తాంతంబు చెప్పిన విని యమ్ముగ్ధా దృష్టి నెచ్చెలీ! పెక్కు దివసంబులనుండి రాజసమ్ముఖంబునకు వచ్చుట లేదు నన్ను ఱేడింక నేమని దూఱెడునో కదా యనిన విభ్రమావతి నాస్తికతా! నిన్ను రెండుకన్నులం గన్నమాత్రంబున మహామోహుండు తన్నుఁదా నెఱుంగకయుండుం గాక యతఁ డిఁక నిన్ను దూఱునే నీమహిమ నీవెఱుంగ వింతియ యోకలకంఠీ! నీకన్నుల నిదురదేరుట కారణంబు చెప్పుమనిన నేకవల్లభలైన పల్లవాధరలు సహితము నిదురగానరు బహువల్లభనైన నాకు నిదురగలదే బహువల్లభ నెట్లైతినంటేని మొదల మహామోహుండు ననుపు విటుండు. కామక్రోధలోభులు మచ్చిక బొజుంగులు, విభ్రమావతి! వీరలు నలువురేయని చెప్పనేల యిక్కాలంబునం గల మగవారలలోనం జిన్నపెద్ద యనక యందఱం గలయఁ గైకొందు ననిన విభ్రమావతి నకియా! కామునకు రతియును గ్రోధునకు హింసయు లోభునకుఁ దృష్ణయుఁ బ్రాణనాయికలు వీరలకును జిడిముడిక లేకుండుట చోద్యంబనిన వారికి నాకుఁ బాయరానిపోరామి గావున నసూయ బడతనినఁ గామినులలోన నీవంటి సౌభాగ్యంబు గలయది భువనత్రయం

బున లేదు సవతులు సైతము నిచ్చల మచ్చరింపక నిచ్చలుం బొరపొచ్చెము లేనిమచ్చికలం గూడిమాడి యున్నవారు నీవిప్పుడీ నిదురదేరు కన్నుల చిన్నెలతోడి చెన్నుల మోవికెంపుల మేనిసొంపుల నరవిరిబాగున్నై వెడవెడ నందియలు మొరయ నెడనెడ నడుగులు తడఁబడ నడుచుతీరు గనుంగొని మహామోహుండు మానసంబున ననుమానపడునో యని శంకించెదననిన మిథ్యాదృష్టి విభ్రమావతిం గనుంగొని. 69

క. పురుషుల మదులనె తిరిగెడు
తరుణులుఁ దమమగలమనసు తమ చూపులనే
కరఁగింప నోపుసతులును
నరయఁగ నెట్టున్న వేమి యని డగ్గఱఁగన్. 70

సీ. మొరయు మేఖలతోడి గురునితంబభరంబు
మందయానమునకు నంద మొసఁగఁ
జెదరు క్రొమ్ముడివిరుల్ చెరువుకోఁ జనుఁగ్రేవఁ
బ్రబ్బి నఖాంకముల్ బయలఁబడఁగఁ
గలువదండలఁ బోలుగలికిచూపుల సోయ
గంబున మనసు చీకట్లు కొలుప
లీల నల్లన వీచుకేలుఁదమ్ములరత్న
కంకణంబులు గల్లుగల్లు మనఁగ

గీ. వచ్చెఁబో యిదె నాప్రాణవల్లభ యని
తన్నుఁ గనుఁగొనుమోహుపాదముల కెరఁగి
సిగ్గులేనవ్వువెన్నెలఁ జిన్న మోము
చెంగలింపంగ నున్న నాస్తికతఁ జూచి. 71

క. వలుదకుచంబుల నఖములు
నలియఁగ ననుఁ గౌఁగిలించి నాతొడమీఁదన్
జెలువా! కూర్చుండుము నే
నెలమి వహించెద నుమామహేశ్వరు లీలన్. 72

గీ. అనుఁచు బల్కు మోహు నానా స్త్రికళేబరమును
గదిసి సిగ్గుతోడఁ గౌఁగిలించి
నపుడు మోహుఁడును తదాలింగనస్పర్శ
సుఖ విశేషములకుఁ జొక్కి చొక్కి.

క. నిను మునిగూడినరహి నా
మనసున రెట్టించె నిపుడు మగువా! యెలజ
వ్వనము మగుడ నొసఁగు రసా
యనమౌ నీకూట మనిన నగి యిట్లనియెన్. 74

క. రాణించిన నీకౌఁగిట
బ్రాణేశ్వర! నాకు మగుడఁ బ్రాయము వచ్చెన్
జాణ లగువారి కూర్మికి
గాణు గలుగ నేర దెంతకాలంబునకున్ 75

క స్వామీ! నను నేమిటికై
ప్రేమముతోఁ దలఁప నవధరించితి రనినన్
గాముకుఁడు మోహుఁ డాగజ
గామినితో ననియె వలపు గానఁబడంగన్. 76

క. తలఁపుదురు మనసు వెలుపలి
జలజాక్షులఁ బతులు నీవు సతతంబును నా
తలఁ పనెడిభిత్తిప్రతిమయు
బలె నుండఁగ వలెనె వేరె పనివడి దలఁపన్. 77

వ. అనిన మహాప్రపాదం బని వినయావనతవదన యైన మిథ్యాదృష్టిం జూచి మహామోహుండు నఖరశిఖరంబులం జకురనికరబులు దువ్వుచు వింటివా మచ్చెకంటీ యిటువంటిక్రొత్తలు కుంటెనకత్తెయైన శ్రద్ధ యనుతొత్తు కూఁతు రుపనిషత్తురుణిని వివేకునితో హత్తింప నెత్తుకొన్నయది మున్న యది మనలకుఁ బ్రతికూల గావునఁ దలపట్టి తివిచి తెచ్చి యారండను బాషండుల కొప్పించు మనిన దేవర! సేవకురాలి కివ్విధంబునఁ బ్రియంబుఁ

జెప్ప నేటికి మాత్రంబున నీపని చేయనే నాకు నదియెంతదొడ్డు మంచి దానం బలె బోధించి శ్రద్ధ పనియెల్ల నబద్ధంబు చేసెద నని పంతంబులు పలుకుచున్న మిథ్యాదృష్టికరంబు నిజకరంబున నవలంబించి మహా మోహుం డంతఃపురంబునకు దోడ్కొని చని బహుప్రకారంబుల నుపలాలించిన. 78

శా. మహాత్మ్య కనివాస వాసవగపీమందార చింతామణీ
నీహారద్యుతిదానవైభవ భవానీశంకరారాధనా
సాహిత్యస్థిరచిత్త చిత్తజవిలాసశ్రీపరీహాస స
న్నాహత్యాంగరుచీ తరంగవిహరన్నారీదృగంభశ్చరా. 79

క. నీతియుగంధర ! సుకవి
వ్రాతప్రస్తుతయశోధురంధర ! సుగుణ
ప్రోత ప్రతాపమణి సం
ఘాతాలంకృత దిగంతకాంతాతిలకా ! 80

ఉత్సాహ. రసికశేఖరాగ్రగణ్య ! రసవదుక్తి నైపుణా !
ప్రసవవాసనావిశేషపరిమళాకృతప్రథీ
విసరహృత్కరండషండ వినుతభోగిమండలా !
పెసరువాయవంశ వార్ధిబిసరుహారిమండల ! 81

గద్య. ఇదిశ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వతాభి
నంది నంది సింగయామాత్యపుత్ర మల్లయమనీషి
తల్లజ మలయమారుతాభిధాన ఘంటానా
గయప్రధావ తనయ సింగయకవి పుంగవ
ప్రణీతంబైనప్రబోధచంద్రోదయం బను
మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

—o—

# ప్రబోధ చంద్రోదయము

## తృతీయాశ్వాసము

క. శ్రీవాణీనాయకసమ
భావజ్ఞ సతీసమూహభావభవ యశో
భావి మలీకృతపూర్ణ
గ్లావంశ యనంతిమంత్రికమలజగంగా 1

వ. అవధరింపు మిట్లు మహామోహునిపనుపున మిథ్యాదృష్టి క్రమక్రమంబున శ్రద్ధతోడం జెలిమి చేసి తొడలపైనిం బెట్టి తేలింపుచు లేనిధర్మ మోక్షంబులు కల్పించి శాస్త్రంపుఁబల్లఱపులు శరీరసుఖంబులకుం జెఱపనచేటలు గాని నిజంబులు కావనియును మోక్షంబు గలిగెనేని యది విషయానంద విముక్తంబు గావునఁ గొఱగాదనియును జెవి నిల్లు కట్టుకొని చెప్పి వేద మార్గోపనిషత్తులతోడ శ్రద్ధను విరుద్ధపఱిచి చెవియుం జెక్కు నెఱుంగకుండ వేదబాహ్యపాషండ వశంవదం జేసెఁ దమతల్లింగానక శాంతి విశ్రాంతి నొంది విలపించుచు. 2

సీ. ఏఁజెంత బోధించెనే నిన్ను నా తల్లి
కాన! పాషండసంగతుల మెలఁగ
నేబోడి గావించెనే యింతవిరిపోటు
తల్లి! నీ కుపనిషత్తురుణితోడ
నేముండ యెడఁబాపెనే నిన్నుఁ దల్లి! మా
మీఁద హత్తినకూరిమియును గృపయు
నేరండ భ్రమయించెనే నిన్నుఁ దల్లి! ధ
ర్మంబు మోక్షం బబద్ధంబు లనుచు

గీ. నంచు దుఃఖించుఁ గన్నీరు నించు దిశలు
గలయ వీక్షించుఁ గానక కళవళించు
నించుకించుక గష్టనించుఁ జంచలించుఁ
దల్లి దొఱఁగుడు వేయి చందముల మఱియుఁ. 3

సీ. మృగములు తమలోన పదలేక మెలఁగఋ
ష్యాశ్రమవనము లుద్యానములుఁగఁ
బావననదులు సంభవ మైనకులధరా
ధరములు కేళిసౌధములు గాఁగఁ
గలుషహరంబులై కనుపట్టుపుణ్య తీ
ర్థములు విహారస్థలములు గాఁగ
నిరవద్యబహుతపోనిష్ఠగరిష్ఠులు
వైఖానసులు బంధువర్గములుగ

గీ. మనెడునీవింకఁ జండాలమందిరమున
దవులఁ బడియున్న కపిలధేనువును బోలి
యకట యేరీతి బ్రతికెదవమ్మ వేద
బాహ్యపాషండహస్త సంప్రాప్తవగుచు. 4

క. కుడువవుగా నేఁ బొత్తుచుఁ
గుడువక నేఁ బ్రక్కలేక కూర్కవుగా యే
యెడ నన్నుఁ బాసి నీవర
గడియయు నిలువంగలేవుగా యోజననీ ! 5

క. అని శాంతి ప్రలాపించుచుఁ
దననెచ్చెలిఁ గరుణఁ జూచి తథ్యం బిఁక మ
జ్జననియు నింతక తీఱును
జనియెద నే నగ్నిఁ జొచ్చి జననిం గూడన్. 6

శా. వేవేగన్ సొద పేర్చవే యనిన నావిర్భూతభాష్పాంబుధా
రావిప్లావితవక్త్రియై కరుణ నాప్రాణంబు లెట్టుండునే

నీవీలాగున దుస్సహప్రళయవహ్నిక్రూరవాక్యంబులన్
నావీనుల్ చుఱుచూర్లు చూఁడఁగ మదిం ధైర్యంబు గీలింపవే ? 7

చ. మొదలనె ముద్దరా లగుట మోహభయంబునఁ జేసి శ్రద్ధ యే
నది దరిఁ బుణ్యతాపసవనంబులలోపల దాఁగియున్నదో
వెదకుద మంతదాఁక గరవేదనమాను మటన్న శాంతియున్
బెదవులు వేఁడియూరుపుల బీఁటలు వాఱఁగ గద్గదోక్తులన్. 8

మ. చెలియా యింతకు మున్ను మౌనివిసరక్షిప్తోచ్ఛషష్ఠాంశసం
కులనానాతటినీ విశాలపులిన క్షోణీసమీపంబు లు
జ్జ్వల స్రుగ్దర్భసమిచ్చషాల చమసవ్యాప్తాధ్వరాగారముల్
గలయం జూచితిఁదల్లి నేకడ వినం గానంగ లే నక్కటా 9

గీ. అనిన శాంతివంక గనుఁగొని కరుణ యి
ట్లనియె నట్టిపుణ్య మైనశ్రద్ధ
కిట్టిహాని యెట్లు పుట్టెనే యన శాంతి
వినుము గడువరాదు విధికృతంబు 10

సీ. చాపచుట్టఁగఁ జుట్టి చంకఁ బెట్టుకపోఁడె
ధరణి హిరణ్యాక్షదానవుండు
వేదత్రయాకాంత వెసఁ ముచ్చిలింపఁడె
చూఱపట్టినయట్లు సోమకుండు
సాక్షాన్మహాలక్ష్మి జనకభూపాలనం
దనఁ జెఱపట్టఁడే దశముఖుండు
కొసరక యమ్మదాలసఁ గొనిపోఁడె పా
తాళకేతుఁ డను నక్తంచరుండు

గీ. గాన నింతేసివారముగా యనంగ
రాదుపో యెట్టిపుణ్యవర్తనుని కైన

సహజవక్రంబు గాన సజ్జనుల మేలు
చూడఁజాలకవిధి తప్పుజూచెనేని. 11

## జైనమతము

వ. అవి యట్లుండనిమ్ము కరుణా! మదీయజననిం బాషండసదనంబుల వెదకుదము గాని పదమనుచుఁ గతిపయపదంబుల ముందటఁ గరుణ యొక వికృతవేషునింగని బెగడి శాంతిం బేర్కొని యోయక్క! రక్కసుం డిక్కడికి నెక్కడనుండి వచ్చెనో యనిన శాంతియుం జెలికత్తె వెఱపు దెలుపుచుం దలయెత్తి చూచి గళన్మలపంకపిచ్ఛిల బీభత్సదేహంబున దొన దొన ముసురునీఁగలం జేతినెమలిపురికుంచెంగొని చోపుకొనుచుం గేశోల్లుంఛనంబునం బరపురమను బోడితల నిమురుకొనుచు దిసమొలయుం దానును జూడ నిస్సిస్సియై వచ్చువీఁడు పిశాచంబు గాని రక్కసుండు గాఁడనినం గరుణ యిట్టిపట్టపగలు పిశాచంబు లెట్టు పొడకట్టవచ్చునే యిప్పుడు నరకకూపంబు వెలువడి వచ్చుమహానరకస్థుండు కాఁబోలుఁ గాక యని శాంతి చింతించి యౌ నెఱింగితి నెఱిఁగితి వీఁడు మహామోహు పంపునం జనుదెంచు జైనదిగంబర సిద్ధాంతుండు వీనిం జూడఁ గూడదని పెడమొగంబై నడచినం గరుణ నెచ్చెలీ! నిలునిలు మిచ్చట శ్రద్ధం బరికింత మనుచు వారలిద్దరు నిలిచి రప్పు డాదిగంబర సిద్ధాంతుం డప్పటికి "నమోర్హతే" "నమోర్హతే" యనుచు శ్రావకులం బేర్కొని. 12

క. తొమ్మిదిగవనులు గల్గు పు
రమ్మున సతతంబు నాత్మ భ్రాజిలుచుండున్
నె మ్మదిలో నిది యెఱిఁగినఁ
గ్ర మ్మన సిద్ధించు సౌఖ్యకైవల్యంబుల్. 13

క. మలమయపుంగల పిండము
కలజలధుల నీళ్ళనెల్లఁ గడిగినఁ దాని
ర్మల మగునే యాత్మ సదా
మలరహితము ఋషుల సేవ మఱవకుఁ డెపుడున్. 14

క. వినుఁడుః ఋషిసేవ దవులం
గని మ్రొక్కఁగ వలయు వారు కాంక్షించిన భో
జన మిడవలె వారలు దమ
వనితల రమియింప నీర్ష్య వలువదు చేయన్. 15

క. అని పలికి శ్రద్ధఁ దలచినఁ
జనుదెంచెను శ్రద్ధ వానిజాడను దోడై
దినమును నెప్పుడు శ్రావక
జనముల వెంబడిన నీవు చరియింపు మనన్. 16

ఉ. స్వామిః మహాప్రసాదమని శ్రద్ధయు శ్రావకసంగమంబునన్
బ్రేమ వహింప శాంతిగని భీతిలి యక్కటః యిట్టులయ్యె ని
చ్చో మముఁ గన్నతల్లి యని సౌమ్యసిలం గరుణావధూటి నీ
వేమిటి కింత చింతిలెదవే యిది "తామసి" యంచుఁ దెల్పినన్ 17

క. జౌ నౌ నెచ్చెలి నామదిఁ
బేనఁగొనెడు దురాశకతనఁ బేరొకటైనా
పీనుల సోఁకె నమంగళ
దీనికి మాతల్లిసవతు దిటచెడి పడితిన్. 18

గీ. అది యటుండనిమ్ము మదిలోన వనికితం
బించుకయును మాసె నిపుడు మనము
బౌద్ధమందిరముల శ్రద్ధఁ జూతమటంచుఁ
గరుణ శాంతిఁ గూడి తిరుగునపుడు. 19

క. పొదవును బోడియునై యిల
నడతాడిం బోలి కరమునం బుస్తకపుం
దడక ధరియించి కటిఁ జిం
పుడువల్కము దూల బుద్ధముని శిష్యునితోన్. 20

వ. మున్ను మహానుభావుండు సుగతుం డానతిచ్చిన వాగమృతంబులు పుస్త
కంబు విప్పిచెప్పెద వినుండు. పదార్థంబులన్నియు నిరాత్మకంబులు

ప్రతిక్షణక్షయశీలంబులు లోపలసత్తును వెలుపల నసత్తుననగుధీపరంపరల వలన నీభావంబులు తోఁచుచుండు. నిట్టిధీపరంపరయు వాసనారహితంబు గావున విషయానుభవ దోషంబులులేవు. భోగమోక్షంబులు గలయది సౌగతధర్మంబు తక్కిన ధర్మంబులఁబోలె వనవాసంబుల బ్రహ్మచర్యాది ప్రయాసంబులఁ గుందక మనోహరమందిరంబుల వసియింపుచు, మృదుల శయనంబుల శయనింపుచు, నచ్చపు వెన్నెలరేలు వృథపుచ్చక నిచ్చలు నిచ్చకు వేచ్చుమెచ్చుల కొమరు మచ్చెకంటులఁ బచ్చవిల్తులీలం దేలింపుచు సుఖియింపవచ్చు; ముక్తియుఁ బడయవచ్చు సర్వసంస్కారంబులు క్షణికంబులు నాత్మయస్థిరంబు గావున భిక్షుకులు తమదారల నాక్రమించిన నుపాసకులకు నీసడింపరాదు చిత్తమలం బగునీర్ష్య కొఱగాదు లోపల సుగతియు దుర్గతియు నాకు నిప్పుడు దివ్యదృష్టిఁ గానిపించి యున్నయవి యని పల్కి బౌద్ధశ్రద్ధ నాకర్షించి భిక్షుకుల నుపాసకుల నాలింగనంబు చేయు మనిన మహాప్రసాదంబనుచు నదియట్లుగావించిన శాంతి విలోకించి కరుణా! యిదియు నల్లప్పటి దిగంబరసిద్ధాంత శ్రద్ధంబోలిన తామసియ సుమీయని భయంబు దెల్పనవసరంబున జైనసిద్ధాంతుడు బౌద్ధసిద్ధాంతుం గనుఁగొని పేర్కొని యిట్లనియె. 21

మ.కో ఓరిభిక్షుక! చెప్పురా నిను నొక్క శాస్త్రరహస్యమే
జేరి వేఁడెదనన్న బౌద్ధుఁడు చిఱ్ఱుముఱ్ఱు మటంచు నో
రోరి జైనపిశాచ నగ్నుఁడ యోరిదుర్మలభాండ నీ
కూర కేటికి శాస్త్రగర్వము లోరి కాఱులు మానరా. 22

క. అని కోపించిన బౌద్ధుని
గనుఁగొని జైనుండు శాస్త్రకథ యడిగిననీ
కినుకేల యెరిఁగితేనియు
నొనరఁగ నావాక్యమునకు నుత్తర మీరా. 23

ఆ వె. క్షణవినాశి వౌదుగద నీవు మరి నీకు
నిట్టివ్రతము లెల్లఁ బట్టనేల

రెండింటికిని జెడిన రేవడవై వృథా
బోడవైతివెందుఁ గూడవైతి. 24

## బౌద్ధమతము

సీ. అనవుడు సౌగతుం డాజైనుఁ గనుఁగొని
యస్మదీయుం డెవ్వఁడైన నొకఁడు
క్షణికవిజ్ఞానవాసన గట్టి యగువాఁడు
ముక్తుఁడౌ నన నోరి మూర్ఖబుద్ధ
మంచి దొకానొక మన్వంతరమున మీ
వాఁడొక్కరుఁడు మోక్షవంతుఁడైన
నెఱయ బౌద్ధుండైన నిజమౌనె నీకథ
నీకు నీధర్మంబు నేర్పినట్టి

గీ. యొజ్జ యెవ్వఁడురా యన నోరి జైనః
వినుము సర్వజ్ఞుఁ డగుబుద్ధమునివరుండు
మాకు నానతి యిచ్చె నీమతరహస్య
మనిన బుద్ధుఁడు సర్వజ్ఞుఁ డగుటయెట్లు? 25

క. క్షపణకః చెప్పెద వినురా
యపగతసంశయ మగుం దదాగమమే బు
ద్ధపతికి సర్వజ్ఞత్వం
బపరిమిత మటంచుఁ దెలుపు ననజైనుండున్. 26

గీ. అవురః యాతని యఱపులె యతనిమహిమఁ
దెలిపెనే నేను సర్వంబుఁ దెలిసినాఁడ
నాకు ముయ్యేడుతరములనాటనుండి
లెంక పీవన బౌద్ధుఁ డహంకరించి. 27

ఉ. పంచమలానులిప్తజినఖండః మహీనరకస్వరూపః న
న్నెంచక నీకు లెంక నని యేటికిఁ బ్రేలెద వన్న జైనుఁడున్

గొంచక యోరి సౌగతుఁడ!కోయిలతొత్తులమారికాన మా
మంచిమతంబుఁ గైకొనుము మానుము నీమత మన్న బౌద్ధుఁడున్. 28

సీ. ఏమిరా!తాఁ జెడ్డకోమటి వెనకయ్య
చేతికి వెసల యిచ్చినవిధమున
మమ్ము మీమతముఁ గైకొమ్మని చెప్పెదు
ప్రాణికి మీమతం బర్థ మగునె?
స్వర్గవైభవము విసర్జించి యెవ్వఁడు
జనదూష్య మైన పైశాచవృత్తి
నీవలెఁ దాల్చురా నిర్భాగ్య!యన నోరి
సౌగత! నక్షత్రచంద్రభాస్క-

గీ. రోపరాగాదికథనమె చూపి చెప్పె
జనుల కర్హత సర్వజ్ఞమనిన జైన
యెపుడుఁ గల్గినగ్రహచార మెఱుఁగుటయు మ
హత్వమని కష్టమతవృత్తివైతి వకట! 29

క. అంగమితాత్మన కింద్రియ
సంగము లే కెట్లు తెలియు సర్వజ్ఞానం
బుం గడపలోనిదివ్వె వె
లుంగుచుఁ దెలుపునె గృహంబులోని ఘటములన్. 30

గీ. కాన లోకద్వయవిరుద్ధమైన జైన
మతముకంటెను మాబౌద్ధమతమె లెస్స
యనుచు వారలు వాదించునవసరము న
నచట కేతెంచె సోమసిద్ధాంతుఁ డొకడు. 31

## కాపాలిక మతము

సీ. పుట్టింప రక్షింపఁ బొలియింపఁ గర్తయౌ
భైరవేశ్వరుఁడు మాపాలివేల్పు

ప్రమదనటద్భూతభయదశ్మశాన శ్రృం
గాటకంబులు మాకు నాటపట్లు
నక్షత్రపటలీవళక్షంబు లైన న
రాస్థిఖండములు మాహారతతులు
నీహారకరబింబనిభమానవశిరఃక
పాలముల్ మాభుక్తిభోజనములు

గీ గాఁ జరింతుము తమలో జగంబు లెల్ల
వేరు వేరైన శివునితో వేరుగా వ
టంచుఁ జూతుము సిద్ధయోగాంజనప్ర
దీపితం బైనసుజ్ఞానదివ్యదృష్టి. 32

క. అని పలికెడు కాపాలికుఁ
గనుఁగొని క్షపణకుఁడు పలికె గాపాలికుఁడా!
వినవలయును నీసౌఖ్యం
బును మోక్షము మతరహస్యమును జెప్పు మనన్. 33

శా. శస్త్రబ్రహ్మకపాలపాత్రసుర యాస్వాదింపుచున్ వహ్నిలో
మస్తిష్కాక్తవసాభిపూరితమహామాంసంబులన్ వేల్చుచున్
హస్తోద్యత్కరవాలఖండితమనుష్యశ్రేష్ఠకంఠోపకం
ఠాస్తోకక్షత జోపహారబలిచే నర్చింతునే భైరవున్. 34

గీ. అనెడిమాట విని భయంబున బౌద్ధుండు
చెవులు మూసికొనియె జినుఁడు నవ్వ
దహహ! జోగి యెవ్వఁ డర్హంత యర్హంత
మోస పుచ్చె నీయభాసు ననిన. 35

క. కాపాలికుఁ డనుమాటకుఁ
గోపించుచు జైన! నరకకూపమ! పాషం
డా!పశువ!బోడి! చండా
లా! పరమేశ్వరుని దప్ప నాడఁగఁ జనునే 36

క. పదునాలుగుభువనంబులు
నదనం బుట్టించు నిల్పు నడఁపి నుపనిష
ద్విదితప్రభవుఁడు కాశీ
హృదయేశ్వరుఁ డెతనిమహిమ యిదె చూపుదునా. 87

సీ. హరిహరబ్రహ్మల నాకర్షణము చేసి
పాత్ర లాడింతుఁ జప్పట్లుకొట్టి
గగనస్థలభ్రమద్గ్రహచంద్రసూర్యుల
హాఃపోకు మంచు బిట్టాన పెట్టి
యీజగజ్జాలంబు నేకోదకము చేసి
చెల్లఁ గ్రోలుదుఁ బుడిసిళ్ళఁ బట్టి
బ్రహ్మండ మనుచిప్పఁ బ్రాణికందుకముల
నాలి యాడుదు నొంటిప్రేలఁ బట్టి

గీ. యనుచుఁ గాపాలికుఁడు పల్కవిని జినుండు
మేలురా నీకు నేయింద్రజాలికుండు
నేర్పె నీమాయ లన నోరిరినీచుకాన!
యైంద్రజాలికుఁడంటివె హరుని ననుచు. 88

ఉ. జొత్తిలునేత్రకోణములఁ జూచుచు నోరి దురాత్మ!కత్తినీ
కుత్తుకఁ గోసి బుద్బుదవిఘూర్ణితఫేనిల మైన నెత్తుటన్
బుత్తి మొనర్తు దుర్గకుఁ బ్రభూతడమడ్డమరూరుఢాంక్రియో
ద్వృత్తనుతోమహర్షనటనారభటీపటుభూతవర్గకున్. 89

వ. అనుచు రౌద్రరసాభీలం బాగు కరవాలంబు నొఱ వెడలఁ దివిచి కవిసినఁ గాపాలికుం జూచి బెగడి గడగడ వడంకుచు నోయి మహానుభావ! "యహింసా పరమో ధర్మ" యనుచు నాక్షపణకుండు భిక్షునకు మఱుంగు చొచ్చిన భిక్షకుండు "నహింసా పరమో ధర్మ" యని కాపాలికుం జేరొ్కని యోయి! మహాత్మా! వినోదప్రవృత్తం బైనవాగ్వాదంబునకు నీదిగంబరుని మీఁద నింత తెగం బని లేదని ప్రియంబు చెప్పినఁ గాపాలికుండు పట్టెం

బొంతిలోపలఁ బెట్టిన జైనుండును గొంత గుండెపట్టుకొని యోయి సోమ
సిద్ధాంతా! శాంతుండ వైభవదీయదర్శనంబున భోగమోక్షంబులు
గలతెఱంగింపు మనిన. 40

సీ. విషయానుషక్తితో విరహితం బైనట్టి
సుఖ మించు కైనను జూడ మెందు
నానందభోగవిహీనోపలావస్థ
యైన ముక్తికి నేల యాస పడఁగఁ
బార్వతివనితఁగా భావన చేసి చ
క్కనిచకోరేక్షణఁ గౌఁగిలించి
తన్నుఁ సదాశివాత్మకునిగా భావించి
క్రీడించు నతఁ డిందుచూడమూర్తి

గీ. యగుచు విలసిల్లు నని శివుం డానతిచ్చె
ననెడు కాపాలికునిమాట లాలకించి
శాంతి యిట్లనుఁ గరుణతో సకలవేద
గురుఁడె హరుఁ డిట్లు చెప్పునే ఘోరమతము. 41

క. అపు డాసిద్ధుని భిక్షు
క్షపణకు లిట్లనిరి దేహసహితునకును రా
గపరిమితాత్మునకును మో
క్షపదముగల దనుట వీన నసంగత మనినన్. 42

క. కాపాలికుండు తనలో
నీపాపాత్మకుల కఠినహృదయము లశ్ర
ద్ధాపంకిలము లని పిలిచిఁ
గాపాలికశ్రద్ధ నదియు గ్రక్కున నెదుటన్. 43

చ. విరిసిననల్లగల్వలకు విందు లనన్ దనలోచనంబులున్
నరధవళాస్థిహారకలనం గడు నొప్పెడుగుబ్బచన్నులున్

గురుకటిభారమంథరమనోహరయానము నిండుచంద్రుతో
సరియగునెమ్మొగంబుఁ గల చక్కఁదనంబున వచ్చి నిల్చినన్. 44

ఆ.వె. కరుణ శాంతిఁ జూచి కంటివె రాజస
శ్రద్ధ ననుచుఁ బల్కె సిద్ధుఁ డపుడు
మానినీవృథాభిమాని బౌద్ధునిఁ గౌఁగి
లించు మనినఁ గౌఁగిలించె నదియు. 45

క జవరాలగు కాపాలిని
కవుఁగిట దనమేను గజగజరులు వోఁగా
నవిరళసుఖమున హృదయం
బిపతాళింపంగ బౌద్ధుఁడిట్లని తలఁచెన్. 46

క. వెనుకను నెందర రండల
ఘనకఠిన స్తనుల రతులఁ గౌఁగిటఁజేర్పన్
గన నెవ్వఁడు నీకాపా
లినికౌఁగిటిసుఖము లోనిలేశం బయినన్. 47

శా. ఈకాపాలిక ధర్మనంబునకు లేదీ డెందు నూహింపఁగా
నీకున్ శిష్యుఁడనైతి బౌద్ధమతమున్నేఁడాదిగా మానితిన్
నాకున్ శాంభవదీక్ష యిచ్చి కడుధన్యత్వంబు నొందించు మం
చాకాపాలికుమ్రోల సౌగతుఁడు సాష్టాంగంబుగా మ్రొక్కినన్. 48

ఆ.వె. క్షపణకుండు చూచి సౌగత యీజోగు
రాలిఁగూడి తంటరాకు మన్నఁ
బాపజాతిజైనపాషండః నిర్భాగ్య
యీసుఖంబు దయ్యె మీదు నీకు. 49

క. సిద్ధుం డప్పుడు నైజ
శ్రద్ధంగని బౌద్ధుచాటు చాలించి వృథా
బద్ధము లఱచెడి జైనుని
సిద్ధాంతము పీడుకోలు చేయు మటన్నన్ 50

వ. అదియు మహాప్రసాదంబని మఱిపంపునదకల జైన దగ్గఱంజని కలకల నవ్వుచుఁ గలికిచూపుమెఱుంగుల ధైర్యతిమిరంబు విరియించి కాంచన చషకదగద్గాయమాన దోర్మూల రోమలపీమలు వెల్లివిరియ ఘల్లుఘల్లున గంకణంబులు మొరయ హస్తమస్తక సంయోగంబు చేసి వదనమదిరామోదంబునం దదీయదుర్వాసన పీసరపుచ్చం గర్ణంబునం బిసపిస నసమశర మంత్రంబుచెప్పి గొప్పచనుగుబ్బలు తొమ్మునగాడిపాఱ బిగియఁ గౌఁగిలించిన వాఁడు నంచనంచలై రోమాంచంబు ముంచుకొన్న నంతఃకరణంబు గిలిగింతలువోవ "నర్హంత" "యర్హంత" యనుచు నంతకంతకు నింద్రియవికారంబు బలవంతంబై సంధిల్ల నల్లల్ల నెమలిపించియంబ నం గప్పుకొనుచు నొప్పులకుప్పయగు నప్పడంతిఁ జేకొని నాకోర్కిసఫలంబుగాఁ బునఃపునరాలింగనంబు గావింపుము శ్రావకీజనంబులు నీకాలిగోరునంబోరు నీదర్శనంబుగదా సౌఖ్యమోక్షసాధనంబని పలికి కాపాలికుం గనుంగొని యోకాపాలికాచర్యా! నాకు మహాభైరవమతం బుపదేశింపు మనిన సిద్ధుండు బౌద్ధక్షపణకులం గూర్చుండఁబెట్టుకొని కరతలంబున నున్న కపాలభాజనంబుఁ దప్పకచూచి భైరవధ్యాననిమీలిత నేత్రుండైనమాత్రంబునఁ దత్పాత్రంబు మదిరారసంబున నిండినఁ దాగొంత యాస్వాదించి శేషంబు భిక్షుక్షపణకుల కిచ్చుచు. 51

క. ఇది పశుపాశచ్ఛేదక
మిది భవరోగౌషధం బమృత మిది పూతం
బిదిగొని కృతార్థు లగుఁడన
నది గ్రక్కునఁగానక వారలనుమానముతోన్. 52

గీ. అర్హదనుశాసనమున కనర్హమైన
కల్లు త్రాగుట కాదని క్షపణకుండ
జోగియెంగిలి రోఁతని సౌగతుండు
మొగమొగంబులు చూడ సిద్ధగురువరుఁడు. 53

శా. శ్రద్ధా! చూడు పశుత్వదోషమున నీజైనుండు బౌద్ధుండు న
శ్రద్ధన్ ద్వన్ముఖపీతశేషసుర యాస్వాదింప రీపీసురన్

శుద్ధింబొందగఁ జేయు మన్న నదియున్శోణప్రవాళాధరో
ద్యద్ధారాళసుధాపవిత్రితము తత్పాత్రాసవం బిచ్చినన్. 54

ఆ.వె. "స్త్రీముఖం సదాశుచి" యటంచు బౌద్ధుండు
తత్ప్రసాదమధువు త్రాగి చొక్క
దర్శనములలోనఁ దలపఁ గాపాలిక
దర్శనంబు సుఖనిదర్శనముగ. 55

చ. ఇటకిత మెన్నితోయముల నిందుముఖీముఖశేషమద్యమున్
గుటుకునఁ గ్రోల నీకుటిలకుంతల యెంగిటిమాధ్విఁ గల్గు వి
స్ఫుటమధురత్వవాసనలు చూడరుగాక దివౌకసుల్ సుధా
ఘుటికలలోనిమేలు మఱి కోరుదురే యిది క్రోలగల్గినన్. 56

సీ. జైనుఁడీగతి మెచ్చుసౌగతుఁ బేర్కొని
యోరికాపాలి నీచారువదన
శేషమద్యము నీవచెల్లఁగ్రోలక నాకు
నించు కిమ్మనవుడు నియ్య గ్రోలి
క్షపణకుఁ డాహాః సుగంధ మహాచవి
యాహా! చలువయంచు నభినుతింప
నింతకాలముదాఁక నేవెఱ్ఱినైయిట్టి
యాసవం బానక మోసపోతిఁ

గీ. గట్టిపెట్టితి నర్హాంత కష్టమతము
తిరుగుచున్నవి యివియ నూదిక్కులెల్ల
ననుచు శయనింప బుద్ధుండు నట్ల చేసె
సోలువారలఁ జూచి కాపాలికుండు. 57

క. కలిగిరి పోయిదె మనకు నల
వెలఁబెట్టని భృత్యులనుచు వెలదియుఁ దానున్
గలకల నవ్వుచు నాట్యము
సలిపిరి కరడమరుతాళ సహితముగాఁగన్. 58

క. ఆడెడువారలఁ గనుఁగొని
బోడలు ప్రమదమున లేచి పోరిఁ గలపాటల్
పాడుచుఁ గాపాలికుఁ గొని
యాడుచుఁ గడు సోలిసోలి యాడెడువేళన్. 59

క. తపతపలాడుచుఁ బాడెడు
క్షపణకునిం జూచి బుద్ధసంయమి సిద్ధా
ధిప మధురసపానం బీ
చపలునికిం గ్రొత్తచేసి సంకటపఱిచెన్. 60

క. అనవుడు సిద్ధుం డాజై
నునకుం దనతమ్మయిడిన నూల్కొని తెలివిన్
వినుతించెను గాపాలం
బునకున్ సరియైనమతము భువిలేదనుచున్. 61

గీ. ప్రమదమున సౌగతుండు కాపాలిఁ జూచి
యప్రయాసంబునన కల్గు నభిమతము మ
హార్థసిద్ధులు మోక్షంబు హస్తగతము
లీమతంబును బోలునె యేమతములు. 62

సీ. అనవుడు సోమసిద్ధాంతుండు జైన బౌ
ద్ధులఁ జూచి యిది యెంతదొడ్డు మాకు
విషయసుఖంబుల విడువకుండిన మహా
సిద్ధు లెనిమిదియుఁ జేరుమాకు
గైవల్యపదము మాకాణాచి త్రైలోక్య
వశ్యవయ స్తంభవాదమోహ
నాకర్షణోచ్చాటనాది ప్రాకృతమంత్ర
సిద్ధి లాభము యోగసిద్ధివిఘ్న

గీ. కారిగావున గణనంబు గాదుమాకు
ననిన జైనుండు మంత్రవిద్యాబలమున

మద్య మాకర్షణము చేయుమాడ్కిసతులఁ
బరగ రప్పింప వచ్చునా గురువ' యనిన. 63

క. గరుడోరగవిద్యాధర
సురకిన్నరయక్ష రాక్షసుల యంతిపురం
బురమణులనైన రప్పిం
తు రయంబున మఱియు నాపుదును దొంటియెడన్. 64

వ. అప్పుడు క్షపణకుండ బిక్షుకునిం గాపాలికుని న్వీక్షించి యీక్షణంబు గణితమార్గంబున నెఱింగితిని మన మిందరము మహామోహుపంపుబడి సత్వాత్మ సంభవయగు సాత్త్విక శ్రద్ధం జెఱపట్టుకొనిపోవం జనుదెంచినారము వచ్చి యిచ్చట నెచ్చరిక దప్పి విచ్చలవిడి నుండుట కాదు గావునఁ గార్యంబు విచారింపవలయు ననినఁ గాపాలికుండు దిగంబరా! యవ్వ రాశిం బరామర్శింపుము చరాచరంబుల నెక్కడ నుండినం గ్రక్కున మంత్రవిద్యచేతఁ బట్టి తెచ్చెద నన్న క్షపణకుండు బలపంబున గుణి యించి చూచి కాపాలికునిం గనుగొని. 65

క. లేదు జలంబుల వనముల
లేదు మహాపర్వతముల లే దరయంగా
నాదేవి విష్ణుభక్తికృ
తాదరయై డాఁగినది మహాత్ములమదిలోన్. 66

ఆ వె. మఱియుఁగంటి నొక్కమర్మంబు ధర్ముండు
కాముఁ బాసిపోయి దీమసమున
సత్వపుత్రియైన శ్రద్ధాదురాత్మిక
యున్నచోటఁ దాను నున్నవాఁడు. 67

మ. అనినన్ గాఢవిషాదభిన్నహృదయుండై సోమసిద్ధాంతుఁ డి
ట్లను మున్నే హరిభక్తికారణము నిత్యానంద సంసిద్ధికిన్
వెనుకన్ ధర్ముఁడు శ్రద్ధయుం గలిసినన్ వేగంబె యుబ్బున్ వివే
కునకున్ వాంఛితసిద్ధి యెత్తుపడుఁ గోర్కుల్ మోహభూభర్తకున్. 68

క. ఐనను బతికార్యము తమ
ప్రాణము వెచ్చించియైన భటునకుఁ జేయం
గా నగు ధర్మశ్రద్ధలఁ
దే నంపెద నాదుమంత్రదేవత ననినన్. 69

గీ. శాంతి యప్పుడు తమతల్లి శ్రద్ధయన్న
యీగ డెఱిఁగినవేడ్కయు జోగి సేయు
కపటముననైన భీతియుఁ గడలుకొనఁగఁ
గరుణయును దాను హరిభక్తికడకు నేగి. 70

క. ధర్మశ్రద్ధలఁ గని యా
మర్మంబంతయును జెప్పుమాత్రంబున జ్యో
తిర్మయనిజతేజోజిత
ఖర్మచ్ఛవి సిద్ధమంత్రభైరవి కినుకన్. 71

గీ. కవిసి ధర్ముని శ్రద్ధను గదియఁబట్టి
యెత్తుకొని యభ్రపథమున కెగయువేళ
నమ్మహాశక్తి భైరవి నంటఁ దఱిమి
వేగ వారల విడిపించె విష్ణుభక్తి 72

క. అంతట శ్రద్ధారమణికి
నెంతయుఁ జెలియైనమైత్రి యేతద్వృత్తం
బంతయు విని చింతానల
సంతప్తశ్రద్ధకడకుఁ జనుచో నెదుటన్. 73

క. పడుచున్ లేచుచుఁ బులిచే
విడివడినకురంగిఁ బోలి విహ్వలురాలై
గడగడ వడఁకుచుఁ దన్నున్
బొడగనియు నెఱుంగలేనిబోటిన్ శ్రద్ధన్. 74

క. దగ్గరిలి మైత్రిభామిని
దగ్గుత్తిక యిడుచు నక్కటా ప్రాణసఖీ
బెగ్గిలి నన్ను నెఱుంగవు
దిగ్గనె గుండెయని తన్నుఁ దెల్పినపిదపన్. 75

శా. ఏ నింకేమని చెప్పుదున్ జెలి మహోహిక్రూరనిశ్వాసయున్
నానామర్త్యకపాలకుండలియు దంష్ట్రాచంద్రరేఖాంతర
స్థానప్రోల్లలజిహ్వయున్ హుతవహజ్వాలాక్షియున్ ఘోరశై
లానూనాంగియు నైన భైరవి మహోహంకారహుంకారియై. 76

క. పిడుగువలె వచ్చి న న్నొక
పిడకిట మరి ధర్ము నొక్కపిడికిటఁ గొని తా
నుడువీథి కెగసి మాంసము
నొడిసి వడి న్నెగయు గృధ్రియుం బలె నన్నన్. 77

గీ. అద్దిరమ్మ యనుచు నా మైత్రి మూర్ఛిల్లి
సేదదేర్చి శ్రద్ధ చెప్పఁ దొడఁగె
నపుడు విష్ణుభక్తి యస్మదీయంబైన
యార్తరవము విని దయార్ద్ర యగుచు. 78

క. భ్రూభంగ భయదఫాలయు
నాభీలకటాక్షవీక్షణారుణిమయునై
యాభైరవి నదలింప న
భోభాగము విడిచి యదియు భూమిం ద్రెళ్ళెన్. 79

వ. ఇటు విష్ణుభక్తిమహాప్రభావంబునఁ గాళరాత్రిదంష్ట్రా కరాళవదనగహ్వరంబు వెలువడి నిన్నుఁ జూడం గల్గుట పునర్జన్మం బని శ్రద్ధాసరోజనేత్ర మైత్రిం గౌఁగిలించి తరువాతివృత్తాంతంబు చెప్పందొడంగె నట్లు నన్నును ధర్ముని విడిపించి విష్ణుభక్తి మహాదేవి మోహకృత్యంబున కత్యంత కుపితచిత్తయై యద్దిరా యిద్దురాత్ముండు గద్దఱితనంబున నన్నుం గైకొనక తిరుగుచున్నవాఁడు వీని నిర్మూలంబు గావింతునని ప్రతిజ్ఞపలికి నన్నుం

జూచి శ్రద్ధా! నీవు రాఢాదేశంబున భాగీరథీ సమీపంబునఁ జంద్రతీర్థంబున మీమాంసానుగతయైన వతిసతి కతన నెట్టకేలకుఁ బ్రాణంబులు పట్టుకొని యుపనిషత్సంగంబుకొఱకుఁ దపంబు సలుపుచున్న వివేకుని కడకుం జని యిట్లనుము. కామక్రోధాదుల గెలువ నుద్యోగంబు చేయు మట్టైన వైరాగ్యం బేతెంచు. నేనును సమయం బెఱింగి యమనియమ ప్రాణాయామాదుల బోదిచేసికొని భవదీయసైన్య సంరంభణంబు చేసెద శాంత్యాదికౌశలంబున నుపనిషదేవీసంగతుండవగు నీకుం బ్రబోధచంద్రుం డుదయించుటకునై బుతంభరాదిక దేవీసమూహంబునుం గృతసన్నాహయై యున్నయది యని చెప్పుమని పంపిన నేనును వివేకునికడకుం జనుచున్న దానమైత్రీ! నీవింక నెవ్విధంబున దినములు గడపెద వనిన శ్రద్ధాంగనా! నేనును నా తోడఁ బుట్టువు లైనముదితాకరుణోపేక్షలంగూడుకొని మహాత్ములహృదయంబుల నుండి వివేకాభ్యుదయంబుకొఱకు గడపెద నమ్మహాత్ములు మమ్ము నలువుర మెలపెడువిధంబు వినుము. 80

క. నను సఖునెడ నతిదుఃఖప
రునెడఁ గరుణఁ బుణ్యతత్పరునియెడ ముదితన్
జెనఁటియెడ నుపేక్షను ధమ
మనమున నిల్పుదురు శాంతమతులు మహాత్ముల్. 81

క. నలువురమును నీగతి మతి
నిలుచుమహాత్ములకు నాత్మ నిర్మల మగుఁచో
పులు గడిగినట్లు రాగా
దులసంగతిచేత మున్ను దూషిత మైనన్. 82

వ. కావున మేము నలువురము వివేకాభ్యుదయంబునందైన వ్యాపారంబుననే వాసరంబులు గడపెదము నీవును వివేకుని కడకుఁ జనుమని శ్రద్ధారమణిని మైత్రికమలనేత్ర యనిపెననిపించుకొని చక్రతీర్థంబున నున్నవివేక మహారాజు కడకుంజని విష్ణుభక్తి మహాదేవి యానతిచ్చినవిధంబు వినిపించిన. 83

ఉ. కాశ్యపగోత్ర సౌధవరకాంచనకుంభ! రిపుక్షమాధవా
వశ్యపరాక్రమస్ఫురణ వైభవ నూత్నమహేంద్ర! సంతతా
వశ్య కృపావిశేష పరివర్ధితబాంధవ! ధైర్యమందరా
దిశ్యకరప్రభావ జలధీభవదుజ్జ్వలకోశమందిరా. 84

క. పుణ్యశ్లోక కళామణి
పుణ్యస్థల హృదయకమలభూషితపుణ్యా
గణ్యాంగద దానప్రా
వీణ్యతరణ్యాత్మభవ నవీనాత్మభవా. 85

పృథ్వీవృత్తము. ప్రధానకులభూషణా! ప్రథితజగన్నిమేషణా!
పృథివ్యమరతోషణా! రిపునృపప్రజాశోషణా!
వధశ్రుతిగవేషణాస్పదమహేశభక్తిషణా!
యధార్థమితభాషణా! యమితగుణాగ్రభూషణా! 86

గద్య:- ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వతాభి
నంది నందిసింగయామాత్యపుత్ర మల్లయమనీషి తల్లజమల
యమారుతాభిధాన ఘంటనాగయప్రధాన తనయ సిం
గయకవిపుంగవ ప్రణీతంబైన ప్రబోధచంద్రోదయం
బను మహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

—o—

# ప్రబోధ చంద్రోదయము

## చతుర్థాశ్వాసము

క. శ్రీగౌరీకుచకుంభా
భోగమృగమదాను లేపభూషితవక్షో
భాగశివదత్త నిర్మల
భోగాంగయనంత మంత్రిపుంగవ గంగా! 1

వ. అవధరింపు మట్లు శ్రద్ధాఽలనవలన విష్ణుభక్తి మహాదేవి సందేశంబువిని పర
మానందంబు నొంది సుకృత కర్మవ్యవసాయపరులకు దైవసాహాయ్యంబు
గలుగునని పెద్దలుచెప్పుట నిజమయ్యె నిప్పుడు విష్ణుభక్తి మహాదేవి పనకుఁ
దానె నామీఁదియనుగ్రహంబున నీశ్రద్ధావధూటి చేతనీవు కామాదుల గెలువ
నుద్యోగింపుము నేనుదోడయ్యెద నని యానతిచ్చి పుత్తెంచెం గావున నింక
నస్మదీ యమనోరథం బప్రయాసంబున సిద్ధించు నని వివేకమహారాజు
మహామోహునిచేత జగంబులు మోసపోవుతెఱం గంతరంగంబునఁ
దలంచి. 2

చ. అనఘ మనంత మచ్యుత చిదాత్మసుధాంబుధి నిస్తరంగమం
దనిశము మగ్నులయ్యుఁ జని యానక సంస్కృతి యన్ మరీచికా
వననిధి వెంట వెంటఁ జని వారక యీఁదుచు నాస్వదింపుచున్
మునుఁగుచు లేచుచుందు రిదె మూఢజనంబులు మోహచేష్టలన్. 3

ఆ. ఇట్టిమోహభూత మిరవగు సంసార
సాల మనవబోధమూలయుతము
కాన నీశ్వరాంఘ్రికమ లార్చనాజాత
బోధగజము చేరి పోవపైచు * 4

---

* ఇది యొకప్రతి యందున్నది. ప్రక్షిప్తమయి యుండును.

క. ఆమోహున కాధారము
కాముం డటుగాన వానిఁ గడ తేర్చ బలో
ద్ధాముఁడు వస్తువిచారుం
డామేటిం బిలువ వలయు నని పణిహారిన్. 5

క పనిచిన వస్తువిచారుఁడు
చనుదెంచుచు నాత్మలోన సకలజనులు మో
హునికతమునఁ గామునికత
మునను భ్రమలఁ బొంది మోసపోయెద రయ్యో! 6

చ. సవరని దంచు నిబ్బరపుఁజన్నుల దంచు సుధాంశుమండలీ
సువదన యంచు బిత్తరపుఁ జూపుల దంచు లతాంగి యంచు మో
హవశతఁ బొంది చొక్కి కొనియాడి రమించు బుధుండుఁ గామినిన్
శివశివ భ్రాంతిగానియశుచిప్రతిమౌట యెఱింగియుండియున్. 7

గీ. వికటదుర్గంధభస్త్రవేషములకు
నాలయంబులు చర్మమాంసాస్థిపంజ
రములు నైనవధూశరీరంబులకును
వ్యాధిగృహముల కింతైన వాసి గలదె. 8

ఉ, మెత్తనిదుప్పటంబులను మెత్తినకస్తురి కప్పురంబులన్
ముత్తెపుఁబేరులన్ మరభిపూరిత పుష్పములన్ వృధా వెలిన్
హత్తినవేడ్కఁ జూతురహహా! మతిహీనులులో నెఱుంగ రీ
బిత్తరివారనారు లను పేరిట జంగమనారకంబులన్ 9

సీ. సికటమలద్వార నిర్గతదుర్గంధ
వాతూలసంఘాతవాసితంబు
వితతకోణత్ర యావిస్తారితానేక
సాంద్రకంటక రోమసంవృతంబు
కలుషభూరి రజోవికారసముద్భవా
సారశోణితపంక సంకులంబు

విశ్రగంధాలయాజస్రపరిస్రవ
బహుతరప్రస్రావవల్వలంబు

గీ. నైనభనదీయమందిరప్రాంగణమున
కెట్టు దిపిచెదు యోగ్యులైనట్టిఘనుల
భృంగమౌర్వీనినాదకంపితసమస్త
పటువియోగిజనప్రాణః పంచబాణ! * 10

క. అనిపలికి మిన్ను చూచుచు
మనసిజునింగూర్చి యోరిమాలా! యీలా
గున భ్రమయించెద వేలా
జనులు నిరాలంబనమున జనితుఁడ వయ్యున్. 11

మ. ననుఁ గామించిన దీలతాంగినను నానందంబుగాఁ జూచి యి
వ్వనజాతానన కౌఁగిలించె నను నివ్వాహమాక్షి కాంక్షించె నం
చు నరుల్ భ్రాంతివహింతురేల పిశితాస్థుల్ కూడి రూపైన మో
హినియే కార్యము కానరాని పురుషుండీక్షింపఁ గాంక్షింపఁగన్. 12

క. అనుచు న్వస్తువిచారుఁడు
చనుదెంచి వివేకనృపతి చరణంబులకున్
వినతుండై తచ్చాసన
మునఁ జేరువజమ్ముఖాణమునఁ గూర్చుండన్ 13

మ. అతనింజూచి వివేకుడిట్లను మహాత్మా! మాకు సమ్మోహునిం
బ్రతిపక్షు న్విదళింపఁ గావలయు సంగ్రామంబున న్వానికిన్
హితుడు స్వీరుడునైనకామునకు నిన్నే యెంచుకొన్నాఁడనేఁ
బ్రతిగా నాయుధవిద్యనీకుఁ గలదా ఖండింపఁ దత్కామునిన్. 14

క. అనవుడు వస్తువిచారుఁడు
జననాథా! వాని కైదుశరము లవియు నం

---

*ఇదియొక ప్రతిలోనేయున్నది. ప్రక్షిప్తమని తోఁచుచున్నది.

టీనఁ గందుపువ్వులాకా
ముని గెలువ న్నాకు నస్త్రములు వలయునొకో. 15

చ. తొలితొలి నింద్రియంబువెలిత్రోవలఁ బాఱుమనంబుఁ బట్టుచున్
గలికిచకోరలోచనలఁ గాంచినయప్పుడు వారిమేనిలో
పలఁగలరోఁతలున్ ముదిమిభంగులు మాటికి మాటికి న్మదిన్
దలఁచినఁ జిత్తజుండు తనుతానె నశించెడు నేటి కస్త్రముల్. 16

చ. ప్రవిమలసైకతంబులయి పాఱెడుపుణ్యపుటేఱులున్ బరి
స్రపదురునిర్ఝరంబు లగుశైలములున్ వనభూములున్ బుధ
ప్రవరసమాగమంబులుఁ బరాశరసూను నిబద్ధశాస్త్రవాక్
శ్రవణముఁగల్గ నెక్కడిపిశాచము దీమరుడున్ గృహాంగులున్ 17

చ. తరుణియనంగ మారునిప్రధానశరంబది భగ్నమైనఁద
త్పరికరముల్ సుధాంశుడు గదంబవనాగతకోనులానిలాం
కురములుఁ జంద్రికానిశలుఁ గోకిలకీరమధువ్రతంబులున్
బరువపుఁ బువ్వుతోఁటలు నపార్థములైనవి గావె చూడఁగన్. 18

క. కావున నన్నుం బనివిన
వేవేగ విచార ఘోరవిశిఖంబులఁ గాం
డీవి జయద్రథుఁ జంపిన
కైవడిఁ బరబలముఁ ద్రుంచికాము జయింతున్. 19

క. అని పల్కినవస్తువిచా
రుని నాయితపడఁగఁ బంచి క్రోధుని ఖండిం
ప నుపాయముఁ దలఁచి వివే
క నృపతి పణిహారిచేత క్షమఁ బిలిపింపన్. 20

వ. అదియుం జనుదెంచు నప్పు డాత్మగతంబున. 21

క. భ్రూకుటితరంగభీకరుఁ
డై కనలి పరుండు తప్ప నాడిన సుజనుం

దేకలఁకయుఁ బొందఁడు మరు
దాకంపితకంపవిరహితాబ్ధియుఁ బోలెన్. 22

మ. అలయంగా జగడంపకే మిగుల దేహంబెల్ల నొప్పింపకే
దలనొప్పేమియుఁ జెందకే హృదయసంతాపంబునం బొందకే
దలఁపంగా రిపుహింస మున్నగుననర్థవ్రాతముం జేరకే
చులకంగా విదళింతుఁ గ్రోధునిఁ గడున్ జోద్యంబున్నే నూఱకే. 23

సీ క్షమ యిట్లు పల్కుచుఁ జనుదెంచి పణిహారి
విన్నవింపంగ వివేకవిభుని
సమ్ముఖంబై భక్తి సాగిలి దండ ప్ర
ణామంబుఁ రావించి స్వామిః నన్ను
నేయూడిగముఁ గొన నిప్పుడు పిలిపింప
నవధరించితి రన నాదరమునఁ
గూర్చుండ నియమించి క్రోధుని
ఖండించుకొఱకునై పంపవలసి

గీ. నిన్నుఁ బిలిపించినార మటన్నదేవ!
పంత మొక్కటి వినుము నీపాదమాన
యాహవంబున నామహామోహునైన
నుక్కడంగింతుఁ గ్రోధుఁ దేలెక్కనాకు. 24

ఉ కావున వేగ నద్దురితకారి నకారణ మధ్వరక్రియా
దేవతపశ్శ్రుతుల్ చెఱుపఁ ద్రిమ్మరుత్రిమ్మరిఁ గన్నులన్ వృథా
పావకకీలముల్ నిగుడుపాతకి నేననిఁ గిట్టి చండికా
దేవి లులాయదానవు వధించినలీల వధింతుఁ గ్రోధునిన్. 25

వ. అప్రయానంబున వాని వధియించునుపాయంబును విచారించెద. 26

సీ. క్రోధించునతనిఁ గన్గొని మందహాసకం
దళితవక్త్రింబుతో నిలువవలయుఁ

క్రూర భాషణముల రోదచేయునాతనిఁ
బరికించి కుశలోక్తిఁ బలుకవలయు
హెచ్చి చేపట్టకు వచ్చునాతని విలో
కించి ప్రార్థనయుఁ గావించవలము
మొత్తునాతనిఁ జూచి మున్నిటిదుష్కృత
ములు పోయె ననుచును దలఁపవలయు

గీ. నకట! యీప్రాణి యవిదితాత్మకుఁడు గాన
దైవికమున మహావిపత్ప్రాప్తుఁడయ్యె
ననుచు దయచేయవలయు నిట్టి నవారి
యెదుట నిలువంగఁ గ్రోధుని కెన్నితలలు. 27

కీ. కదనమునందును గ్రోధునిఁ
జదిపినఁదము దామె మిగుల సదమదమై కూ
లుదురు పరుషతాహింసా
మదపైశున్యాభిమానమాత్సర్యాదుల్, 28

క. అన్నవుడు నాక్షమఁ గడుమ
న్నన నాయితపడఁగ ననిపి నతపతి లోభుం
దునుమగఁ జాలినసంతో
షునిఁ బిలిపించుటయు వచ్చెచో నతఁడు మదిన్. 29

వ. కృపణుల నుద్దేశించి కృపాపరాయణత్వంబున. 30

శా. స్వేచ్ఛాలబ్ధము లైనవన్యఫలముల్ తృప్తిస్థగాఁ గల్గఁగ్
నచ్ఛస్వాదుజలంబు వాహినులయం దవ్వారిగాఁ బాఱఁ గాఁ
బ్రచ్ఛాయస్థలపల్లవప్రకరతల్పం బబ్బఁగా నేలయా
శాచ్ఛన్నుల్ ధనికాంగణంబుల వృథా సంతాపముం బొందఁగన్. 31

క. ధనమృగతృష్ణావజల
మునఁదిరుగ నిజప్రయత్నములు భగ్నములై

నను విఱుగఁడస్సి మూఢుఁడు
చెనఁటిమనసు వజ్రశిలలఁ జేసెరొ సుమ్మీ. 32

మ. ధనమార్జింపుదు రార్జితంబయిన తద్ద్రవ్యంబు బేరంబుచేఁ
గొనసాగింపుదు వడ్డివాసివలనన్ గూర్తున్ మఱిం గొంతయుం
చనిశోద్భూతమనోరథంబున ధనధ్యానంబుఁ గావించు న
య్యను మోహావృతుఁ బట్టి మ్రింగు నహహా! యాశాపిశాచం బిలన్. 33

చ. వలయుధనంబుఁ గూర్పఁగ నవశ్యము నన్న వియోగనాశముల్
గలుగు నిజంబుదాని కటుగాన ఘటించినసొమ్ము పోయినన్
గలఁగుట మంచిదో మొదటఁ గాంక్షయెలేక సదాసుఖస్థితిన్
మెలఁగుట మంచిదో కృపణ! నీమదిలోపల నిశ్చయింపుమా! 34

చ ముది మను తెల్లతాఁచు తనమూర్ధము మ్రింగెడి మృత్యుదేవి య
ప్పిదపఁ బరిగ్రహంబులను పెన్‌బులులుం దినఁ గాచుకొన్న వ
త్యదయత నిద్దెఱింగి కృపణా! ప్రమాదామృత వారిరాశిలో
విదిలిచికొమ్ము లోభపదవీపరిషిక్తరజఃపరంపరల్. 35

వ. అనిపల్కి వేత్రవతీపురస్సరంబుగా సంతోషుండు వివేకుసమ్ముఖంబై సాగిలిమ్రొక్కిన మహారాజు నతని నత్యాదరంబునఁ దనసమీపంబునఁ గూర్చుండ నియమించి భవదీయప్రభావం బెఱుంగుదు దుర్జయుండగు లోభుని భంజింప నీచేతంగాని కాదు గావున వేగ నాయితపడి కాశికా నగరంబునకుఁ బైనంబు గమ్మనిన సంతోషుండు మహాప్రసాదంబని బహుముఖంబుల సంచరింపుచు ముజ్జగంబుల నిర్జించుచు దేవద్విజాతి వధబంధనలబ్ధవృద్ధి యగులోభరావణునికి దాశరథినయ్యెదనని ప్రతిజ్ఞపలికి చనియె నంతట వినీతవేషుండగు నొక్కపురుషుండు వచ్చి విజయప్రమాణ మంగళద్రవ్యంబు లన్నియు సమకూఱె మౌహూర్తిక నివేదితంబైన ముహూర్తంబును డగ్గరె నని విన్నవించి తదనుశాసనంబునఁ బ్రస్థానపటహంబు వ్రేయించిన. 36

సీ. కటితటీకటదాన గంధభ్రమద్భృంగ
భీకరకరిఘటాబృంహితములు
భీషణవిద్వేషివేషి యుధోచిత
వేషఘోటకఘోర హేషితముల
ధనురాది వివిధాయుధధ్వజాధిష్ఠిత
నిష్ఠురస్యందననిస్వనముల
ఖడ్గమయూఖాంధకారి తాశాముఖ
వీరభటప్రోద్భటారభటులఁ

గీ. గాహళారవభేరి ఖాంకారములను
గంచుకివ్యూహభూరి హూంకారములను
బద్మజాండంబు బీటలు వారుచుండ
దళదశంబులు చక్రతీర్థంబు వెడలె. 37

క. అప్పుడు వివేకనరపతి
ముప్పిరిగొను వేడ్క రత్నములలెక్కెములన్
విప్పగు రుచి లోగిఁ గుప్పలు
గప్పెడు రథరాజమెక్కి కదలెడువేళన్. 38

చ. వెరవరి సూతుఁడిట్లను వివేకుని దేవర! చూచితే ధరన్
గొరిజెలుమోపి యోప వనఘోటకము ల్వడిఁ బారుచున్న వం
బరపథమం దమందరయ మందర ఘూర్ణితవార్నిధి ధ్వని
స్ఫురణరథంబు మ్రోయఁగ రజోవిసరం బెడతెవ్వకుండఁగన్. 39

క. చేరువ నిదె కనుపట్టెను
వారాణసి సకలభువనపావన తటినీ
వారి ప్రవాహనిర్మల
హారావృతయగుచుఁ జూడు మప్పురిసొబగున్. 40

శా. ధారాయంత్రపరిస్ఫురజ్ఝరుల సత్కారాన్వితంబుల్ సుధా
గారంబుల్ శిఖరస్ఫురన్మణిపతాకంబుల్ మహాసౌధముల్

రారా నెంతయు నొప్పుచున్నవవిగో రాజేంద్ర! సౌధ్ధామనీ
రారజ్యద్ధవళాబ్దరాజిక్రియఁ దారావీథితో రాయుచున్. 41

క. చంచలగరుదంచలమద
సంచరదళి సంచయాతిసంఛన్నదళో
దంచిత సుమకంచుకితము
లెంచఁ గొలఁదిగాక మించె నివె పూఁదోఁటల్ 42

చ. సురనదిఁ దోఁగి నీరజరజోభసితంబు ధరించిరాలుక్రొ
వ్విరుల శివార్చనల్ సలిపి వెంబడి వచ్చుమధువ్రతాళిఝం
కరణముచేతఁ బాడి లతికాభుజముల్ కదలంగ నాడెడున్
బరిసర పుష్పితోపవనబంధురమంథరగంధవాహముల్. 43

గీ. విద్యకైవడి ముక్తికి విడిదియగుచు
నాత్మవిధమున నానందమైన యిచట
నున్నసర్వేశునౌదలపిన్నచంద్రు
నవ్వుచున్నది గంగ ఫేనములచేత. 44

సీ. వీరు పో మనరాక విని భయభ్రాంతులై
కామాదులెల్లను గలఁగఁబాటి
గుంపులు గుంపులు గూడుచు నున్నవా
రనిన వివేకుండ నతనిఁజూచి
కానిమ్ము మనల మిక్కడఁ దేరుడిగ్గి య
య్యాదికేశవదేవునాలయంబు
చూత మీహరి పరంజ్యోతి యీకాశిలోఁ
బ్రాణము ల్విడుచు పుణ్యాత్ములెల్ల

గీ. నితనిఁ గలియుదురని పెద్ధలెపుడుఁ జెప్పు
చుందురనిపల్కి కాంచనస్యందనంబు
డిగ్గి గుడిచొచ్చి యాదేవు డగ్గఱంగఁ
జని వివేకుండు ప్రణమిల్లి వినయముననుఁ 45

దండకము. జయ జయ వినయానతేంద్రాది బృందారకశ్రేణి చూడామణీరాజి నీరాజితోపాంత పాదద్వయాంభోజ రాజన్నఖద్యోత విద్యోతిత స్వర్ణపీఠా నిరాఘాటమాయారుచి ద్వేషణాద్వైతవిభ్రాంతి సంతాన సంతప్త బృందారు సంసారనిద్రాపహారైకదక్షా దినాద్యక్ష నక్షత్ర నాథార్క విశ్వాక్షమామండలోద్ధార వేళాకరాళోరుదంష్ట్రాగ్ర సంఘట్టనా విస్ఫురచ్చైలసంఘాత మాపాణి సంవాహరోమాంచ వజ్జంఘమును పెనుఘనముల్ బలారాతి పంపంగ నేతెంచి వర్షంబు లొప్పంగ నందల్చలింపంగ జాతనుకంపం గడుంజిత్రమౌ లీలతోఁ బ్రేల గోవర్ధనచ్ఛత్రముం బట్టవే మట్టవే కాళియాహిస్ఫటల్ నుగ్గుగా వ్రగ్గఁగాఁ గ్రోలవే పూతనాప్రాణముల్ శోణముల్ నీ భుజాచక్రధారాళికిం గ్రైటభాకుంభకంఠాస్థిజాలంబు లాలెంబునీకున్ జగత్కంటకచ్ఛేదముల్ వేదముల్ గానఁగాలేవు నీపాదముల్ హాటకాక్షానుజుం బట్టిబిట్టల్కఁ గ్రొవ్వాడిగోళ్ళన్వడిం జించి చెండాడఁగాఁ బుట్టురక్తంపుఁ బెన్నీటిలోఁ దెట్టువల్గట్ట నాదైత్యుప్రేవుల్ ప్రవాళంపుఁబ్రోవుల్వలెన్మించఁగాఁ జూచి గర్జించు నీపౌరుషోత్కర్షముల్ హర్షము ల్చేసెఁగా దేవతాకోటికిన్ మాటికిన్ లోకసంరక్షణార్థంబు నీవిట్టి లీలావతారుండవౌ దింతియేకాక యాకారముల్నీకు లేవో నిరాకార పాల్కడలివెడలి యేతెంచి లక్ష్మీకచకోరాక్షి నీకంఠభాగంబున న్వైచుమాంగళ్యదామంబునెత్తావి కేతెంచు లేఁదేఁటిదాఁటుల్ భవన్నీల దేహచ్ఛవిచ్ఛాదిదచ్ఛాయలై ఝుంక్రియై కామమేయత్వముం బొందు గోవింద యాభక్తసందోహమున్ మోహసందేహముం బాపి బోధత్వముం జూపి రక్షించు మంచున్ బునర్నమ్రుఁడై. 46

క. ఆకేశవుగుడి వెడలి వి
వేకుఁడు పటమంటపముఁ బ్రవేశించి మహా
నీకములు దారుకలిత
ప్రాకారములోన విడిసె బహుశిబిరములన్. 47

శా. అంతం గుంకుమపంకపాటలిమతో నస్తాద్రిపై నిల్చె భా
స్వంతుం డిందుఁడు నింద్రగోపరుచిఁ బూర్వక్ష్మాధరంబెక్కె వా
రెంతేఁ జూడఁగ నొప్పిరప్పుడు వివేకేశప్రతాపప్రభా
ప్రాంతంబందలి వెంటపంజువలెఁ దద్రాకాదినాంతంబునన్. 48

సీ. మోహుపక్షమువారి మొగములపగిది నం
బోరుహవ్రాతంబు ముచ్చముణిఁగె
వికసించెఁ దొగలు వివేకునిపక్షంబు
వారల చిత్తోత్సవంబుకరణి
మోహునిబంధుసమూహంబులైవడిఁ
గోకసమూహంబు శోకమందెఁ
జెలఁగెఁ జకోరకములు వివేకక్షమా
ధవునినెయ్యంపు బంధువులపగిది

గీ. ముదిసె నిశ మోహురాజ్యసంపద యనంగఁ
దెల్లవాఱె వివేకుని తెలివి యనఁగఁ
దొలఁగెఁ జుక్కలు మోహునిబల మనంగఁ
దరణి వొడిచె వివేకప్రతాప మనఁగ. 49

వ. అప్పు డుభయపక్షంబులవారును యుద్ధసన్నద్ధు లగుటయు విష్ణుభక్తిమహా
దేవి శ్రద్ధం గనుంగొని నేనిట్టి బెట్టిదంబైన హింసాప్రయాస సమరంబుఁ
జూడఁజాల సాలగ్రామం బనుభాగవతతీరంబునకుం జనియెద నీవిచ్చటి
వృత్తాంతంబంతయుఁ దెలిసివచ్చి పూసగ్రుచ్చిన తెఱంగున నెఱింగించుమీ
యని నియోగించి కాశికాక్షేత్రంబు విడిచి శాంతితోడంగూడి విజయంబు
చేసె వివేకుండును ఖండనంబున మహామోహుని సపరివారంబుగా ఖండిం
చినవెనుక శ్రద్ధాదేవి మోహాదిసహోదరహానిజనిత చింతాపరవశత్వంబున.
50

క ఘనపవనాహతతరుఘ
ట్టనభవదావాగ్నిచే నడవి చెడుచందం

బున జ్ఞాతివైరమున హే
చ్చినకిసుకం గులము చెడుట సిద్ధంబైనన్. 51

గీ. అంత కంతకుఁ బెరిగెడు నాత్మలోన
నారదు వివేకజలద సహస్రములను
నకట! దుర్వారదారుణంబైనయట్టి
సోదరవధావ్యసనసంభవోరువహ్ని. 52

మ. నదులైనన్ గిరులైన వారినిధులైనం బొంద విధ్వంసమున్
బదిలం బేమియు లేనియీతృణకణప్రాయుల్ ఘనంబౌకృధా
స్పదమై త్రిమ్మరుమృత్యుదేవతకు లక్ష్యంబే యిటో టే నెఱుం
గుదు నైన న్మది బాంధవవ్యసనదృగ్దోషంబుచే నేఁగెడిన్. 53

చ. కఱుకులు దుష్టవర్తనులు కామమదాదు లశోచ్యులౌట నే
నెఱిఁగినఁ దోడఁబుట్టు లని యీమమకారదురంతదుఃఖపుం
జుఱజుఱ యంతరాత్మఁ జుఱుచూడ్కులు చూడెడి మర్మసంఘలన్
జెఱికెడి దేహశోషకరనిర్భరకీలలఁ బ్రజ్వలింపుచున్. 54

క. శ్రీవిష్ణుభక్తిఁ జూడక
యీవగ పొఱదని తలఁచి యేగెను శ్రద్ధా
దేవత సాలగ్రామ
గ్రామాంతిక చక్రతీర్థరాజంబునకున్. 55

సీ. చనుచుండ నచ్చోట సకలసంయమిసేవ్య
మాన యయ్యును ఖిన్నమాన యైన
శ్రీవిష్ణుభక్తి నీక్షించి శాంతివధూటి
దేవి! యిదేమి నీదివ్యచిత్త
మున విచారము పుట్టెనన విష్ణుభక్తి యి
ట్లను శాంతితోడ నాహవమునందు
బలవంతుఁ డగుమోహువలన వివేకున
కేమయ్యెనో యని యెఱుఁగ లేక

గీ తలఁకుచున్నా ననఁగ దేవితలఁపునందు
నిట్టిదయ గల్గఁగా వివేకేశ్వరునకుఁ
గాలు ములు గాఁడునే సదామేలె గాక
వెఱపు వలదన శాంతితో విష్ణుభక్తి. 56

క. తనవారలయభ్యుదయము
తనకన్నారఁ గను గన్న దాఁకను హృదయం
బనిశంబు నపాయాశం
కను దామరపాకునీరుగతిఁ దల్లడిలున్. 57

వ. విశేషించి శ్రద్ధాదేవిరాక తడవగుటం జేసి డెందంబు గుందుచున్నదని పల్కుచున్నంత నావిష్ణుభక్తిమహాదేవిన్ డగ్గఱి శ్రద్ధావధూటి సాష్టాంగ దండప్రణామంబు గావించి యద్దేవి యడుగం దనసేమం బెఱింగించి తన కూఁతురు శాంతి మ్రొక్కినఁ గౌఁగిలించి విష్ణుభక్తి మహాదేవిసమ్ముఖంబున నిలువ నద్దేవి శ్రద్ధాంగనాః యుద్ధవృత్తాంతం బెఱింగింపు మనిన బద్ధాంజలియై శుద్ధబుద్ధస్వరూపిణి వగు నీతో విరుద్ధపడు దురాత్ములకుఁ దగిన యట్లయ్యె నవ్విధంబు సవిస్తరింబుగా విన్నవించెద నీవు హింసాప్రయాససమరంబు చూడఁజాలక యిచ్చటికి విచ్చేసినవెనుకఁ బలబల వేగుటయు నుభయపక్షంబులం గలబలంబులు విజయ ఘోషణాహూయమానానేక వీరభటసింహనాదబధిరిత రోధోంతరంబును బృథుల రథ తురగఖుర ఖండిత భూమండలోద్ధూతధూళి ధూసరితభాస్కరంబును సముత్తాల కర్ణతాళస్ఫాలనోచ్చలత్సమద కరికుంభ సిందూర సంధ్యాయమాన దశదిశాముఖంబును బ్రళయ జలధీరధ్వానభీషణ పటహఘోషణంబునుగా మోహరించునప్పుడు వివేకమహారాజు మోహునికడకు నైయాయిక దర్శనంబు రాయబారంబు పంపినం జని యిట్లనియె. 58

శా. ఈ కాశీముఖదివ్యతీర్థముల వాహిన్యద్రిసీమంబులన్
శ్రీకాంతారమణాలయంబుల శివక్షేత్రంబులన్ బుణ్యాను
శ్లోకస్వాంతములందు నుండక పో కాలుండట్లు పోకుండినన్
మీకాయంబుల మాంసఖండము లనిన్ మెక్కున్ బిశాచావళుల్. 59

సీ. అనుచు నైయాయికుం డాడు మాటలు విని
కోపించి మోహుండు కుటిలనిటల
పటునటత్ భ్రుకుటిర్యై తటతటను గటము
లదరంగ నీదుర్నయంబు ఫలము
లనుభవించు వివేకుఁ డంచుఁ బాషండశా
స్త్రంబుల నర్థశాస్త్రముల మీఁదఁ
బంపువెట్టిన మన పౌఁజుల ముందట
నిలిచె సరస్వతి జలజహస్త

గీ. యగుఁచు వేదపురాణేతిహాసతర్క
శాస్త్రములు శైవవైష్ణవసౌరముఖ్య
బహువిధాగమ జాలంబు బలిసికొలువ
నిర్మలాంగంబు పండువెన్నెలలుగాయ. 60

శా. ఆవాణీసతి యగ్రభాగమున సాంఖ్య న్యాయ కాణాద భా
ష్యావళ్యావృతపార్శ్వయై దశశతన్యాయస్ఫు రద్బాహ యై
తా వేదత్రయలోచనత్రితయయై ధర్మాస్యయై సంగర
క్ష్మావిక్రీడకు వచ్చె దుర్గవలె మీమాంసామహాదేవియున్. 61

ఆ.వె. అనిన శాంతి పలికె నమ్మ! యీతర్కాగ
మంబు లొకటి కొకటి మచ్చరించు
చుండు నెపుడు నిప్పు డొక్కటై యుండుట
యెట్టు చెప్పు మనినఁ బట్టి! వినుము. 62

క. తమలోన నొంటకుండిన
సమసంభవు లైనవారు శత్రులయెడలన్
సమయము గూడుదు రెదిరికిఁ
దమగు ట్టిచ్చుట శుభప్రదముగా దగుటన్. 63

గీ. కాన వేదప్రసూతంబు లైనశాస్త్ర
సంచయంబులు వేదరక్షణము కొఱకు

నాస్తికులు గెల్వ నొక్కటౌ నాగమములు
తత్త్వమే చెప్పఁగాన భేదంబులేదు. 64

శా. తత్త్వం బవ్యయ మచ్యుతం బమల మద్వంద్వా బనాకార మా
తత్త్వంబే గుణయుక్తమైన హరిరుద్రబ్రహ్మముఖ్యాఖ్యమౌఁ
దత్త్వార్థం బిది వేఱె చెప్ప బహుశాస్త్రప్రోక్తమార్గంబు లా
తత్త్వం బందె యడంగుఁ జూడఁగ సముద్రం బందు నేర్లుం బలెన్. 65

వ. అప్పుడు. 66

క. కరిఁ గరి హరి హరి నరదం
బరదము భటు భటుఁడుఁ దాఁకి యయ్యిరు మొనలన్
సరిఁ బోరిరి శరముద్గర
శరవాల ప్రముఖశస్త్రఘట్టన మమరన్. 67

మహాస్రగ్ధర. ప్రవహించెన్ సైనికాళీపలలనికరముల్ పంకము ల్గా మదేభ
ప్రవరోత్తుంగాంగశైలప్రకరహతరయాపాండురచ్ఛత్రపంక్తుల్
కవలై క్రీడించుచక్రాంగములగములుగాఁ గంకముల్ రంకముల్ గా
వివిధాస్త్రచ్ఛిన్నభిన్న ద్విషదవయవజోద్వృత్తరక్తస్రవంతుల్.
68

వ. ఏతాదృశరుధిర ప్రవాహావగాహ కౌతూహల విహిత కోలాహల వాచాల భూత భేతాళవిహరణ కారణంబును ఖడ్గాఖడ్గి సంప్రహరణ స్ఫురస్ఫుట విస్ఫులింగాలింగిత పతంగ కిరణంబును విశంకట కిరీటఘటిత వీరవర శిరఃకరోటి మస్తిష్కశోషక శ్యేన పటుత్రోటి కోటి విరచిత మణివికరణంబును భూతనాథాంగీకృత నూతనకపాలమాలికాభరణంబును నైన మహారణంబున మహామోహపంపున నెరజారనేయుపాషండాగమంబులకు నగ్రేసరం బైనచార్వాకతంత్రంబు కాలుమట్లనె పోయె ఖండిత పాషండాగమంబులై విజృంభించుచుండుననియు సదాగమంబులధాకకుం గాక

సాగరతీరపారసీక మగధాంగ వంగ కళింగాదిక మ్లేచ్ఛప్రాయదేశంబులం బ్రవేశించె దిగంబర కాపాలికాదులుపామరబహుళానూనమాళవాభీరములం దాఁగె న్యాయ సముదాయావయవమాంస కలితయైన మీమాంసచేత విధ్వంసితంబు లైననాస్తిక తర్కంబులు దిగంబర కాపాలికులు పోయిన త్రోవనె పోయె నంతట వస్తువిచారుండు భీమవిక్రమంబునఁ గాముని నామం బడంచె క్రమావధూటి క్రోధపారుష్యహింసాదుల గీటడంచె సంతోషండు లోభతృష్ణాదైన్యానృతవాదస్తేయ పరిగ్రహంబుల నిగ్రహించె, ననసూయ మాత్సర్యంబు నుత్సార్యఁ జేసె హర్షోత్కర్షభావన మదంబును సదమదంబు గావించె నప్పుడు వివేకమహారాజు జయలక్ష్మీపరిష్వంగపులకితాంగుండై మంగళతూర్యంబులు చెలంగ వందిసందోహప్రశంసంబులు గ్రంచుకొనఁ బరమానందంబునఁ గాశికానగరంబు బ్రవేశించె నని విన్నవించిన. 69

చ. బుధగిరిధీర శశ్వదురరీకృత బాంధవపక్షపాత ధీ
సిభవిభవాభిరామ ధరణీతరణీపరిణీత బాహ ది
క్ప్రభుసభికాభివర్ణిత శుభప్రదశోభియశఃప్రభావ సౌ
రభవిభవాభియాతి విభురాజ్యరమాధిక భాగ్యభూషితా. 70

క. ప్రఖ్యాత నాచికేతూ
పాఖ్యానమహా పబంధ పరిమళితసుధీ
వ్యాఖ్యానశ్రవణోదిత
సౌఖ్యా సంఘటితచిత్తశంకరసఖ్యా. 71

భుజంగప్రయాతము నయప్రాపితోత్తేజన ప్రౌఢశౌర్యో
దయోద్ధూతవిద్వేషిధాత్రీభుజంగ
ప్రయాతావధిక్ష్మాధరస్థాపితోద్య
జ్జయస్తంభసంభారిజంభారి భోగా. 72

గద్య. ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాద లబ్ధసారస్వ
తాభినంది నంది సింగయామాత్యపుత్ర మల్లయమనీషి
తల్లజ మలయమారుతాభిధాన ఘంటానాగయ
ప్రధాన తనయ సింగయకవిపుంగవ ప్రణీ
తంబైన ప్రబోధ చంద్రోదయంబను
మహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

(౦)

# ప్రబోధ చంద్రోదయము

## పంచమాశ్వాసము

క. శ్రీరమణీరమణీయ వి
హారసుధాపూర హారహరహసితయశో
ధారాకుధరపటువ్యా
హారవిజిత గంగమంత్ర్యనంతయ గంగా॥ 1

వ: అవధరింపు మిట్లు విన్నవించిన శ్రద్ధావధూటిం గనుంగొని విష్ణుభక్తి మహా
దేవి నీవలనం గామక్రోధాదుల పరాజయంబు విని సంతోషం బింతంత
యని చెప్పరాదు మనంబున నొక్కసందేహం బున్నది మహాహనంబున
మోహుం డేమి యయ్యె ననిన సర్వేశ్వరీ దూరదృష్టి దూరశ్రవణంబులు
మొదలయిన యోగోపవర్గంబులుం దానునెక్కడ నడంగెనోకాని యెడ
పొడ గనరాడనిన విష్ణుభక్తి చింతానుషక్త స్వాంతయైయిది యొక్కటి
మిక్కిలిం గొఱగామి యయ్యెనని యిట్లనియె. 2

క. కేళ్లంగి వ్రేసినట్లా
త్రుళ్ళడమున మోహుఁ బట్టి తునుమాడక యా
పిల్లలఁ దునుముట కూఁకటి
వేళ్ళుండన్ మసిఁడికొసలు విఱచుటగాదే 3

గీ. దండిగల్గిన బుద్ధిమంతుండు దనకు
బలిమి కలిమియుఁ గొనసాగ వలసెనేని
శత్రువు ఋణంబుఁజిచ్చు నెచ్చరికతోడఁ
గడమవెట్టక కడముట్ట నడఁపవలయు. 4

చ అతఁడును బుత్రపౌత్రవిలయంబునఁ బుట్టినశోకవహ్నిచే
వెతవడి ప్రాణముల్ విడువ వేఁడుచునుండె నటన్నవానికిన్

మతినిజ మయ్యెనేని మనమన్కృత మంతయుఁదీరు నాత్మకున్
గుతిలము మాను నాఖలునకు స్మృతిగల్గదుగాని యేమిటన్. 5

ఆ వె. అనిన శ్రద్ధపల్కె నావిష్ణుభక్తితో
దేవి నీదృఢ ప్రతిజ్ఞవలనఁ
జయ్యనన ప్రబోధచంద్రోదయంబగు
మనసు తనువుతోడ మనఁగలేదు. 6

క. అని విష్ణుభక్తియు మనం
బునకున్ వైరాగ్యమహిమ పుట్టించుటకున్
బనిచిన వ్యాససరస్వతి
చనునపు డామనసు శోకసంతాపమునన్. 7

సీ. హా! కామరాగమదాది పుత్రకులార!
కానరారేల నాకూనలార!
కడుపు చుమ్మలు చుట్టఁగా నెట్లు నేనిర్వ
హించెద నను నూఱడించరయ్య!
హా!యసూయాదికన్యకలార! నన్ననా
థుని విడిచి యిట్లుపోఁజనునే మీకు
నక్కటా! హింసాదులైన కోడండ్రార!
యెక్కడ నున్నారు దిక్కునాకు

గీ. నేది యేదితి మిమ్ముల నిన్ని నాళ్ళు
పాపకర్మపు దైవ మీపగిదిమిమ్ము
నొక్కరుని జిక్కకుండఁగ నుక్కడంచె
బాపురే నాదురంతదౌర్భాగ్య మహిమ. 8

చ. విసమువిధాన నెక్కుడు వివేకముఁ జూపుచుఁ బ్రాణమారుత
గ్రసనముచేయుచున్ దనువు రాచుచు మర్మవిభేది వేదనన్
వెసఁ గలిగింపుచుం దనువు వేఁదుఱు గొల్పెడి శోకసంజ్వరం
బసదృశభంగినంచు మన సాతురతంబడి మూర్ఛ చెందినన్. 9

గీ. చేరి సంకల్పుఁడప్పుడు సేదదేర్ప
హృదయవల్లభయైన ప్రవృత్తియెందుఁ
బోయెనోయన నద్దేవి పుత్రశోక
జనితవేదన నెదపడి సమసె ననిన 10

మ. కలకంఠీ! ననుఁ బాసి నీవెఱుఁగ వేకాలంబు నే నిన్నుఁ బా
సి లయంబందినయట్ల యుందు విధిదుశ్చేష్టా ప్రభావంబునన్
నలినాక్షీ! నినుఁ బాసియున్ బ్రతుకుచున్నాఁడన్ గదా ప్రాణముల్
బలవంతంబు లటంచు నమ్మనసు నేలం ద్రెళ్ళి మూర్ఛిల్లినన్. 11

మ. చతురత్వంబున సేదదేర్పమన సాసంకల్పుతో నాకు నీ
హితముం జేయుము నీహితత్వమున నింకే "నుష్ణ ముష్ణేణ శా
మ్యతి" యన్ మాట నిజంబుగా హృదయశోకాగ్నిం జితిజ్వాలికా
ప్రతతిన్ మానుపుకొందు నంచుఁ జితిఁ బేర్పించె సంకల్పునిన్. 12

క. అంతట డగ్గఱి యావే
దాంతసరస్వతి మనంబు సడలింపుచుఁ బ్రా
ణాంతవ్యవసాయం బిది
యింతులకుంగాక స్సకు నెన్నికయగునే? 13

క. భావంబు లనిత్యము లని
యీ వెఱుఁగవె? వినవె పెక్కు లితిహాసపురా
ణావళులు పుట్టువునకుం
జావునకును లంకెయను విచారము వలదే. 14

మ. శతకల్పాయువులైన పంకజభవుల్ శక్రాదిదిక్పాలకుల్
దితిజుల్ దివ్యమునీశ్వరుల్ వసువు అద్రిక్షోణివారాసులున్
శతకోటుల్ చనఁ బాంచభౌతికము పంచత్వంబునం బొందుట
ద్భుతమే బుద్బుద మంబులం గలియదే దుఃఖింపఁగా నేటికిన్. 15

క. లోకంబు లనిత్యములను
లోకాంతరమైన తెలివిలో నిలుప దగున్

శోకము నిత్యానిత్య వి
వేకుల చిత్తములఁ జేర వెఱచున్ మనసా! 16

క. ఏకము నిత్యము బ్రహ్మము
వైకల్పితనికృతు లున్న వస్తువు లెల్లన్
ఏకత్వ మెఱుఁగువారికి
శోకము మోహంబులేదు సుమ్మీ మనసా! 17

క. మనసు సరస్వతిఁ గనుఁగొని
జననీ! నామనసు శోకసంతాపమునన్
బొనుఁగుపడి వివేకమునకుఁ
గొనఁగొఱయై చాల నూలుకొనదని పలుకన్. 18

గీ. వాణి యతనిఁజూచి వత్స! యీవిభ్రాంతి
నీకె కాదు కలదు నిఖిలమునకు
స్నేహదోష మధికమోహంబు పుట్టించు
మోహమే యనర్థమూల మరయ. 19

శా. క్లేశప్రాయ బహుప్రియోరువిషవల్లీ బీజముల్ విత్తఁగా
నా శాస్నేహమయాంకురంబు లుదయంబౌ శోకవైశ్వానరా
వేశంబుల్ కొనసాగ నందుఁ బొడమున్ వేవేలు శాఖాశిఖల్
గా శోకద్రుమముల్ కుకూలహుతభుక్కల్పంబుచే దేహికిన్. 20

సీ. అనవుడు మనసు వేదాంతశారదఁ జూచి
దేవి! నీవెంత బోధించి తేని
శోకాగ్నిచేతఁ జీకాకైన కతమున
నెదను బ్రాణము ధరియింపఁ జాల
నంతకాలమున నిన్నవలోకనము చేయఁ
గంటిఁగా కిఁక నింతకంటె మేలు
కలుగునే యన వత్స! కాఁగాదు మరణప్ర
యత్నంబు పాపమయంబులైన

గీ. నీపరిగ్రహములును ము న్నిపుడు మీఁద
మేలుచేయంగఁ గొలఁగావు మీఁదు మిగుల
నధికదుఃఖంబు పుట్టించు నంతమొంధి
పీనికై యేల జంతువుల్ వేఁగు నకట!. 21

ఉ. ఎక్కితి వెన్ని పర్వతము లేఱులుదాఁటితి వెన్ని దేశముల్
త్రొక్కితి వెన్ని చొచ్చితివి క్రూరవనస్థలు లెన్ని యాశతో
మ్రొక్కితి వెంద ఱర్థమదమూఢుల కీవు కుటుంబరక్షకై
యక్కట! యిన్నికష్టముల నొందియు రోయవు కాఁపురంబుపైన్. 22

చ. అనవుడు నాసరస్వతికి నమ్మన సిట్లను దేవిః యానతి
చ్చినవిధమంతయుం దలఁప సిద్ధమయైనఁ దనందుఁ బుట్టి లా
లనమును బొందుచున్ హృదయలగ్నత నుండెడువాఁడు లేకపో
యిన వెత ప్రాణమారుతము లేగినకంటెను దుస్సహం బిలన్. 23

ఆ.వె. అనిన శారదాంబ మనసుఁ గనుంగొని
పట్టి మమత యింతపట్టుచేసెఁ
బెంచినట్టికోడిఁ బిల్లి భక్షించినఁ
జెంఁదువగపు పిచ్చుకందుఁ గలదెః 24

ఉ. కాన ననర్థమూల మగుకాలిన నీమమతావికారమున్
మానుటయేల దేహజననక్రియలన్ దముఁదామె చంపుచున్
బ్రాణులుకొన్ని పుర్వుల నపత్యముపేరిడి తద్వియోగశో
కానల దగ్ధలౌదు రహహాః యివి యెక్కడి మోహబంధముల్ః 25

వ. అనవుడు నమ్మనంబు వ్యాససరస్వతి గనుంగొని దేవీ! నీయానతిచ్చినట్ల
తప్పదైనను మమకారగ్రంధి దురుచ్ఛేదంబై యున్నయది వినుము. 26

క. విడువని యభ్యసనంబున
వడియెక్కిన స్నేహసూత్రవల్లులఁ బెనుపం
బడిన ఘనమోహపాశము
విడిపించుకొనంగ లేక వేఁగెద ననినన్. 27

ఉ. సాటువయైన త్రోవ మనసా! వినుమున్న భవాంబురాశిలోఁ
గోటులసంఖ్యలైన జనకుల్ జననుల్ బహుధా తనూభవుల్
గాటపు బుట్టువొందరు పోకాలరు వీరలసంగమంబు మి
థ్యాట పోరింబోరిం దలఁపుమా! కృత కృత్యుఁడవయ్యె దిత్తఱిన్. 28

గీ. జనని భవదీయవదనేందు జనితమైన
యమల బోధోపదేశ వాక్యామృతములఁ
గడుగఁబడియును దనజాడ వీడువలేక
మఱియు నామది శోకాగ్ని మలినమయ్యె. 29

క. అటుగాక మిక్కిలిని సం
కట పఱుపుచు నున్నయావగపుం డిఁకనే
మిటమాను నానతిమ్మనఁ
బటుకృప నమ్మనసుతోడ భారతి పల్కెన్. 30

ఆ వె. ఏటుపోటు వ్రేటు నేమియులేక మ
ర్మములు సెలు వాఱి మాననట్టి
భీకరంబులైన శోకవ్రణంబుల
కౌషధం బచింతయండ్రు బుధులు. 31

సీ. తల్లి! వేదాంతశాస్త్ర సరస్వతీదేవి!
ఎనసు నాకేమిట మట్టుపడక
మాటికి మాటికి మారుతాహతఘన
ప్రచ్ఛన్న చంద్రబింబంబు పోలెఁ
జింతాపరంపరఁ జిక్కి జీరయ్యెడు
విను వత్స! మానసవికృతి యొక్క
శాంత తత్త్వంబు లక్ష్యంబుచేసినఁగాని
మానదు తల్లక్ష్యమర్మ మరయ

గీ. నతిరహస్యంబు చెప్ప రాదన్యజనుల
కైనఁ గానిమ్మనీవు శోకాతురుండ
వగుట నుపదేశమిచ్చెద నది యెఱింగి
నిండుమనమున నిల్పి ధన్యుండ వగుము. 32

లయగ్రాహి. నందకధరున్ ఘనపురందరమణిప్రతిము నిందిరమనోహరు ముకుందు హరిఁగానీ
చందనమరాళ బిసకుందధవళాంగు గిరిమందిరు నుమారమణు నిందుధరుఁ గానీ
పొందుగ సదామనసునం దలఁచియైనఁ జిర మందమగుతత్పర మునిదలఁచియైనం
డెందముల పాపములు వడిం దొలఁగుఘర్మమునఁ గుందిమదుగుం దదయ డిందుపడులీలన్. 33

వ తత్పరమ బ్రహ్మానంద సాధనంబులైన యంతర్లక్ష్యంబులు బహిర్లక్ష్యంబులు ననేకవిధంబులు గలవు. వానిలోని కొన్నియుత్తమంబుల నెఱింగించెద మూలాధారంబున మొలచి షట్చక్రంబులఁ ఛించుకొని పెడతెరువునవెడలి నిజశిఖాసంస్పర్శనంబునం గరంగిన చంద్రమండల సుధాధారలు తదాధారాలవాలంబు నిండుచుండ నెడతెగని యెలమిం బెరుగనాపరఃజ్యోతిర్లతిక భావించుటయు హృదయకమలంబున నీవారశూకతనుతరంబై కనుపట్టు తేజంబను సువర్ణశలాకయందు భావనరత్నంబు గ్రుచ్చుటయు సహస్రదళ కమలాంతరస్థిత పరమాకాశంబుఁ దలంచునప్పుడు పొడము నవాహతనాదంబు వినుటయు వెండియుఁ బురుషుండుం జెలువయుంగాని యనంతకోటి సూర్యాగ్నిచంద్రులమించు తేజంబును బరిపూర్ణంబుగా సంస్మరించుటయు దృశ్యంబులన్నియు శూన్యంబులుగాఁ దలంచుటయు నిందులో నొక్కమార్గంబునంబడినఁ జాలు నతండ పరమేశ్వరుండు జిహ్వాజిడ్డంటనికైవడి సంసారదోషంబులతనిఁ బొరయవని సకల నిష్కళతత్వ స్వరూపంబు తెలిపిన మనం బూఱడిల్లి కృతార్థుండనైతినని సరస్వతీదేవిపాదంబుల కెరఁగి నిల్చినంజూచి యదేవి వత్సా!

యిప్పుడు నీహృదయంబుపదేశక్షమంబయ్యె నటుగావున నింక నొక్కటి
చెప్పెద. ౩౪

ఆ.వె. జడున కీయసారసంసారవిభ్రాంతి
కతనఁ దల్లిఁదండ్రి సతుల సుతులఁ
గడచు టధికదుఃఖకారణము వివేక
ఘనున కిది విరక్తికారణంబు. ౩౫

మ. అన వైరాగ్యుఁడు వచ్చెనిట్లనుచు నీరాంభోజపత్రంబు క
న్నను సూక్ష్మంబగుతోలు మేన నిటు లంటంజేసెఁగా కంబుజా
సనుఁ డీచందము గాకయున్న సతతస్రావ్యస్వమాంసంబు గ్రై
కొనఁ బ్రైముఁగినఁ దోలవచ్చునె శివాఘూకోగ్రకాకంబులన్. ౩౬

మ. ధన ముద్యన్నిధనంబు దేహము విపత్సంతానగేహంబు బా
మనితాంతంబు ననర్థసేమ విషయోన్మోదంబు భేదంబుగ
న్గాన లోకంబున శోక మిట్లెఱిఁగి నూల్కొలేరు ప్రాణు లక్కటా!
యనవద్యాత్మసమేధమానసుఖ పద్యాహృద్య సంచారముల్. ౩౭

సీ. అనివచింపుచుఁ జేరఁ జనుదెంచు వైరాగ్యుఁ
గని భారతీదేవి మనసుతోడ
వత్స! నీతనయుండు వైరాగ్యుఁ డేతెంచె
నితని సంభావింపు మిప్పు డనిన
మన సాసరస్వతిమాటకు హర్షించి
కదిసి మ్రొక్కినసుతుఁ గౌఁగిలించి
పుత్రక! నీవు మున్ పుట్టినప్పుడె నన్ను
విడిచిపోవుటఁ జేసి వెడఁగనైతి

గీ. నిన్నుఁ జూడంగ నిపుడు నానెమ్మనమున
నాటుకొనియున్న శోక చింతాభరంబు
ప్రొద్దు పొడపునఁ జీకట్లుపోలె దొలఁగె
ననిన వైరాగ్యుఁ డిట్లను జనకుతోడ. ౩౮

మత్తకోకిల. త్రోవఁ బాంధులు పుష్కరంబునఁ దోయదంబులు వార్ధిలో
నావికుల్ సలిలప్రవాహమున న్నగంబులు కూడుచున్
బోవుచుండెడి కైవడిం బితృపుత్రబంధుల పోక స్వా
భావికం బని కోవిదుల్ మదిఁ బట్టుకొల్పరు శోకమున్ 39

మణిగణనికరము అనవుడు మనసున నతిముదమున న
వ్వనరుహభవసుని వనజవదనా
తనయునిపలుకు లితరమరయఁగ నా
మనసునఁ గలిగినమమతయుఁ దొలఁగెన్. 40

శా. ఆవిశ్రామపుఁదోఁటలో మధుసుగంధాంధీకృతాళివ్రజ
వ్యావల్గన్మలయానిలాంకురము లావామాక్షులం జూడనేఁ
డావిర్భూత వివేకమార్జితతమఁ బైనట్టి నాబుద్ధికిన్
భావింప న్మృగతృష్ణికార్ణవసమప్రాయంబులై తోఁచెడున్. 41

వ. అనవుడు వ్యాససరస్వతి మనసుం గనుంగొని గృహస్థున కొక్కముహూర్త మాత్రంబైన నాశ్రమధర్మంబు విడిచియుండుట తగవుగాదు గావున నీ విదిమొదలు నివృత్తింగూడి విహరింపుమనిన మనస్సు సిగ్గుపడి యను మాన్నించుట యెఱింగి పుత్రకా! యిట్టిగట్టి తెలివి గలిగిన సంసారయోగికి దన కనుకూలయైనవనితం గూడి మెలంగుట ప్రబోధోదయంబునకుం బ్రాంతిగాని హానిగాదు. సకలాశ్రమంబులోన గృహస్థాశ్రమంబున భోగ మోక్షంబులు సంపాదింపఁజాలు నిది యెఱింగికదా సదాశివుం డుమాదేవి తోడ నొక్కకుత్తికగా మనుచున్నవాఁడు వెన్నుం డిందిరాదేవికిం దన డెందంబు మందిరంబు గావించి యానందంబునం బొందు నరవింద నంద నుండు చదువులమచ్చెకంటి న్మెచ్చి మొగమిచ్చి యచ్చపుమచ్చికలం బొద లెడువీరికి ముువ్వురికి నాదికారణంబైనపరమపురుషుండును జిదాత్మిక యైన పరశక్తి ననురక్తిం గూడిమాడి వేడుకలం గ్రీడింపుచుండు నటుగావున నీవు నిప్పుడు పొడమిన పరిజ్ఞానంబు పదిలపఱుపనోపు నివృత్తిమత్తకాశిని సహధర్మచారిణిగా శమదమసంతోషాదికపుత్రు లుపచారంబులు సలుప వివేకుండు భవదనుగ్రహంబున నుపనిషద్దేవిం బరిగ్రహించి యమనియ

మాది మంత్రిరక్షితంబైన యౌవరాజ్యంబు పాలింప నిన్నాజ్ఞాపింప విష్ణు భక్తిచేతం బంపువడి వచ్చిన యామైత్రి మొదలయిన చెల్లెండ్రు నలువురకుఁ గన్నులపండువుగా నాయుష్మంతుండవై సామ్రాజ్యంబు చేయుము నీకు నీరీతి చిత్తస్వాస్థ్యంబు గలిగిన క్షేత్రజ్ఞుండును నిజప్రకృతిం గూడు నది యెట్లంటేని. 42

సీ. ఈవును బుత్రసమేతుండవై తేని
శాశ్వతుఁడయ్యెను నీశ్వరుండు
భవజరామరణాద్యుపప్లవంబులఁ బొంది
యుండఁ జూడంగ నిత్యుండుఁబోలె
నొక్కఁడ యయ్యును బెక్కులు బుద్ధిమం
తులలో ననేకమూర్తులు ధరించి
చాంచల్యమునఁ బొందు జలధివీచీతతిం
బ్రతిబింబతార్కబింబంబుఁ బోలె

గీ. కొడుక! నీవు నివృత్తితోఁ గూడితేని
నిర్మలాదర్శలక్షితనీరజాప్త
బింబమును బోలి నిశ్చలత్వంబు నొంది
సంతతానందము వహించు నంతరాత్మ! 43

మ. అని బోధించిన శారదారమణిపాదాంభోజయుగ్మంబుపై
మనసత్యంతకుతూహలంబునఁ బ్రణామంబు ల్ఘటింపంగ నా
వనజాతాసనురాణియున్ మనసుతో వత్సా! మృతజ్ఞాతిబం
ధునికాయంబున కీనదిం జలుపుమా తోడ్తో నివాపాంజలుల్. 44

వ. అనవుడు నమ్మన సట్లు గావించె నిత్తెఱం గంతయు దివ్యచిత్తంబున నెఱింగి విష్ణుభక్తి మహాదేవి శ్రద్ధం గనుంగొని శ్రద్ధాంగనా! మనమనికితం బంతయుఁ బాసె నింక నీవు జీవమహారాజువృద్ధికిం జని యచ్చటం జేయ వలసిన కృత్యంబు లనుసంధింపుచుండు మని పనిచి శాంతిం జూచి నీవు వివేకునికడకుం జని యతనికిఁ బరిచారంబులు సలుపుము నేనును నతనికి

ననర్గళశ్రేయఃప్రాప్తి యగునట్లనుగ్రహించెదనని పనిచిన సమీపంబునకుం జనుదెంచి దండప్రమాణంబు గావించిన శాంతిం గనుంగొని వివేకుండు సాదరభాషణంబుల నిట్లనియె. 45

చ. ప్రియసతి నందనుల్ పౌలియఁ బెద్దకుమారుఁడు మోహుఁ డేడనో
భయమున డాఁగఁగా మనసు భారతిసూక్తి విరక్తి గాంచి ని
ర్ణయమతిఁ గ్లేశపంచకపరాఙ్ముఖుఁ డయ్యె నటౌటఁజేసి య
వ్యయ మగుతత్త్వబోధమున కాత్మ సమీహ ఘటించుఁ గావుతన్. 46

గీ. నీవు మత్ప్రియ నుపనిషన్నీరజాక్షి
వెదకి ప్రార్థన మొనరించి వేగ తోడి
తెమ్ము పొమ్మన్నఁ జనుచు నత్తెఱవ గనియె
శ్రద్ధఁ దమతల్లి మధ్యమార్గంబునందు. 47

క. కని మ్రొక్కి తల్లి యెచటికిఁ
జనుదెంచెద వింత సంతసంబున నన్నున్
గనుఁగొనక సంభ్రమింపుచు
నన్నఁ బుత్రిని లెస్స యెఱిఁగి తౌనౌ వినుమా! 48

గీ. మోహముఖదుష్టవర్గంబు ముడుఁగు పడియె
శమదమాదిక శిష్టరక్షణము గలిగె
వశ్యపరివారుఁడై జగత్స్వామి యలరె
నింతకంటెను సంతోష మేది గలదు. 49

క. జీవేశ్వరుండు జీవులు
ద్వైవశమై మెలఁగ నతిసుఖస్థితి నుండం
గా వీక్షించిన నమృత
ప్లావిత మైనట్లుగాఁ దలంపరె పుత్రీ. 50

సీ. అనవుడు శాంతి యిట్లనియెను మనసుపై
భక్తి జీవునకు నేపాటిగలదు

చెఱఁ బడ్డయతనికిఁ జెఱఁ బెట్టి నతనిపైఁ
గలభక్తి మనసుపైఁ గలదు పతికి
నెట్టైన జీవుండె యేలునో యీరాజ్య
మౌ మనం బతనియం దడఁగెనేని
మఱి జీవభర్తకు మాయమీఁద ననుగ్ర
హము కొంత గలదె లేదది యనర్థ

గీ. మూలమని దాని నిప్పుడు మూలముట్టు
గాఁగ జెఱిచెద నంచు నాగ్రహము చేయుఁ
గాని యట్లైన నిప్పు డేకరణి చెపుమ
రాజునడవడి యనిన నాశ్రద్ధ పలికె 51

సీ. అనుకూలభార్య నిత్యానిత్యచింత సు
హృత్తువైరాగ్యుండు హితజనములు
యమనియమాదు లత్యాసన్న వర్తులు
శమదమాదులు నుపచారసతులు
మైత్ర్యాది వనితలు మన్ననపాత్రమై
తిరుగుచుండెడి సహచరి ముముక్షు
బలసముచ్ఛేద్యాది బలములు మోహనసం
కల్పమమత్వసంగప్రభృతులు

గీ. గాఁగ జీవేశ్వరుండు నిష్కంటకముగ
నేలుచున్నాఁడు సామ్రాజ్య మివ్విధమున
ననిన నాశాంతి సతికి నిట్లనియె జీవ
పురుషునకు ధర్మునకుఁ గొంత పొందు గలదె. 52

వ. అనవుడు శ్రద్ధాంగన తనయనుంగుఁదనయ శాంతింజూచి యిట్లనియె. వైరాగ్యోదయంబైనది మొద లిహపరసుఖవిముఖుం డగుటంజేసి జీవపురుషుండు నరకజననం బైనపాపంబునకు వెఱచినట్లు నశ్వరంబును బంధకారణంబును నగు పుణ్యంబునకు వెఱచుఁ దత్సుకృతకర్మంబును నిష్కా-

మం బయ్యేనేని యెట్టకేలకు నించుకంత యంగీకరించు ధర్ముండును జీవపురుషుండు ప్రత్యక్షప్రవణుం డగుట యెఱింగి తన్నుఁ గృతకృత్యుఁగా దలంచుకొని తనుదానె వదలువల్లయ్యె నన శాంతి తల్లిం జూచి యింత యును లెస్స యెఱింగించితివి నాఁడు యుద్ధమధ్యంబునఁ బరాజితుండై యోగోపసర్గంబులుం దానును గూడ డాఁగిన మోహుం డేమిచేసె ననిన శ్రద్ధాంగన తనకూఁతు శాంతి నవలోకించి యట్టిదురవస్థం బొంది మహామోహుండను దురాత్ముండు జీవపురుషుం డుపసర్గసక్తుండైన వివేకుండు నుపనిషచ్చింత దొఱంగు నని నిశ్చయించి మధుమతింగూర్చి దూర దృష్టి దూరశ్రవణంబులు మొదలైన యుపసర్గంబులం బనిచిన నవియును జీవపురుషునియొద్దికిం జని యింద్రజాలవిద్యఁ జూపుటయుఁ దదనుభావంబునఁ. 53

సీ॥ శతకోటియోజనశబ్దంబు లైనను
వీనుల కప్పుడె వినఁగవచ్చె
ధారుణీగర్భనిధానస్థలంబులు
కన్నుల కప్పుడె కానవచ్చె
నశ్రుతవ్యాఖ్యాన మాశుకవిత్వంబు
జిహ్వకు నప్పుడే చెప్పవచ్చె
నీలోకములలోన నెచ్చోటికైనను
నడుగుల కప్పుడె నడువవచ్చెఁ

గీ. బరశరీర ప్రవేశంబు జరపవచ్చె
స్త్రీల నాకర్షణమ్ములు చేయవచ్చెఁ
దలఁచి నటువంటి రూపంబు దాల్పవచ్చె
బురుషున కదృశ్యరూపంబు బొందవచ్చె. 54

క. ఆవేశన్ మది విదిత
స్థావాసకృతాభిమాను లగువేల్పులు దన్
సేవింపఁగ నమ్మధుమతి
జీవేశ్వరుఁ గదియ మాత్రఁ జిత్రము కాఁగన్. 55

కందగర్భితమణిగణనికరము. కలికి యొకతె యలకము ఱలిబలమున్
బలె నలికతలముపయిఁ గడలుకొనన్
గలకల నగియెడు కనుఁగవతళుకుల్
తళతళ మెఱయఁగఁ దను బలుకుటయున్. 56

సీ. పోవుచో నప్పు డప్పురుషుని యెదుటఁ గ
నృట్టె సిద్ధాహ్వయపట్టణంబు
కనకసైకతరత్న కలహంస సంసదా
నందిత రమణీయ నదులతోడ
మరకతచ్ఛాయ కోమలదళ ప్రచ్ఛన్న
వాచాలశుకవనవాటితోడ
సౌధ కక్ష్యాంతర సంచారపాంచాలికా
సమయువతిసంఘంబుతోడ

గీ. స్పృమరహిమవారి ధారాగృహములతోడ
భ్రమరసంకులకమలాకరములతోడ
విమలినవిధుకాంతమణికుట్టిమములతోడ
సమదమాయూరశైలకుట్టిమములతోడ. 57

వ. అట్లతిమనోహరంబును నానారత్నమయంబునునై యింద్రచాపనిర్మితంబునుం బోలెనున్నయప్పురంబు ప్రవేశించునప్పు డుప్పరిగల మీఁద నుండి తనమీఁద నవ్వులుం బువ్వులుం జల్లు విద్యాధరపల్లవాధరలను హరివాణంబుల నిల్పిన రత్నంపుంగళుకులఁ గన్నులతళుకుల నివాళించుయక్షపద్మాననలను సరిలేనిరూపుల కోపులనటించు నచ్చరవ చ్చెకఁటులను దమకోమలశరీరసంపదలం బొదలు వీణెల మేళనంబులు సమేళఁబులు నెఱపుగంధర్వ చందనగంధులను విలోకించుచు వివిధవితానతోరణ ప్రసవమరంద బిందుతుంది లేందిందిరం బైనరాజమందిరంబు ప్రవేశించె నంత. 58

సీ. కంకణంబులు మ్రోయఁ గడిగెఁ బాదాబ్జంబు
ఉరుకుచంబులు గల యొకమిటారి
చెకచెక చెక్కుల యొక చకోరేక్షణ
కట్టాణిముత్యాలగద్దె నిలిపె
లీలఁ గర్పూరతాంబూల మర్పణఁ జేసె
వెకలిమాటల తోడి యొకపిసాళి
నకనక లైన నెన్నడల యొక్కలతాంగి
చొక్కపుఁజెంగల్వసురటి విసరె

గీ. నిట్టిసంసారసుఖము చేపట్టె నాత్మ
మాయ మునుపటనే యిది మంచిదనియె
నంతకైనను మనసు తా ననుమతించి
యుబ్బి ముశ్నాడి సంకల్పుఁ డుత్సహించె. 59

క. అన విని శాంతిమృగేక్షణ
జననీ జీవుం డసారసంసారసుఖం
బను వలఁ గ్రమ్మఱఁ జిక్కెనె
యనవుడు శ్రద్ధావధూటి యాత్మజతోడన్. 60

శా. అంతన్ జీవుని పార్శ్వవర్తి యగుతర్కామాత్యుఁ డాయిద్దఱిన్
సంతప్తాయసఖండలోహికకటాక్షక్రూరుఁడై చూచి వీ
రెంతే కష్టమతుల్ సభాజ్ఞబకముల్ హేయంపుసంసారవి
భ్రాంతిజ్వాలల నిన్నుఁ ద్రోయ నకటా భావింపలే వీశ్వరా! 61

క. గాటపు సంసారాంబుధి
దాఁటం గ్రైకొన్నయోగతరి విడిచి వృథా
యేటికి నీ వీనిప్పుల
యేటం బడెదన్న జీవుఁ డిది యేననుచున్. 62

ఉత్సాహ. మేలుమేలు తర్క నన్ను మేలుకొల్పి యెంతయున్
మేలుచేసి తనుచు నతని మెచ్చిమెచ్చి పొగడుచున్

జాలుఁ జాలు నింక విషయసంగ మనుచు మఘపతిన్
జాల దిక్కరించె ననిన శాంతి సంతసంబునన్. 63

క. జననీ నామదిలోపలి
మనికిత మంతయును బాసె మఱి యెచ్చటికన్
జనియెద వన జీవేశ్వరుఁ
డనుపంగ వివేకుఁ బిల్వ నరిగెద ననినన్. 64

ఆ.వె నన్ను నవ్వివేకనరనాథుఁ డుపనిష
త్తురుణిఁ బిల్వ నంపెఁ దల్లి నీవు
నతనిఁ బురుషునొద్ద కతివేగఁ దోతెమ్ము
తెత్తు నేను నుపనిషత్తు వెదకి. 65

క. అని శాంతిశ్రద్ధలు తమ
పనులకుఁ జని రంత జీవపతి యాత్మగతం
బున విష్ణుభక్తిమహిమకు
నెనలేదని చొక్కిచొక్కి యిట్లని పలికెన్. 66

సీ. అసదృశక్లేశోర్మ లన్నియు దాఁటితి
దృఢమమత్వములను దెరలఁ బడక
తప్పించుకొంటి నుద్యత్క్రోధబాడబ
జ్వలనసముద్భటజ్వాలమునకు
విడిపించుకొంటి నక్కడకక్కడకు నడ్డ
పడెడి తృష్ణాలతాబంధనములు
పుత్రపౌత్రకళత్రమిత్రవక్రగ్రహ
మర్మగగ్రంథులు మాన్పుకొంటి

గీ. ఘోరసంసారవారిధి తీరమునకుఁ
జేరితిని గాన నింక నే సిలుగు లేదు
నాకు నొడగూడె నిర్భరానందలీల
బాపురే విష్ణుభక్తి కృపాగుణంబు.

వ. అని పురుషుండు సంతోషించునవసరంబున వివేకమహారాజు శ్రద్ధాంగనాసామేతుండై చనుదెంచి జీవపురుషున కభివాదనంబు చేసిన నప్పురుషుండు వివేకుం జూచి వత్సా! నీకు మేము మ్రొక్కందగుఁ గాని నీచేత మ్రొక్కించుకొనుటతగదు. జ్ఞానవృద్ధుండవు నుపదేశకర్తవుంగాన మాకుఁ బితృసమానుండవు. మున్ను ధర్మమార్గంబు దప్పి నష్టసంజ్ఞులైనవేల్పులు తమ తనయులచేత బోధితులైరి గావున నీవును బితృత్వంబు వహించుట ధర్మంబని పురుషుండు వివేకుని బహుభంగులఁ బ్రస్తుతింపుచుండె నట శాంతియు విష్ణుభక్తివలన మున్నెఱింగినదిగావున గోవిందమందిరంబైన మందరగిరి కందరంబున శ్రీగీతమఱుంగునం దర్కవిద్యా భయభ్రాంతయై యున్నయుపనిషత్తరుణి కడకుంజని తోడుకొని వచ్చుసమయంబున నయ్యుపనిషత్తరుణికడకుం జని తోడుకొని వచ్చుసమయంబున నయ్యుపనిషత్తరుణి శాంతిం జూచి నెచ్చెలీ! యతండు నామచ్చిక నెల్లను బొరపొచ్చెంబు చేసి నన్ను నిన్నిదినంబు లొల్లకుండెనఁ దథావిధాపన్నగదంష్ట్రాంకురకుహరాంతకుహరంబునఁ జిక్కియున్న వివేకమహారాజు నిట్లని దూఱం దగవు గాదనిన శాంతిం జూచి చెలియా! వివేకుని కడ్డంబులాడెదవుగాని నాపడ్డపాట్లెఱుంగవుగదా యనుచు దైన్యభాషణంబుల నిట్లనియె. 68

ఉత్సాహ. కన్నకన్న ధూర్తులెల్లఁ గాసిపెట్టి దాసిఁగా
నన్ను నేల వలసి తివియు నలియు బాహుకటకముల్
చిన్నపోయె మణులు రాలెఁ జిక్కుపడియెఁ గురులు న
న్నిన్నినాళ్ళు నవ్వివేకుఁ డిట్లు తప్పు చేయుటన్. 69

సీ. నావుడు నుపనిషద్దేవి కిట్లను శాంతి
తలఁప వివేకుని తప్పుగాదు
కపట మహామోహఖలుఁడు ప్రబోధోద
యముఁ జూడఁజాలక యాత్మకామ
ముఖ్యవిఘ్నంబులు మొలపించి నిను వివే
కునిఁ బెడఁబాపి యఘోరదురిత

ఫలమునఁ దనుదానె భగ్నమై పోయె నీ
కోర్కు లన్నియు నొడఁగూడె నిపుడు

గీ. నీవు నిలువంగ వలదిఁక నిట్టిపాట్ల
కోర్చి పతిమేలు గోరుచునుంటిగాన
నిన్నుఁ బోలంగఁ గులసతు లున్నవారె
కావున వివేకభూపాలుఁ గనుము మనుము. 70

కం. అన నుపనిషత్తు శాంతిం
గని యిట్లనె వినుము చెలియ గారవమున న
న్ననుపుచు భగవద్గీతా
వనిత రహస్యమున నొక్కవాక్యము చెప్పెన్. 71

క చని యేరికైనజీవుఁడు
పెనిమిటి యగు నవ్వివేకపృథివీశుఁడుఁ బ
ల్కినమాటలకు సదుత్తర
మొనరింపఁ బ్రబోధచంద్రుఁ డుదయము నొందున్. 72

మానిని అంచుఁ గృపామతి నానతియిచ్చె వయస్యగతత్రపనై యెట్లుగాఁ
గొంచక పెద్దలకుం బ్రతిమాటలు గొబ్బున నే నొనగూర్తు ననన్
జంచలలోచన శాంతి మహోపనిషత్స్తుతి కిట్లను శారద వా
యించు విపంచి నటించుచు మించి రహించు మృదూక్తుల నింపొదవన్. 73

ఉ జీవునకున్ వివేకునకుఁ జెప్పెఁ జుమీ హరిభక్తి మున్ను నీ
చే వివరంబుగా వినినఁ జిత్తములోపలిచిక్కు దీఱునం
చీవిధమెల్ల నీవెఱిఁగి యింక వివేకున కాత్మకున్ మనో-
భావకురాలవై మెలఁగి పాపుము వారల సంశయస్థితుల్. 74

అ వె. అనిన నుపనిషత్తు నాత్మని దగ్గఱి
వినతి చేయఁ జూచి వినయమునను

దల్లి! మేము చేయఁదగు నీకు నీనమ
స్కార మమలబోధ కర్త్రివగుట. 75

క. దేవీ! నీకుం దల్లికి
భావింపఁగ నెంతవాసు భవబంధములన్
గావించుఁ దల్లిఁద్రుంతువు
నీ పీసుజ్ఞానబోధ నిశిత కృపాణిన్. 76

తోటకము. అని పల్కి వివేకున కర్థిమహో
పనిషత్సతి మ్రొక్కి యుపాంతర భూ
మి నధిష్ఠితయైన నమేయకృపన్
గని జీవుఁడు పల్కె సకౌతుకుఁడై. 77

విద్యున్మాల అమ్మా! యిన్నా ళ్ళత్యంతాయా
సమ్మం జెందన్ సచ్ఛన్నా కా
రమ్మం జొప్పారంగా నెచ్చో
నేమ్మె నె మ్మొందున్ నీవుంటన్. 78

చ. మతముల రచ్చలన్ దివిజమందిర తీర్థతటంబులన్ వృథా
పతయులఁ గూడియుండ బహువాసరముల్ చనె నన్నవారు నీ
కఠినతరార్థముల్ తెలియఁగాఁ గలరే యన లేరు వాదక
ర్మఠులు షడుక్తిచోళసతిమాటలకై వడి సంశయింపుచున్. 79

గీ. వేదులనుచుఁ బురాణార్థవేదులనుచుఁ
వాదులనుచును నద్వైతవాదులనుచుఁ
బరధనాపేక్ష నూరక తిరుగువారు
కానఁ గల్గరె మదీయార్థగౌరవంబు. 80

సీ. అంతటఁ గృష్ణాజి నాజ్యసమిజ్జుహూ
స్రువపాత్రపశ్విష్టి సోమముఖ్య
యాగపరీవారయజ్ఞవిద్యాదేవి

బహువిధపుస్తక భారసహిత
యై రాఁగఁ జూచి నాయర్థ మేపాటైన
నిది యొఱుంగనె యంచుఁగడ్డియ నరుగ
నదినన్నుఁ బూజించి యమ్మ! నీకెయ్యది
కోర్కి- చెప్పు మటన్నఁ గొనినాళ్ళు

గీ. నన్ని మడుకొమ్ము కరుణ ననాథ ననిన
నదియు నీకర్మ మేమని యడుగుటయును
దెలియ నిట్లంటి మంధానకలితసలిల
జలధిజనితసుధాసార చారుఫణితి. 81

ఉ. ఎవ్వనియందు విశ్వ ముదయించు నడంగుఁ దలంప నిజగం
బెవ్వనిదీప్తిఁ గానఁబడు నెవ్వనితేజము చిత్సుఖాత్మకం
బెవ్వనిఁ బుణ్యులెల్ల గుణియింపుచు ద్వైతతమంబుఁ బాసి తా
రెవ్వలనన్ భవంబునకు నేగరు వాని నుతింతు నక్రియన్. 82

వ. అనవుడుఁ దన్నుం గనుంగొని యజ్ఞవిద్య సాక్షేపంబుగా నిట్లనియె. మొదలు నక్రియుం డగుపురుషున కీశ్వరత్వం బెక్కడిది భవచ్ఛేదన సామర్థ్యంబు సత్కర్మంబునకుం గలదు గాని వస్తువిచారంబు బుద్ధికిలేదు గావున నతండు భవచ్ఛేదనకరంబు లైనసత్కర్మంబులు శాంతమన స్కుండై చేసి నూతేండ్లు బ్రతకవలయునట్లు గావున నప్రయోజంబైన నీమతంబు మాకసమ్మతంబు నీకుం గనుకఁ గొన్నిదినంబు లిచ్చట నుండఁ దలంపుగలదేని కర్తయు భోక్తయునైన పురుషునిం బ్రశంసింపుచు నుండుమని పలికెననిన వివేకుండు వికవికనవ్వి హోమధూమశ్యామలిత నయనయైన యజ్ఞవిద్యదుష్ప్రజ్ఞత్వంబునుం గుతర్కత్వంబును నేమని స్వభావంబున నచంచలంబగు లోహంబు దానచేతనం బయ్యుఁ జుంబక పాషాణ సన్నిధానంబునం గదలు కరణి నస్వతంత్ర యగుమాయ యీ శ్వరదృష్టి ప్రేరితయై చేష్టించి జగంబులు కల్పించుచుండు నిట్టి యీశ్వ రుని మహిమ తమోంధు లయినవారలు గాన లేరు. కర్మంబులచేత నజ్ఞా

నమయ సంసారంబు చేడుననుట చీకటిచేతఁ జీకటి చెడు ననుటగాదె స్వభావవిలీనంబులుఁ దమోమయంబులు నైనజగంబు లెవ్వని తేజంబు వలనం బ్రకాశించునట్టి పరమపురుషు నెఱింగిన ధన్యుండు మృత్యువును గెలుచు నిదియె తక్క భవబంధనధిక్కారియగు మార్గంబు వేఱొక్కటి లేదనిన జీవపురుషుం డుపనిషత్తుం జూచి యజ్ఞవిద్య మఱియు నేమనియెం జెప్పుమనిన. 83

తరళ. వినుము తన్మఖవిద్య యుట్లను వింతగా ననుఁ జూచి యో
వనిత నీదగునట్టి దుస్సహవాసవాసన నాహితుల్
మనసులోపలఁ గర్మకాండము మానఁ జూచెద రింతటన్
జనుము నీ కనువైన చోటికిఁ జాలు నీకెద ప్రొక్కెదన్ 84

క. అంటను నచట వెడలి నేఁ
గంటిన్ మీమాంసఁ గర్మకాండ సహచరిన్
వెంట గుదియైన కర్మపుఁ
బంటల వేర్వేఱ నేరుపఱిచిన దానిన్. 85

ఆ వె చూచి యజ్ఞవిద్యజోటి వేఁడినయట్లు
వేఁడ నదియు నన్ను వివరముగను
యజ్ఞవిద్య యడిగినట్ల న న్నడిగిన
నంటి దానితోడ నన్నయట్లు. 86

వ. అపుడు. 87

సీ. అప్పుడు మీమాంస యాత్మశిష్యులవద
నాంభోజములు గదియంగఁ జూచి
యీకాంతమాటలు లోకోత్తర ఫలంబు
లనుభవింపఁగఁ జేయు నాత్మయట్లు
గానఁ గర్మోపయోగమున నిచ్చటనుండ
నిం డన నొకశిష్యుఁ డిచ్చగించె

నంతఁ గుమారిలుం దను హితశిష్యుండు
మీమాంసఁ జూచి యీకోమలాఁగి

గీ. పొగడ దుపయుక్తకర్మనిఁ బురుషు నెందుఁ
దానకర్తయు భోక్తయౌ వానిఁ గాని
యనిన మఱియొక ప్రియ శిష్యుఁడనియెనొక్క
పురుషుఁడేకాక వేఱెయీశ్వరుడు గలఁడె. 83

క. అనినఁ గుమారిలగురుఁ డి
ట్లను లౌకిక పురుషకంటె నపరుఁడు గలఁడా
యని పలుకంగా నేఁటికి
వినుమాః యని చెప్పఁదొడఁగె వివరము గాఁగన్ 89

ఉ. ఆతఁడు చూచుచుండు జగదావళి చేష్టలు సర్వసాక్షియై
యీతఁడు మోహబద్ధుఁ డతఁడిచ్చుఁ గ్రియాఫలమానఁ జేయుఁడా
నీతఁడు తత్ఫలంబు లతఁ డేలు శరీరుల నెల్ల నీతఁ డి
చ్చాతతకర్మశేష గతసంగుఁ డతండతఁ డౌట యెట్లనన్. 90

క. అనవిని వివేకనరపతి
ఘనసంతోషాబ్ధిఁ దేలి కౌమారిలుఁడా
కని పలికితి వౌ నౌరా
మనుమా కల్పం బటంచు మఱియున్ మఱియున్. 91

భుజంగప్రయాతము. సుపర్ణంబు లారెండు జోకై మహాపా
దపం బొక్కటందుండుఁ దత్పక్షులం దొ
క్కపక్షీశ్వరుం డాను గాంక్షన్ ఫలం బొ
క్క పక్షిశుఁ డొల్లండు కాంతి న్వెలుంగున్. 92

క. అనినఁ బురుషుఁ డుపనిష
ద్వనితామణిఁ జూచి యిట్లు దైన్యంబున నీ

చనినతెరు వెల్లఁ జెప్పుము
జననీ! యనఁ బలికె నుపనిషత్సతి మఱియున్. 93

సీ అంత మీమాంసచే నసిపించుకొని తర్క
విద్యలఁ బొడగంటి వివిధమతుల
నందు నొక్కతె నిగ్రహచ్ఛలజాతిమ
న్న్యాయాలి చెవిదండ నను జల్ప
మునఁ దాను బహువాదములు చేయు నొక్కతె
విశ్వవిశేషంబు విస్తరించు
నొకతె పురుషుఁడును బ్రకృతియు వేఱను
క్రమమున మహదహంకారముఖ్య

గీ. తత్త్వగణనా పరాయణత్వంబు దాల్చి
నట్టివారల డాయంగ నరిగి చోటు
వేడ నీకర్మ మేమని విద్య లడిగె
నంటి మీమాంసతోడ నన్నట్ల నేను. 94

వ అప్పుడు వారిలో నొక్కతర్కవిద్య కర్కశభాషణంబుల నోసి యభాసు రాలా! విశ్వంబును బరమాణువులవలన జనియించెననక నిమిత్తకారణంబున యీశ్వరునివలన జనియించెననుచు వదరెదవని యదరవైచె. మఱియును వెక్కసపుటలుక నోసి యోసి! జీవుండె యీశ్వరుండనుచు నద్దేవునికి లేనివికారంబును వినాశధర్మంబు నాపాదించెదవని కోపించె వెండియు నొక్కతె మండిపడి యోసి! పండిత విశ్వంబును బ్రకృతివలనఁ బుట్టినంటి వని తిట్టె ననిన వివేకుండు కటకటా! పాపతర్కవిద్య లెట్టిదుర్మతులు పరమాణువులుం బ్రకృతియునుపాదానంబులనుట మిథ్యాప్రమేయజాతంబు ఘటపటాదికంబువోలెఁ గార్యంబని యెఱుంగలేక చీకుద్రవ్వేడిని బుట్టుటయుఁ జెడుటయుఁ గలిగి గంధర్వనగరస్వప్నేంద్రజాలంబులీల నిజంబు గాని జగంబు స్వాత్మావబోధుండైన శివుని నెఱుంగనివారికి ముక్తాశుక్తి వెండియైనకరణి దోఁచునెఱుకగలవారికి రజ్జువు సర్పంబు గానిపగిది నిజంబు తోఁచు నిర్వికారత్వంబు వికారంబుగాఁ దెలియుట ముగ్ధవధూవికల్పవిలసి

తంబు నా నావర్ణంబులయినమేఘంబుల వికారంబుగగనంబునకు మూఢు లా
పాదించుకరణిం బ్రపంచోదయప్రళయంబులు పరమేశ్వరునికాపాదింతురు
గాకనిత్యనిర్మలనిష్క్రళత్వంబులు గల యతనికి నొక్కవికారంబుగలదే
యనిపలుకు వివేకునింజూచి పురుషుడు నా ర్థించి యుపనిషత్తుం జూచి
తర్కవిద్యలు నీతోడ మఱేమి పలికె నని ననుపనిషద్వధూటియిట్లనియె 95

ఉ అంతటఁ దర్కవిద్యలు వృథాతిశయంబున దొమ్మి రేఁగి యీ
జంత జగల్లయంబున విశంకటముక్తి ఘటించునంచు నే
త్యంతముఁ బ్రేలుచున్నయది నాస్తికురాలిటఁ బట్టికట్టి బా
ధింత మటంచు నందఱు నతిత్వరితంబున వెంటఁ బట్టినన్. 96

మహాస్రగ్ధర. తలపీడన్ గోకజాఱన్ దరళకుచతటీతారహారాళిముక్తా
ఫలము ల్చల్లాడిరాలన్ బదకరకటకభ్రష్టభూషావిశేషం
బులు చొప్పుల్దప్ప నెండం బుకపుర నడుగు ల్పొక్కఁగాఁగుక్కలడ్డ
ములు వెంటంబట్టి వేగంబునఁ జనుహరిణీపోతముంబోలె భీతిన్.
97

స్రగ్విణి. దండకారణ్యమధ్యంబు కాల్దో్రవలో
గుండనేఁ గవ్వపుంగొండకుం బోవ నం
దుండు శ్రీవిష్ణుభృత్యుల్ సముద్దండదో
ర్దండ నృత్యద్గదాదండ చండాకృతిన్. 98

ఆ వె. వెడలి నన్నుఁ జూచి వెఱవకు వెఱవకు
మనుచుఁ గరుణ నాకు నభయమిచ్చి
తర్క విద్యలను బ్రతారించి మోఁదిరి
గుదెల నెముకలెల్ల గుల్లలుగను. 99

సీ అప్పుడాతర్కవిద్యలు పికాపికలై య
దాయదలై దిగంతముల కుఱికె
నాపుత్రి శ్రీగీత నను జేరఁగా వచ్చి

కడుసంభ్రమంబునఁ గౌఁగిలించి
నాదువృత్తాంతమంతయు విని నన్నూఱ
డించి యో తల్లి! దుఃఖించ వలదు
నీకుఁ గీడొనరించునీచులఁ జూడఁ జా
లుఁడె విశ్వసాక్షి త్రిలోకవిభుఁడు.

గీ చెప్పఁడే తొల్లి తెలియ నాచిన్మయుండు
ఎవ్వరేమనినా నావారి కెగ్గుదలఁచి
రట్టిమనుజాధములనెల్ల నసురయోని
సంభవులఁ జేతు నేనని చక్రధరుఁడు. 100

క తను నెఱుఁగనివారల నే
మనగలదనఁ బురుషుఁ డనియె హర్షముతో నే
యనువున నేఁ బరమాత్ముఁడ
నన నుపనిషదబ్జవదన యానతి యిచ్చెన్. 101

అ వె. అతనికంటె వేఱ యనరాదు నిన్ను నీ
కంటె వేఱ యనఁగఁగాద యతని
మాయకతన ద్వివిధమై యుండునాదేవుఁ
డంబుబింబితార్క బింబ మనఁగ 102

వ అనుచు బహుప్రకారంబుల బోధించిన. 103

చ. ఉపనిషదబ్జనేత్ర వినయోక్తుల యర్థ మెఱుంగ లేక జీ
వపురుషుఁ డవ్వివేకుఁ గని వత్స! జరామరణాదిసంగతుం
జపలుని భేదయుక్తు నను సత్య చిదాత్మునిగాఁగఁ బల్కె నీ
విపులవిలోచనామణి సవిస్తరభంగుల నన్నుఁ దెల్పుమా! 104

క. నావుడు వివేకుఁ డిట్లను
నావిభునిం జూచి "తత్త్వమసి" యనువాక్యం
బే వివరించెద శాంత
బై వెలిఁగెడు తత్త్వ వయగు బెఱుఁగఁబడున్. 105

క. ఇది నేఁ గా నిది నేఁ గా
నిది నేఁ గా ననుచు నిశ్చయింపుచురా ని
ర్వదియైదు నడఁచి యెయ్యది
తుదిఁ దోఁచెడి నదియె నీవు ధ్రువమని పలికెన్. 106

వ పురుషుం డిట్లుపనిషద్వివేకులు చెప్పిన వాక్యంబుల యర్థంబులు పలుమాఱు నాలోచించునవసరంబున నిదిధ్యాసంబు వచ్చి వివేకపురుషుల కనతిదూరంబుననున్న యుపనిషద్దేవిం జేసన్న చేసి పిలిచి "విష్ణుభక్తి మహాదేవి నాచేత నొక్కరహస్యంబు నానతిచ్చి పుచ్చెనది వినుము. దేవతలు సంకల్పయోనులు గాన వివేకునిసన్నిధాన మాత్రంబున గర్భిణివైన నీజఠరగోళంబునఁ గ్రూరసత్వయగు విద్యయను కన్యకయుఁ బ్రబోధచంద్రుండను కుమారుండు నుండుట యెఱింగితి నందు విద్యాకన్యకారత్నంబును సంకర్షణవిద్యచేత మనస్సుచే సంక్రమింపం జేయుము. ప్రబోధచంద్రునిఁ బురుషుని యందు నిల్పుము. నీవును వివేకునింగూడుకొని నాసమీపమ్మునకుఁ జను దెమ్మని పలికెనని చెప్పిన నిదిధ్యాసనంబు పురుషునిఁ బ్రవేశించె నత్తఱి నుపనిషత్తరుణియు విష్ణుభక్తి యానతిచ్చిన విధంబు చేసెనప్పుడు పురుషుండు ధ్యాననిమీలితాక్షుఁడగుటయు. 107

చ. దగదగమంచుఁ గ్రొమ్మెఱుఁగుతండము క్రైవడి గంటలాఱును నె
బగుల మనంబుఁ జించుకొని మానిన విద్యయనంగఁ బుట్టి తా
నగుచు గ్రసించెఁ దత్పరిజనంబులతో నవలీల మోహు న
మ్మగువకు లోనఁ బుట్టె నసమానవిభూతి ప్రబోధచంద్రుఁడున్. 108

చ. కలుగునొ కల్గదో యవునొ కాదొకొ తోఁచునొ తోఁచదో తుదిన్
నిలుచునొ నిల్వదో యనెడు నిర్భరసంశయ మెల్లవాని ని
ర్మల సహజప్రకాశమహిమంబును బొందుదు రెల్లవారు నేఁ
గలిగినయట్టివాఁడ యిదె కల్గితి నేను ప్రబోధచంద్రుఁడన్. 109

క. అనుచుం బురుషున్ దగ్గఱి
వినతులు గావింప నతఁడు విమలానందం

బునఁ గౌఁగిలించి యాహా!
ఘనతిమిరములేని రేపకడవలె నయ్యెన్. 110

గీ. గాఢ మోహాంధకారవికల్ప నిద్రి
తములు వోవఁ బ్రబోధచంద్రముఁడు పొడమె
శ్రద్ధమతి శాంతి మొదలు సర్వమును గలయఁ
జూఁడఁగా నేనె తత్పరంజ్యోతినైతి. 111

ఉ. ఒక్కటి సంశయిం చడుగ నొల్లక యొక్కటి గూడఁ బోక యే
దొక్కటియైనఁ గోరి మఱియొక్కెడ కేగక శాంతిఁ బొంది మీ
రుక్కలి వార్ధిమోహములరోఁతలుమాని గృహంబు లందునే
నిక్కపుమౌని భావమున నెమ్మది నుండుఁ డఖండపూర్ణతన్. 112

క. ఇది కలిగె ననుచు నుబ్బక
యిది లేదని స్రుక్కుపడక యెప్పుడు సమతన్
బొదలిన సౌఖ్యామృతసం
పద లబ్బెడు విష్ణుభక్తిమహిమము కతనన్. 113

వ. అన్ని యిట్లు పురుషుండు విద్యాప్రబోధచంద్రోదయంబుననైన పరమానం
దంబునంబొందు నవసరంబున విష్ణుభక్తిమహాదేవి చనుదెంచి యింత
కాలంబునకుఁగదా మదీయమనోరథంబు సంపూర్ణంబయ్యె. మంచును విరి
యించి ప్రతాపించు సహస్రాంశుకరణి మహామోహాన మదాహితవ్యూ
హంబు విదళించి నిన్ను విలోకింపఁగలిగె ననినంబురుషుఁడు దేవీ!
భవత్ప్రసాదంబు గలవారికి నసాధ్యంబు గలదేయని పాదంబుల
కేరఁగినఁ గరుణాకటాక్ష వీక్షణంబుల నాదరించి సుజ్ఞాన సింహాస
నంబున నిలిపి పరిపూర్ణచంద్రమండల కలశపరమామృతంబున
నభిషేకించి పట్టంబుగట్టిన నతండును గృతకృత్యుండగు వివేకుండు
మంత్రిగా నిరుపమానస సదానంద సామ్రాజ్యంబు చేయుచుండెనిట్లు
సకలవేదాంతసారంబయిన ప్రబోధచంద్రోదయంబను నీమ్మహాకావ్యంబు
వినినఁ జదివిన వ్రాసిన నపరిమితార్థంబులు సిద్ధించు నీకృతియున్న

రాజ్యంబునందు సువృష్టియు ధనధాన్యాది సమృద్ధియుఁగలుగు. రాజులు ప్రజానురాగంబునమెలంగుదురు.జనులకు నఖండపూర్ణ జ్ఞానంబు సిద్ధించు. 114

శా. ముగ్గామీనపతాక నాకతటినీమూర్ధన్యసద్బోధ్యసు
స్నిగ్ధాలోకనమాత్రరక్షితకవిశ్రేణీవచోవైఖరీ
దుగ్ధాంభోధి విజృంభణాధికరణేందు స్వచ్ఛకీర్తిచ్ఛటా
దిగ్ధాశాధిప చంద్రకాంతభవనా తిప్పాంబికానందనా! 115

క. విభవమహేంద్ర యనంత
ప్రభువరకృతవివిధపుణ్యపరిపాకఫల
ప్రభవః భవాంబుధి తారక
శుభతత్వజ్ఞానసారశోభితహృదయా! 116

మంగళ మహాశ్రీ శ్రీరమణశీతకరశేఖర సరోజభవసేవిత ధనేశ్వరరహస్యో
దార వివిధోపనిషదర్థమహిమైకనిలయప్రతిభ నిర్మలచరిత్రో
దార శిబికర్ణవిబుధక్షితిజఖేచరవదాన్యగుణజైత్ర ఘనదాన
స్ఫారశిబికాధవళ చామరతురంగ కరి సంఘయుత మంగళ
మహాశ్రీ. 117

గద్య. ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వ
తాభినందినంది సింగయామాత్యపుత్ర మల్లయమనీషితల్లజ
మలయమారుతాభిధాన ఘంటనాగయ ప్రధానతనయ
సింగయకవిపుంగవ ప్రణీతంబైన ప్రబోధచం
ద్రోదయంబను మహాకావ్యంబునందు సర్వం
బును బంచమాశ్వాసము.

—o—